
మృదుత్వంలో
ఇప్పుడు ఒక
నూతన
అనుభూతి
(20 సంవత్సరాల
పరిశోధనా
ఫలితం)
మృదుత్వానికి
చివరి పేరు ట్యాంగో
అయినా ప్రసిద్ధ
బ్రాండ్‌లకంటే కూడా
12% తక్కువ ఖరీదు.
ఎక్కువ కౌంట్లలో మెత్తని
శ్రేష్ఠమైన నూలుతో
రూపొందించిన ట్యాంగో
బ్రీఫ్‌లు, బనియన్లు, ఇంతకు
ముందు మీరు ఎన్నడూ
ఎరుగని హాయైన అనుభూతిని
కలిగిస్తాయి. ఒకసారి ట్యాంగో
ధరించారంటే మరేది మెచ్చరు.
ట్యాంగో ®
అండర్‌వేర్లు - బనియన్లు
TANGO TANGO TANGO TANGO TANGO
ట్యాంగో ® అండర్ వేర్,
బనియన్లు
మీ చర్మానికున్న
మృదుత్వం గలవి-
ఏజెంటు: లాల్వాని ఎంటర్ ప్రైజెస్
ఇందర్ బాగ్, సుల్తాన్ బజార్,
హైదరాబాదు-500 001.

AA/T/5779

# ఆంధ్రపత్రిక

## రౌద్రి నామ
## సంవత్సరాది సంచిక

[డెబ్బదవ సంచిక]

[1980 - '81]

వ్యవస్థాపకులు : శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

[1938 - '72]

*

సంపాదకుడు : శివలెంక రాధాకృష్ణ

వెల రూ. 3

ఆంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము

**Supplement to Andhra Patrika Issue Dated 17-3-'80**

**Regd. No. H/VJ No. 49**

రౌద్రనామ సంవత్సరాది సంచిక

# విషయానుక్రమణిక

సంచిక 70 సంవత్సరము 1980 - '81



ముఖచిత్రం : శ్రీ కొండపల్లి శేషగిరిరావు

# కొత్త సంవత్సరంలో ఎదురయ్యే కొత్త సమస్యలు

లోకసభ ఎన్నికలలో శ్రీమతి ఇందిరాగాంధీ పార్టీ ఘనంగా గెలిచింది. కేంద్రంలో మళ్లీ కాంగ్రెసు పేరుకల రాజకీయపక్షం అధికారంలోకి వచ్చింది. శ్రీమతి గాంధీ ఇంత పెద్ద మెజారిటీ తెచ్చుకున్నప్పటికీ ముఖ్యమయిన రాష్ట్రాలు కొన్నిటిలో ఆమె పార్టీ ప్రభుత్వాలు నడవక పోవటంతో ఆమె వాటిలో రాష్ట్రపతి పరిపాలన విధింపచేశారు. అనతి కాలంలోనే, కాంగ్రెసు (ఐ) ప్రభుత్వాలే వాటిలో నెలకొనగలుగుతాయని ఆమె ఎదురుచూస్తూ ఉండవచ్చు. కాశ్మీరు సంగతే వేరుకాని భారతదేశంయొక్క ఈశాన్య సరిహద్దులో ఉన్న రాష్ట్రాలు, పశ్చిమ బెంగాలు, కేరళ, తమిళనాడు - వీటిలో కాంగ్రెసు (పేరు ఏదయినా సరే) బలంగా లేదు. సరిహద్దు రాష్ట్రాల సమస్యలు ప్రత్యేకమయినవి. కేరళ, బెంగాలులలో కమ్యూనిస్టు పార్టీలు బలంగాఉన్నాయి. తమిళనాడులో ద్రావిడ సిద్ధాంతాలని చాటే రాజకీయ పక్షాలదే బాగా పయిచెయ్యి. మిగిలిన రాష్ట్రాలలో కాంగ్రెసు పార్టీ అంశాలే వివిధ రూపాలతో పరస్పరంగా పోట్లాడుకుంటూ అధికారాన్ని చెలాయిస్తున్నాయి. వీటిలో ప్రస్తుతం శ్రీమతి గాంధీ ఆధిక్యానికి సవాలు లేకుండా ఉంది. పయిన చెప్పిన (కాంగ్రెసువారు వెనుకబడిపోయిన) రాష్ట్రాలలో ఇతరులు అధికారంలోకి రావటానికి కాంగ్రెసు వారిలో చీలికలు ఛాలావరకు కారణం అనక తప్పదు. 1969 రాష్ట్రపతి ఎన్నిక సందర్భంలో శ్రీమతి గాంధీ తమ స్వంత పార్టీ అభ్యర్థి ఓటమికోసం వీలయిన వారివద్ద సహాయం పొందటానికి ఏమాత్రం వెనుదియ్యలేదు. నేటి రాజకీయ పరిస్థితి కనీసం కొంతవరకయినా ఆమె అప్పటిలో అనుసరించిన విధానాల ఫలితం అనటంలో సందేహం లేదు. బాహాటంగా జరిగే ద్రోహానికి శిక్ష విధించటం కష్టం అని కొందరు కాంగ్రెసు నాయకులు తెలుసుకున్నారు. ఇక్కడ ఒక విషయాన్ని గమనించటంలో తప్పులేదు. శ్రీమతి గాంధీని ఎదిరించిన కాంగ్రెసు నాయకులలో కొందరు ప్రముఖులు కుల విభేదాలని బాగా వాడుకుని పయికి వచ్చినవారే కాని వారు ఒక పరిమితిని మించి కాంగ్రెసు పార్టీకి హాని కలిగించే విధంగా నడుచుకోవటానికి మాత్రం భయపడేవారు. శ్రీమతి గాంధీ పార్టీ కన్నా తమ ప్రయోజనాలకే ప్రాధాన్యం ఇస్తూ వచ్చారన్న ఆరోపణని కాదనలేకపోతున్నారు. పండిత జవహర్‌లాల్ నెహ్రూ అస్తమయం తరువాత భారతదేశంలో ఎన్నో రకాల అస్థిమిత పరిస్థితులు ఏర్పడ్డాయి. మొత్తంమీద ఆర్థికాభివృద్ధి మందగించింది. పరిశ్రమలు ఎక్కువ అయిన కొద్దీ, పాత జీవన పద్ధతులు మారినకొద్దీ సంచలనం అధికం అవుతుందని అన్నికాల మేధావులూ అంటూనే ఉంటారు. కొంత దీనివలన, కొంత కాంగ్రెసుపార్టీలో వచ్చిన పరిణామాల వలన భారతదేశం మొత్తంమీద నిలకడ తక్కువ అయిన వాతావరణం వచ్చేసింది. ఈ ధోరణి ఏమాత్రం తగ్గుముఖం పట్టలేదు. శ్రీమతి గాంధీ ఎన్నికల కేసు ఒకటి పోవటంతో భారతదేశంలో అంతదాకా కొనసాగుతూ వచ్చిన ప్రజాస్వామ్య పద్ధతి కొంతకాలంపాటు స్తంభించిపోయింది. ఈ మార్పు జనసామాన్యంలో చెప్పుకోతగిన సంచలనాన్ని కలిగించలేదనే అనాలి. 1977లో ఉత్తరాదిలో శ్రీమతిగాంధీ బాగా ఓడిపోయినా 1980లో అక్కడ మళ్లీ (లోకసభ ఎన్నికలలో) బాగానే గెలిచారు. రాజకీయాలలో స్వంత ప్రయోజనాలకోసం తేలికగా పెద్ద మార్పులు తీసుకురావాలనుకునేవారు అధికారంలోకి వస్తే ఎప్పుడు ఏమి జరుగుతుందో ఊహించటం కూడా కష్టమే. కాలానుగుణంగా వచ్చే మార్పులు కొన్ని, అధికారంలో ఉన్న వారి చాంచల్యం —ఇవి రెండూ దేశంలో ఎటువంటి సమస్యలనయినా తీసుకురాగలవు. వీటికితోడు, భారతదేశం ఉత్తరపు ఎల్లలవద్ద కొత్తరకం ఉద్రిక్త పరిస్థితి ఒకటి ఏర్పడింది. యూరోపులో కొన్ని దేశాలవలెనే ఆఫ్గనిస్తాన్ రష్యా అధీనంలోకి వెళ్లింది. రష్యా చర్య మహమ్మదీయ మతాభిమానులకి నచ్చేదికాదు. ఈ సంఘర్షణ భారతదేశానికి ఇబ్బంది కలిగిస్తోంది. దేశంలోనూ, దేశం బయటా కూడా ఉండే మహమ్మదీయ మతాభిమానులకి కోపం తెప్పించేవిధంగా నడుచుకోవటానికి భారతదేశం జంకుతోంది కాని రష్యా చర్యలని ఖండించటానికీ వెనుకాడుతోంది. రష్యాని వ్యతిరేకించే చీనా ఈ ప్రాంతంలోని ఉద్రిక్త పరిస్థితిని మరింత హెచ్చు చెయ్యవచ్చు. ఉద్రిక్తతలు పెరగటంవలన ఎవరికీ లాభం ఉండదు. భారతదేశం ఎదుర్కొనే ఎన్నో సమస్యలు వీటివలన మరింత తీవ్రం అవుతాయి. ఏడు దశాబ్దాల కాలంలో ‘ఆంధ్రపత్రిక’ ఎన్నో రకాల మార్పులని వర్ణించగలుగుతూ వచ్చింది. పత్రికలు అదుపులు లేకుండా, నిజాయతీతో ప్రజల అభిప్రాయానికి ప్రతిబింబంగా ఉండగలిగినప్పుడే రాజకీయ వ్యవస్థయొక్క స్వస్థతకి అపాయాలు తక్కువగా ఉంటాయని అనిపిస్తుంది. స్వేచ్ఛకన్నా సమానత్వమే ముఖ్యం అని అనుకునేవారి సంఖ్య ప్రపంచం అంతటా అధికం అవుతోందని కొందరు మేధావులు అంటారు. స్వేచ్ఛ తగ్గినకొద్దీ వ్యత్యాసాలు పెరిగే అవకాశాలు పెరుగుతాయి. సమానత్వం ముఖ్యం అని అనుకునేవారి అభిప్రాయాలకి విలువ తగ్గుతుంది. వ్యక్తిస్వాతంత్ర్యంలో అభిప్రాయ ప్రకటనకి సంబంధించిన స్వాతంత్ర్యం అతి ముఖ్యమయినది. బయటనుంచి వచ్చే అపాయాలని భారతదేశంవారు ధైర్యంగా ఎదుర్కొన గలగటానికి వారికి ఇంటిలో ఎంత స్వేచ్ఛఉంటే అంత మంచిదనిపిస్తుంది. రౌద్రనామ సంవత్సరంలో భారతదేశాన్ని పీడిస్తున్న సమస్యలు ఎన్నో పరిష్కారం అవుతాయని ఆశించనివారు ఉండరు.

# ఆపః పృణీత

## శ్రీ వజ్ఝల కాళిదాసు

ఓ వరుణా ! హే వరుణా
కరుణా భరణా !
రసాధీశా, జలేశా !

నీవు
సర్వాంతర్యామివి
సకల దిగ్గామివి
అఖిల ప్రేమివి
అంబుస్వామివి !

మేము
బుద్బుద ప్రాయులం
భూలోక జీవులం;
పూర్వం మేం చేసుకున్న
పుణ్యంవల్ల మమ్మల్ని
పునీతం చేస్తున్నావు
వినీతులం కాకుండా —
ఓ జలాధి దేవతా
సర్వ రసాధి దేవతా !

నీలో నిబిడమై ఉన్న అగ్ని
మాలో నింపుతున్నాది తేజస్సు
మా పాపాలని దహిస్తూ
మా లోపాలని సహిస్తూ !
కశ్మలంతో నిండిన మా శరీరాలనీ
కాలుష్యం పట్టిన మా మనస్సులనీ
ప్రక్షాళించు
పవిత్రం చెయ్యి !

చరాచర జీవకోటిని
భరిస్తూన్న భూదేవిని
సస్య సమృద్ధంగా
స్వాదుఫల పూర్ణంగా
కావించే నీ మహత్తర శక్తి
మా నరనరాల్లో
హృదయాంతరాలలో
నిరంతరం
పరుగులు పెడుతుంది !

నీలాల మేఘ భాండాలలో
నింగినంటే హిమాద్రి గండాలలో
నివసించే నీవు
ప్రవహిస్తూ వస్తావు !
హర జటాజూటాలలోంచి తరలి
హరి చరణ కమలాల మీంచి పారలి
పరవళ్ళు త్రొక్కుతూ
నురగల్లు క్రక్కుతూ
పుడమికి జీవనం పోస్తావు
కడలికి కల్యాణం చేస్తావు !

పొలాలలో పండే సస్య వికాసంలో
ఫలాలలో నిండే మాధుర్య విశేషంలో
నీ దివ్య రసస్ఫూర్తి ప్రవహిస్తుంది
నీ నవ్య కళాదీప్తి ప్రసరిస్తుంది !

డాక్టర్ బి. ఆర్. కె. రావు

విద్య, జ్ఞానము, పరిజ్ఞానము, నైపుణ్యము,
అనుభవము, శక్తిసామర్థ్యాలు కలసి రూపొందిన

# మహత్వపూర్ణ మానవ మూలధనం ఆవశ్యకత

## అర్థము

''ఒక దేశ ఆర్థిక, రాజకీయాభివృద్ధికి కీలకమైన నైపుణ్యాలు, విద్య,అనుభవముగల వ్యక్తులను సంపాదించి, వారి సంఖ్యను పెంచు ప్రక్రియ'' మానవ మూలధన ఏర్పాటు అని చెప్పబడుతుంది. అందువల్ల మానవుణ్ణి సృజనాత్మక, ఉత్పాదక మూలంగా తయారు చెయ్యడానికి అతనిమీద అతని అభివృద్ధి కొరకు చేసే పెట్టుబడితో మానవ మూలధన ఏర్పాటుకు సంబంధం ఉన్నది అని యఫ్. హెచ్. హార్బిసన్ (అమెరికన్ ఎకనామిక్ రివ్యూ, మే, 1962, హ్యూమన్ రిసోర్సెస్ ఇన్ డెవలప్‌మెంట్ ప్లానింగ్ ఇన్ మోడర్నయిజింగ్ ఎకనామిక్స్) వ్రాసాడు. మానవ వనరుల్ని తయారు చేయడానికి అయిదు మార్గాలున్నయ్యని నోబుల్ బహుమతి గ్రహీత టి. డబ్ల్యు. షుల్ట్స్ (అమెరికన్ ఎకనామిక్ రివ్యూ, మార్చి, 1961, ఇన్‌వెస్ట్‌మెంట్ ఇన్ హ్యూమన్ కేపిటల్) వ్రాసాడు: (1) మానవుని ఆయు ప్రమాణాన్ని, బలాన్ని, ఎక్కువకాలం పని చేసే శక్తిని, సత్తువను, సజీవత్వాన్ని ప్రభావితం చేసే ఆరోగ్య, సేవా సదుపాయాల మీద వివిధ రకాలుగా ఖర్చు చేయుట ద్వారా (2) వ్యాపార సంస్థలు ఏర్పాటు చేసే అప్రెంటిస్‌తో సహా ఉద్యోగంలో ఉంచి శిక్షణ ఇచ్చుట (3) ప్రాథమిక సెకండరీ, ఉన్నత స్థాయిలలో అందించే లాంఛన పూర్వక విద్య (4) ముఖ్యంగా వ్యవసాయంలోను, ఇతర విషయాల్లోను, వ్యాపార సంస్థలు ఏర్పాటు చేయనటువంటి, విస్తరణ విద్యా, అధ్యయన కార్యక్రమాలు (5) మారుతున్న ఉద్యోగావకాశాలతో సర్దుబాటయ్యేందుకు వ్యక్తులు, కుటుంబాలు ప్రవాసము పోవుట ద్వారా. సాంకేతిక మద్దతును, ప్రావీణ్యతా సేవలను అందించుటకు, నిపుణుల సలహాలను అందించడాన్ని ఈ పై జాబితాకు కలుపవచ్చు విశాలర్థంలో మానవ మూలధన ఏర్పాటుకు పెట్టుబడి చేయడమంటే ఆరోగ్యం, విద్య, సాంఘిక సేవల మీద మామూలుగా ఖర్చు చేయడమని చెప్పవచ్చు. పరిమితార్థంలో విద్య, శిక్షణ కొరకు ఖర్చు చేయడమని చెప్పవచ్చు. సాంఘిక సేవలమీద చేసే ఖర్చుకంటె విద్య, శిక్షణల మీద చేసే ఖర్చును కొలవడానికి తేలికగా వీలవ్వడంవల్ల మానవ మూలధన ఏర్పాటుకు జరిగే పెట్టుబడిని, సాంప్రదాయ సిద్ధంగా పై చెప్పిన పరిమితార్థంలోనే వివరిస్తున్నారు.

## ప్రాముఖ్యత

మానవ మూలధనం అనే అభిప్రాయం కొద్దికాలం క్రితమే ఏర్పడింది. ఆర్థికవృద్ధి ప్రక్రియలో భౌతిక మూలధనం ప్రోగు చేయడానికి మాత్రమే సాంప్రదాయసిద్ధంగా ప్రాధాన్యత ఇవ్వబడుతోంది. కాని భౌతిక మూలధన వస్తువుల వృద్ధి చాలవరకు మానవ మూలధనం ఏర్పాటుపైన ఆధారపడుతుందని హెచ్చుగా గుర్తించబడిందని, ''జ్ఞానాన్ని, నైపుణ్యాలను, దేశంలోని సర్వ ప్రజల శక్తిసామర్థ్యాలను పెంపొందించే ప్రక్రియ'' మానవ మూలధన ఏర్పాటని యఫ్. హెచ్. హార్బిసన్, సి. ఎ. మెయర్స్ (ఎడ్యుకేషన్, మేన్‌పవర్, అండ్ ఎకనామిక్ గ్రోత్, 1964) వ్రాసారు. విద్యపై సాపేక్షికంగా పెద్దమొత్తాలను ఖర్చుచేయడం అమెరికా సంయుక్తరాష్ట్రాల ఆర్థికవ్యవస్థ వేగంగా పెరగడానికి తోడ్పడ్డ కారణాలలో ఒకటయ్యిందని షుల్ట్స్, హార్బిసన్, డెనిసన్, కెండ్రిక్ మోసెస్, అబ్రమోనిట్జ్, బెకర్, మేరీబౌమన్, కుజ్‌నట్స్ మొదలైన గొప్ప ఆర్థిక శాస్త్రవేత్తల అధ్యయనాలు చెబుతున్నవి. డాములు, రోడ్లు, ఫ్యాక్టరీలు, ఇంకా ఇతర మూలధన వస్తువు[illegible] ఖర్చుచేసిన డాలర్ కంటె విద్యపై ఖర్చుచేసిన డాలరు జాతీయ [illegible]యాన్ని హెచ్చుగా పెంచుతుందని ఆ అర్థశాస్త్రజ్ఞులు అంటున్నారు. ''మన పారిశ్రామికాభివృద్ధిలోని హెచ్చుభాగము భౌతిక మూలధనంపై చేసిన పెట్టుబడివల్లగాక,మానవునిపై చేసిన పెట్టుబడివల్ల, మెరుగుచెందిన మానవులు తెచ్చిన మెరుగుదలలవల్లవచ్చింది'' అని ప్రఖ్యాత ఆర్థికశాస్త్రవేత్త గాల్‌బ్రెయిత్ అంటున్నారు.ఇంతకు ముందు ఆడంస్మిత్, థారిస్టెయిన్ బండెవిబ్లెన్ మొదలైనవారు కూడా ఉత్పత్తికార్యక్రమ నిర్వహణలో మానవ మూలధనం ప్రాముఖ్యతను గురించి చెప్పేఉన్నారు. ''దేశవాసులు సంపాదించినట్టి, ఉపయోగకరమైనట్టి మానవ శక్తిసామర్థ్యాలను'' ఆడంస్మిత్ స్థిర మూలధనంలో చేర్చిఉన్నాడు. సాంకేతికజ్ఞానము, నైపుణ్యాలు

"భౌతికేతర సాధనాలు లేక స్పర్శకందని ఆస్తులు" అని, అవి సమాజానికంతకు చెందిన ఆస్తులని, అవి లేకుండా భౌతిక మూలధనాన్ని ఉత్పాదకతాయుక్తంగా ఉపయోగించడము సాధ్యంకాదని వెబ్లెన్ చెప్పారు. అందువల్ల అల్పాభివృద్ధిదేశాల ఆర్థికాభివృద్ధి మందకొడిగా సాగడానికి మానవ మూలధన ఏర్పాటుకు పెట్టుబడి చేయకపోవడము కారణమని ఆర్థిక శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నట్లు గ్రహించవలసిఉన్నది. అల్పాభివృద్ధిదేశాల ఆర్థికవ్యవస్థలు విద్యను, జ్ఞానాన్ని, పరిజ్ఞానాన్ని విస్తృతపర్చి ప్రజల నైపుణ్యాల స్థాయిని, భౌతికసామర్థ్యం స్థాయిని పెంచితే మినహా భౌతిక మూలధనం ఉత్పాదకత దిగజారిపోతుంది.

అల్పాభివృద్ధి దేశాలు రెండు విభిన్న అంగబల సమస్యలను ఎదుర్కొంటున్నవి : (1) పారిశ్రామికాభివృద్ధికి కావలసిన కీలక నైపుణ్యాలు లేవు (2) శ్రామికులసంఖ్య అదనంగా ఉన్నది. కీలక నైపుణ్యాలు తక్కువ వడమే అదనపు శ్రామికసంఖ్య ఏర్పడడానికి చాలవరకు కారణము. అందువల్ల ఈ విభిన్న సమస్యలకు అంతర్గత నిర్భరత ఉన్నది. మానవునిలో అవసరమైన నైపుణ్యాలను ఏర్పర్చి ఉత్పాదకతగల వనరుగా రూపొందించడంద్వారాను, అతనికి లాభదాయకమైన, ఔద్యోగితను సమకూర్చడంద్వారాను ఈ సమస్యలను తీర్చాలని మానవ మూలధన ఏర్పాటు ఆలోచిస్తుంది.

అల్పాభివృద్ధి దేశాలు పెద్దఎత్తున భౌతికమూలధనాన్ని దిగుమతి చేసుకునికూడా తమ ఆర్థికవృద్ధి రేట్లను వేగంగా ముందంజ వేయించలేకపోవడానికి మానవ వనరులు అల్పాభివృద్ధిలో ఉండటమే కారణంగా కన్పిస్తోంది. అందువల్ల అల్పాభివృద్ధి దేశాలకు మానవ మూలధనాన్ని అభివృద్ధి చేయడానికి పెట్టుబడి చేయడం తప్పనిసరి ఔతోంది అందుబాటులోవున్న శ్రామిక బలగానికి నైపుణ్యాలు, జ్ఞానము లోపించినప్పటికి సాంప్రదాయక మూలధనాన్ని పెంచడంవల్ల కొంతవరకు వృద్ధిని సాధించడము సాధ్యం కావచ్చు. కాని నైపుణ్యాలు, జ్ఞానము లోపించడంవల్ల వృద్ధిరేటు చాల పరిమితంగానే ఉంటుంది. కాబట్టి "విస్తృతమౌతున్నట్టి, కొత్తగా ఏర్పర్చుతున్నట్టి ప్రభుత్వ శాఖలకు తగిన ఉద్యోగుల్ని సమకూర్చడానికి, భూమిని నూతనపద్ధతుల్లో ఉపయోగించే వ్యవస్థలను ఏర్పర్చడానికి, నూతన వ్యవసాయ పద్ధతుల్ని అమలు చేయడానికి, నూతన కమ్యూనికేషన్ మాధ్యమాలను ఏర్పర్చడానికి, పారిశ్రామికీకరణను ముందంజ వేయించడానికి, విద్యా వ్యవస్థను నిర్మించడానికి మానవ మూలధనం అవసరమౌతుంది నవకల్పన చేయడానికి, అనగా నిశ్చల సమాజాన్ని లేక సాంప్రదాయక సమాజాన్ని సచేతన సమాజంగా మార్చే ప్రక్రియను నిర్వహించడానికి వ్యూహాత్మకమైన మానవ మూలధనం పెద్ద పెద్ద మోతాదుల్లో అవసరమౌతుంది."

దేశానికి తగినంత మానవ మూలధనం ఉన్నట్లయితే ఆ దేశ భౌతికమూలధనం ఉత్పాదకతగలదిగా ఉంటుంది. అల్పాభివృద్ధి దేశాలు రోడ్లను, డాములను, విద్యుచ్ఛక్తి ఉత్పాదన కేంద్రాలను, భారీ, తేలికరకం పరిశ్రమలను, హాస్పిటల్సును, పాఠశాలలను, కళాశాలలను నిర్మించాలని అభివృద్ధి ప్రణాళికారచన సంబంధమైన ఇతర కార్యక్రమాలను అమలు జరపాలని నిర్ణయించుకు పనిచేస్తున్నవి. ఈ నిర్మాణాది కార్యక్రమాలను విజయవంతం చేయడానికి వారికి ఇంజనీర్లు, టెక్నీషియన్లు, సాంకేతిక సూపర్‌వైజర్లు, మేనేజర్లు, పరిపాలనా సిబ్బంది, సైంటిస్టులు, డాక్టర్లు, నర్సులు, వెటర్నరీ డాక్టర్లు, అగ్రోనమిస్టులు, ఎకౌంటెంట్లు, గణాంక శాస్త్రజ్ఞులు, ఆర్థికశాస్త్రవేత్తలు, సెక్రటరీలు, స్టెనోగ్రాఫర్లు మొదలైనవారు కావాలి. అటువంటి మూలధనంలో ఎవరు లోపించినా వారికి సంబంధించిన భౌతిక మూలధనం ఉత్పాదనాత్మకంగా పనిచెయ్యదు. తత్కారణంగా యంత్రాలు ఆగిపోవడము, అవి త్వరగా అరిగిపోవటము, ముడిపదార్థాలు, యంత్రాల విడిభాగాలు వృధా కావడము, ఉత్పత్తి చేయబడిన వస్తువుల్లో గుణలోపం రావడము జరుగుతుంది. "తమ ఆర్థికాభివృద్ధిని వేగంగా జరపాలని పయత్నిస్తున్న దేశాల్లో, అత్యధిక పురోగమనం సాధించిన దేశాలనుండి అత్యాధునిక యంత్రాలను తెచ్చి, మొదటిశ్రేణి ఇంజనీర్లచేత నెలకొల్పించినప్పటికి, ఉత్పత్తి [illegible]ణముకూడా తరచు లోపభూయిష్టంగా ఉంటున్నవి. ఎందువల్ల ఇందులోని చాలా సందర్భాల్లో మేనేజర్లకు, శ్రామికులకు తగినంతశిక్షణ లేకపోవడము; అనుభవం లోపించడము ఇందుకు కారణము" అని జెఫ్రెన్స్ (రిఫ్లెక్షన్స్ ఆన్ ది మెల్‌బోర్న్ కాన్ఫరెన్స్, ఐ.ఎల్.ఆర్. ఏప్రిల్ 1963) వ్రాసాడు.

అల్పాభివృద్ధి దేశాలు తమ అభివృద్ధికి భౌతికమూలధనాన్ని దిగుమతి చేసుకుంటున్నవి అయితే ఆ మూలధనంచేత పని చేయించడానికవసరమైన "కీలక నైపుణ్యాలు" లేక దానిని పూర్తిగా ఉపయోగించుకోలేకపోతున్నారు. మామూలుగా విదేశీ మూలధనంతో పాటు సాంకేతిక పరిజ్ఞానము, నైపుణ్యాలు వస్తున్నప్పటికి, అల్పాభివృద్ధి ఆర్థికవ్యవస్థల్లోని అనేకరకాల అవసరాలను, విభిన్నావసరాలను తీర్చడానికవి సరిపోవడంలేదు. అందువల్ల అల్పాభివృద్ధి ఆర్థిక వ్యవస్థల్లో మానవ మూలధనం వృద్ధిరేటు భౌతిక మూలధనం వృద్ధిరేటుకంటె తక్కువగా నున్నందువల్ల భౌతిక మూలధనాన్ని ఇముడ్చుకోవడం జరగడంలేదు. తత్కారణంగా అల్పాభివృద్ధి ఆర్థిక వ్యవస్థలు మానవ మూలధనం పెంపుదలకు పెట్టుబడి చేయడం అవసరమౌతోంది.

ఆర్థికంగా వెనుకబడి ఉండటం అల్పాభివృద్ధిదేశాల లక్షణం. ఈ వెనుకబడిన తనం హీనశ్రామిక సామర్థ్యం, ఉత్పత్తి కారకాలు కదలికలేకుండా ఉండటం, వృత్తులు వ్యాపారంలో పరిమిత ప్రత్యేకత, ఆర్థిక ఉద్యమ దారుల సరఫరా కొరతగా ఉండటం, ఆచారబద్ధమైన విలువలు, ఆర్థికమార్పుకు అవసరమైన ప్రోత్సాహాలను తగ్గించే సాంప్రదాయ బద్ధమైన సాంఘిక విలువలు మొదలైన వాటి రూపాలలో కన్పిస్తుంది. జ్ఞానంనెమ్మదిగా పెరుగుతూ అభ్యుదయాన్ని తొందరగా కదల నివ్వదు. ఏ సహజ వనరులు దొరుకుతాయి? వీలయ్యే ప్రత్యామ్నాయ ఉత్పత్తి పద్ధతులేవి? ఏ నైపుణ్యాలు అవసరము? ప్రయత్నాలను లాభసాటిగాను, హేతు యుక్తంగాను చేయడానికి ఏ సంస్థలను ఏర్పర్చాలి? విపణి వీధి పరిస్థితులు, అవకాశాలు ఎలా ఉన్నయ్యి? అనే విషయాలు తెలియనప్పుడు ప్రజల ఆర్థిక లక్షణం తక్కువగా ఉంటుంది?

ఆర్థికంగా వెనుకబడిన తనాన్ని తొలగించి, ఆర్థిక పురోగమనానికి అవసరమైన శక్తి సామర్థ్యాలను, ప్రేరణలను ప్రజల్లో ఏర్పర్చడానికి వారి జ్ఞానాన్ని, నైపుణ్యాలను పెంచాలి. నిజానికి, మానవ కారకంలో గుణాత్మక మెరుగుదల రానిదే అల్పాభివృద్ధి దేశాల్లో పురోగమనం సాధ్యం కాదు. జ్ఞాన నైపుణ్యాలతో కూడిన గుణాత్మక మెరుగుదల లేని వ్యవస్థ గొప్ప నది, దాని శాఖోపశాఖలను చూపని వనరుల పటము వంటిది. ఈ ప్రత్యేక నదిని పాఠశాల బోధన, ఉద్యోగంలో ఉండగానే నేర్పుట, ఆరోగ్యాలలో మెరుగుదల, ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన సమాచారము పెంపొందుట మొదలైన పరిస్థితులు ప్రవహించే నీటిలాగా పనిచేసి పోషించగలవని టి. డబ్ల్యు. షుల్ట్స్ (రిఫ్లెక్షన్స్ ఆన్ ఇన్వెస్ట్‌మెంట్ ఇన్ మాన్, జర్నల్ ఆఫ్ పొలిటికల్ ఎకానమి, అక్టోబరు 1962) వ్రాసారు.

## మానవ మూలధన ఏర్పాటు ఎదుర్కొనే సమస్యలు

విద్యాభివృద్ధిపై చేసే పెట్టుబడి విషయంలో మానవ మూలధన ఏర్పాటు భావన చాలా సమస్యల్ని ఎదుర్కోవలసి వస్తుంది. కావలసిన మానవ మూలధనం మొత్తం ఎంత? అభివృద్ధికి సంబంధించిన ఏ దశలో మానవ మూలధనం చాలా ఎక్కువగా కావాలి? దానిని ఏ రేటులో సమీకరించాలి? ఏ రకమైన విద్యను, ఎంతవరకు, ఎప్పుడు అందించాలి? విద్యాభివృద్ధిమీద చేసే పెట్టుబడివల్ల వచ్చే ఫలితాలను కొలిచే దెలాగు?

అల్పాభివృద్ధి దేశాల్లో మానవ మూలధనం ఎంతగా అవసరమౌతుందో అంచనా చేయడం కష్టం. ఈ సమస్యకు, మానవ మూలధనం చాలా ఎక్కువగా అవసరమయ్యే తరువాత దశకు సంబంధం ఉన్నది. యూరోపు దేశాల్లోను, అమెరికాలోను ఆర్థికాభివృద్ధి తన తొలి దశలో భౌతిక మూలధనంపై జరిగిన పెట్టుబడిమీద ఆధారపడినది. కాని అల్పాభివృద్ధి దేశాల తొలి అభివృద్ధి దశల్లో అభివృద్ధిగొలుసులో లోపించిన లింకులను సమకూర్చడానికి వివిధ వృత్తులలో కావలసిన విద్యావంతుల రూపంలో మానవ మూలధనం ఎక్కువగా కావలసి ఉన్నది. సంశ్లిష్టమైన పరికరాలను, ఉత్పత్తి పద్ధతులను నెలకొల్పినట్లయితే, వాటిని నిర్వహించడానికి ఆర్ట్స్ గ్రాడ్యుయేట్ల కంటె కీలక నైపుణ్యాలను సంపాదించిన అంగబలం హెచ్చుగా అవసరమౌతుంది. ఉద్యమదార్లు, వ్యాపార నిర్వాహకులు, పాలనా నైపుణ్యం గలవారు, సైంటిస్టులు, ఇంజనీర్లు, డాక్టర్లు మొదలైనవారు హెచ్చుగా కావాలి.

భౌతిక మూలధన ఏర్పాటు రేటును గురించి స్పష్టంగా చెప్పినట్లు మానవ మూలధన ఏర్పాటును గురించి చెప్పటం

---

కష్టం. అయినప్పటికి మానవ మూలధన ఏర్పాటు రేటు శ్రామిక అంగబలం వృద్ధి రేటు కంటేను, ఆర్థికవ్యవస్థలోని వృద్ధి రేటు కంటేను హెచ్చుగా ఉండాలని గట్టిగా చెప్పవచ్చు. చాలా దేశాల్లో సైంటిఫిక్, ఇంజనీరింగ్ బలగాలు, శ్రామిక అంగబలం కంటె మూడు రెట్లు ఉండాలని, గుమాస్తాలు, క్రాఫ్ట్సమన్, మేనేజ్ మెంట్ పాలనా సిబ్బంది రెండు రెట్లయినా కనీసం ఉండాలని హార్బిసన్ వ్రాసారు. పోగా మానవ మూలధనం పెరుగుదలకు జాతీయాదాయం పెరుగుదలకు మధ్యనున్న నిష్పత్తి ఒకటి నుండి మూడువరకు ఉన్నతంగా ఉండాలని, విదేశీయుల స్థానంలో దేశీయులను ప్రవేశపెట్టి పనిచేయించవలసిన వర్తమాన దేశాల్లో ఇంకా ఎక్కువగా ఉండాలని కూడా యఫ్. హెచ్. హార్బిసన్ (హ్యూమన్ రిసోర్సెస్ ఇన్ డెవలప్‌మెంట్ ప్లానింగ్ ఇన్ మోడర్నయిజింగ్ ఎకానమీస్, ఐ. యల్. ఆర్., మే, 1962) వ్రాసారు. అయితే అల్పాభివృద్ధి దేశాల్లో వివిధ అభివృద్ధిదశల్లో ఫలానా వృద్ధిరేట్లు మానవ మూలధనానికి కావాలని రుజువు చేయడానికి కావలసినంత సాక్ష్యంలేదు. ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ఖండాలలోని దాదాపు అన్నిదేశాలుకూడా ఉచితంగానూ, నిర్బంధంగానూ సమకూర్చే ప్రాథమికవిద్యకు అధిక ప్రాధాన్యత నిస్తున్నట్లు వారి వారి విద్యారంగపు పెట్టుబడి నమూనాలు సూచిస్తున్నవి. ఇందువల్ల మూలధనం వృధా అవ్వడమేకాక నిశ్చలస్థితి ఏర్పడుతుంది. అంతేగాక భౌతిక సదుపాయాలకు, విద్యాసంస్థలలోని ఉపాధ్యాయులకు హెచ్చుగా ప్రయాస కల్గుతుంది. సెకండరీ పాఠశాల విద్యకు తక్కువ ప్రాధాన్యత ఇవ్వబడుతోంది. కాని కీలక నైపుణ్యాలను అందించే సెకండరీవిద్య పొందినవారే ఆర్థికాభివృద్ధికి హెచ్చుగా కావాలి. "సెకండరీవిద్య పొందినవారు ఆర్థిక–సాంఘిక వ్యవస్థలో ఆఫీసర్లు, నాన్‌కమిషన్డ్ ఆఫీసర్లు. ఇందులో తక్కువశాతం యూనివర్సిటీ విద్యాభ్యాసానికి వెళతారు. యూనివర్సిటీ విద్యగలవారు తక్కువమందేచాలు. అయిదుమిలియన్ల ప్రజలున్న సగటు దేశం యూనివర్సిటీ లేకుండా తన పనులను నిర్వహించుకోవచ్చు. వ్యాపారరంగంలోని మధ్య, పై శ్రేణులలో చాల హెచ్చుమంది సెకండరీవిద్య గలవారే. ఈ సెకండరీవిద్య గలవారే పాలనాసిబ్బందికి వెన్నెముక." అని నోబుల్ బహుమతి గ్రహీత డబ్ల్యు. ఆర్థర్ లూయిస్ (ఎడ్యుకేషన్ అండ్ ఎకనామిక్ డెవలప్‌మెంట్ ఐ. యస్. సి.జె., వాల్యూం XIV, నెం. 4, 1962) వ్రాసారు.

అల్పాభివృద్ధిదేశాలు ఉన్నత విద్యను వ్యాపింప చెయ్యాలనే ఉత్సాహంతో విద్యాప్రమాణాలను మెరుగుపర్చకుండా చాలా ఎక్కువగా విశ్వవిద్యాలయాలను ప్రారంభిస్తున్నారు. ఉన్నత విద్యాభ్యాసం మీద ఎట్టి అదుపులూ ఏర్పాటు చెయ్యకపోవడంవల్ల ఉన్నతసెకండరీ, విశ్వవిద్యాలయ విద్యాస్థాయిలలో అపజయాల అనుపాతం హెచ్చుగా ఉంటున్నది. హెచ్చుగా వస్తున్న అపజయాలు, తగ్గిపోతున్న ఎకడమిక్ స్థాయి అండర్ గ్రాడ్యుయేట్లలో, సామర్థ్యాన్ని తగ్గించడమేగాక "ప్రభుత్వ, ప్రయివేటురంగాల్లో నియుక్తులైన గ్రాడ్యుయేట్లు ఆర్థికాభివృద్ధికి కావలసిన సచేతన నాయకత్వాన్ని అందించడానికి తోడ్పడవు" అని హేలామింట్ (ది ఎకనామిక్స్ ఆఫ్ డెవలపింగ్ కంట్రీస్, 1965) వ్రాసారు.ఇందువల్ల మానవవనరులు వ్యర్థమై పోతున్నవి. ఇటువంటి దేశాల్లో అంగబల ప్రణాళికా రచన లేనందువల్ల వివిధరకాల కీలక నైపుణ్యాల డిమాండ్, సప్లయిలమధ్య సయోధ్య కుదిర్చే ప్రయత్నం జరగటంలేదు. తత్ఫలితంగా "కొద్ది దేశాలుమాత్రమే హీనశిక్షణపొందిన యూనివర్సిటీ గ్రాడ్యుయేట్లకు తమ ఆర్థికవృద్ధి రేటుకంటె హెచ్చువేగంగల రేటుతో, ఉద్యోగాలను సమకూరుస్తూ పోగలవు. తొందరలోనో, కొంత ఆలస్యంగానో, ప్రస్తుత విద్యావిస్తృత పద్ధతి సాగడంవల్ల, చాలా వర్ధమానదేశాలు అసంతృప్తి, నిష్ఫలత పొందామనేభావము, గ్రాడ్యుయేట్లనిరుద్యోగిత తెచ్చే తీవ్రసమస్యలను ఎదుర్కోక తప్పదు" అని హేలామింట్ (ది ఎకనామిక్స్ ఆఫ్ డెవలపింగ్ కంట్రీస్, 1965) వ్రాసారు. విద్యాభ్యాస ఖర్చులు చాలా హెచ్చుగాఉన్న దృష్ట్యా విద్యావంతులు నిరుద్యోగులుగా ఉండటంవల్ల మానవ భౌతికవనరులు ఎక్కువగా వృధా అవుతున్నాయని చెప్పక తప్పదు. లోపభూయిష్టమైన విద్యా వ్యవస్థతోపాటు, ఎంప్లాయిమెంటు బ్యూరోలు లేకపోవడము, తక్కువ వేతన జీతాల చట్రము, గ్రామసీమల్లో ఉద్యోగం చెయ్యడానికి అంగీకరించకపోవడము, వృత్తిలో అనుకున్నశ్రేణికంటె,హోదాకంటె తక్కువగా ఉన్నదని ఉద్యోగాన్ని అంగీకరించకపోవటము, మధ్యలో చదువు మానివేయడము, కులమత వ్యక్తిగత పాక్షిక వైషమ్యాలు, వ్యక్తిగత ఈర్ష్యలు, హ్రస్వదృష్టి మొదలైనవి కూడా నిరుద్యోగ స్థితికి కారణము. భారతదేశంలో మూడవ పంచవర్ష ప్రణాళిక అమలుజరిగిన కాలంలో ఇంజనీరింగ్ విద్యాభ్యాస వసతులు బాగా విస్తృతమైనవి. అయితే తగిన అంగబల ప్రణాళికారచన లేక ఇంజనీరింగ్ గ్రాడ్యుయేట్లు నిరుద్యోగులుగా మిగిలిపోయారు. తత్కారణంగా ఇంజనీరింగ్ విద్యాలయాలలో ప్రవేశాలు 1968-69 లో 1967–68 స్థాయిలో ముప్ఫయిమూడు శాతానికి పడిపోయినవి.

ఇటువంటి దేశాల్లో వ్యవసాయ విద్య, వయోజనవిద్య, ఉద్యోగంలో ఉంచి శిక్షణయిచ్చే కార్యక్రమాలమీద శ్రద్ధ తక్కువగా చూపారు. అసలు ఉద్యోగంలో పెట్టి శిక్షణ ఇచ్చే కార్యక్రమాలు అసలే లేవు. వయోజన విద్య పెంపుదలకు చేసింది చాల తక్కువ. వయోజన విద్య వ్యవసాయకుల దృక్పథాన్ని మారుస్తుంది. వారి నిర్ణయాలు తీసుకునే నైపుణ్యానికి పదును పెడుతుంది. ఆధునిక సేద్య రీతులకు సంబంధించిన హెచ్చు సమాచారాన్ని వారి కందిస్తుంది వయోజన విద్యవల్ల మంచి ఫలితాలు రావాలంటే, మొత్తం వయోజన విద్యా బోధన కార్యక్రమాలను వ్యవసాయ పరిశోధనా కేంద్రాలతోను, ప్రయోగ కేంద్రాలతోను ముడిపెట్టాలి. వ్యవసాయం మూలంగా గల ఆర్థికవ్యవస్థల్లో విద్య రెండు పనుల్ని నిర్వహిస్తుంది పిల్లల్ని పట్టణాలకు ప్రవాసం వెళ్ళి వ్యవసాయేతర ఉద్యోగాలు స్వీకరించేందుకు తయారుచేస్తుంది. నూతనమైనట్టి, మెరుగుచేయబడినట్టి సేద్య పద్ధతులలో నైపుణ్యాలను, జ్ఞానాన్ని అందిస్తుంది. లాంఛన విద్యతోపాటు, వృత్తి విద్యను కూడా పిల్లలకు అందించడము అవశ్యము. దేశానికి చెందిన సాధారణ విద్యా ప్రణాళికలో గ్రామీణ విద్యా ప్రణాళిక ఒక భాగం కావడము తప్పనిసరి.

ఆర్థికవ్యవస్థ వేగంగా వృద్ధికావడానికి విద్యారంగం మీద చేసే పెట్టుబడులు తోడ్పడాలంటే, ఆధునికీకరణ ప్రక్రియకు

తోడ్పడే ఉత్పాదకతగల కార్యక్రమాలలో స్త్రీ పురుషులు ఉత్సాహవంతంగా పాల్గొనడానికి వారికి తగినంత ప్రోత్సాహకాలను లభ్యం చెయ్యాలి. వృత్తులకిచ్చే హోదాలు, జీతాలు ఆర్థికవ్యవస్థలో ఆ వృత్తులకుండే ప్రాధాన్యతకు అనుకూలంగా ఉండాలి. సేద్యాన్ని ఆధునికీకరణం చేయడం ద్వారా గ్రామీణ నిరుద్యోగితను, మధ్యలో చదువుమానివేసిన విద్యావంతుల నిరుద్యోగితను తగ్గించాలి. పెద్ద ఎత్తున ఔద్యోగిత నిచ్చిన సంస్థలకు శిక్షణ నిచ్చే బాధ్యతలో హెచ్చు భాగాన్ని ఇవ్వవలెను. ఆధునిక మార్గాల ద్వారా ఉద్యోగంలో ఉంచి శిక్షణ యిచ్చే కార్యక్రమాలను అట్టి సంస్థలు నిర్వహించేందుకు వారికి తగిన సూచన లివ్వవలెను అని కూడా హార్బిసన్ (హార్బిసన్ అండ్ సి. ఎ. మెయర్స్, ఎడ్యుకేషన్, మేన్ పవర్ అండ్ ఎకనామిక్ గ్రోత్, 1964) వ్రాసారు.

## మానవ మూలధన ఏర్పాటుకు పెట్టుబడి చెయ్యటానికి సూత్రాలు

మానవ మూలధన ఏర్పాటుపై చేసే పెట్టుబడి ఉత్పాదకతను, ముఖ్యంగా విద్యపై చేసే పెట్టుబడి ఉత్పాదకతను అంచనా వేయడం చాలా సున్నితమైన సమస్య. అంచనా వేయడానికి ఆర్థిక శాస్త్రవేత్తలీ క్రింది సూత్రాలను ఏర్పర్చారు.

### (1) ప్రతిఫల రేటు సూత్రము

విద్యారంగం పెట్టుబడిలో రెండు భాగాలున్నవి: (1) భవిష్యత్ వినియోగ భాగము (2) భవిష్యత్ ఆర్జనల భాగము. నైపుణ్యాలను, జ్ఞానాన్ని వృద్ధిపరిచే పెట్టుబడి భవిష్యత్ ఆర్జనలను పెంచుతుంది. విద్యా సముపార్జనవల్ల కల్గిన సంతృప్తి వినియోగ భాగమౌతుంది. "శాశ్వతంగా ఉండే వినియోగ భాగంగా, విద్య భవిష్యత్ ఉపయోగాలకు మూలము. విద్య కొలవబడే జాతీయాదాయంలో భాగం కాదు" అని టి. డబ్ల్యు. షుల్ట్స్ (రిఫ్లెక్షన్ ఆన్ ఇన్‌వెస్ట్‌మెంట్ ఇన్ మేన్, జర్నల్ ఆఫ్ పొలిటికల్ ఎకానమి, అక్టోబరు 1962) వ్రాసారు. అందువల్ల విద్యాభివృద్ధి మీద జరిగే పెట్టుబడిఫలితాలను గణించడానికి, భవిష్యత్ ఆర్జనలు లెక్కలోకి తీసుకోబడతాయి. ఈ గణింపుకు ఉపయోగించే పద్ధతి హెచ్చు విద్యగల వారి సగటు జీవిత ఆర్జనలను వారి వృత్తుల్లోనే తక్కువ విద్యతో పనిచేస్తున్న వారి ఆర్జనలతో పోల్చడం మీద ఆధారపడి అమలు జరుపబడుతుంది. ఉ: అమెరికా సంయుక్త రాష్ట్రాల తెల్లజాతి పట్టణీయుల కళాశాల విద్యమీద చేయబడు మొత్తం పెట్టుబడికి ప్రతిఫలరేటు 1940లో 12.5 శాతమని, 1950లో 10 శాతమని బెకర్ అంచనా వేసాడు. అయితే 1940 1950 సంవత్సరాల్లో పడిన పన్నులను తీసివేయగా ఆ రెండుసంవత్సరాల ప్రతిఫలము 9 శాతమని బెకర్ (అండర్ ఇన్‌వెస్ట్‌మెంట్ ఇన్ కాలేజి ఎడ్యుకేషన్, అమెరికన్ ఎకనామిక్ రివ్యూ, మే 1960) వ్రాసారు. ఈ అంచనాలో విద్యార్థి పెట్టిన ప్రత్యక్ష ఖర్చు, విద్యాభ్యాస కాలంలో రావడానికి వీలున్న ఆర్జనలు, విద్యపై జరిగిన ఖర్చులో కళాశాల చేసిన ఖర్చు ఇమిడి ఉన్నాయి.

ఈ అంచనాలు వేయడంలో చాలా సాధక బాధకాలు ఇమిడి ఉన్నాయి. (1) ఈ అంచనాలు ప్రత్యక్ష భౌతిక లాభాన్ని మాత్రమే కొలుస్తాయి. విద్యకు సంబంధించిన బహిర్గతమైన ఆదాలను — ప్రజల విద్యా స్థాయి మెరుగు చెందడం వల్ల దేశానికి లభించే ప్రత్యక్ష, అప్రత్యక్ష లాభాలను కొలవవు. (2) ప్రజలు యూనివర్సిటీ విద్యవల్లమాత్రమే ఆర్జించటంలేదు. ఆర్జన సహజశక్తి, అనుభవము, సాంఘిక హోదా, కుటుంబ సంబంధాలు, ఉద్యోగంలోఉంచి ఇచ్చేశిక్షణ మొ.వాటికి ప్రతిఫలము. (3) ఈ అంచనాలు విద్యాభివృద్ధి పెట్టుబడివల్ల వచ్చే ప్రయివేటు ప్రతిఫలాల రేట్లను మాత్రమే కొలుస్తున్నవి. ఆర్జనలలోని వ్యత్యాసాలు ఉత్పాదకతలలోని వ్యత్యాసాలకు ప్రతిబింబాలని ప్రమేయం పెట్టుకుని, ఈ అంచనాలు దేశం ఉత్పత్తిమీద విద్యకున్న ప్రభావాన్ని అప్రత్యక్షంగా కొలుస్తాయి. వివిధ ప్రజా సమూహాలు (డాక్టర్లు, కాయకష్టంచేసే శ్రామికులు, ఉపాధ్యాయులు, ఇంజనీర్లు, వారి వర్గ సంఘాలద్వారా చేసే ప్రయత్నాలు), ఇతర కారకాలు చేసే సమష్టి ప్రయత్నాలు ఆర్థిక వ్యవస్థలోని సాపేక్షిక ఆర్జనలను వక్రింపచేయవచ్చు. భారతీయ గ్రామాల్లో ఫీజు లేకుండా నడిపే ఏకోపాధ్యాయ పాఠశాలలపై జరిగేఖర్చు అతిస్వల్పం కాబట్టి, ఇటువంటివాటి విషయంలో ప్రయివేటు ప్రతిఫలరేట్లను అంచనావెయ్యలేము అని హార్బిసన్, మెయర్స్ (ఎడ్యుకేషన్, మేన్‌పవర్ అండ్ ఎకనామిక్(గ్రోత్, 1964) వ్రాసారు. (4)నైపుణ్యాలను,జ్ఞానాన్ని సృష్టించే పెట్టుబడులు వాటిని పొందిన వ్యక్తుల ఆర్జనలను పెంపొందించవు; కాని ఆర్థిక వ్యవస్థయొక్క మొత్తం ఉత్పాదనశక్తిని పెంచుతాయి. (5) ప్రతిఫలరేట్లను అంచనాచేయడంలో ఉపయోగించే విద్యావంతులైన శ్రామికులకిచ్చే రేట్లు ఆ ప్రత్యేక కార్యకలాపంలో ఉపయోగించే కారకాలకొరతను ప్రతిబింబించాలి అని ఇకాస్ వ్రాశారు. అయితే విద్యాభివృద్ధి ఖర్చులలో అత్యధికభాగాన్ని ప్రభుత్వం భరిస్తున్నట్లయితే విద్యావంతులైన శ్రామికులకిచ్చే రేట్లు సాపేక్షిక మార్కెట్లలో నిర్ణయించబడిన కారక ఉత్పాదకాల కొరతలను ప్రతిబింబించవు. అంతేగాక ఆర్థికాభివృద్ధికి ఏ రకంవిద్య, ఎంత అదనంగా కావాలో చెప్పే సమాచారాన్ని ఈ సూత్రాలు ఇవ్వడం లేదు అని ఆర్. ఎస్. ఇకాస్ (ఎకనామిక్ క్రయిటేరియా ఫర్ ఎడ్యుకేషన్ అండ్ ట్రయినింగ్, ఆర్.ఇ.యస్., మే 1964)వ్రాసారు. (6)ఆర్జన అవకలనలను ఉత్పాదక అవకలనాలతో ఏకీభవింప చేయడంలో గల ఇబ్బందులవల్ల, జాతీయఉత్పత్తిపై విద్యకుగల ప్రభావాన్ని గురించి నిర్ణయాలు చేయడంలో చాలా జాగ్రత్తగా ఉండక తప్పదు అని డబ్ల్యు.జి. బౌవెన్ (ఎకనామిక్ యాస్పెక్ట్స్ ఆఫ్ ఎడ్యుకేషన్, 1964) వ్రాసారు.

### (2) వెరశి జాతీయాదాయానికి లేక భౌతిక మూలధన ఏర్పాటుకు విద్య చేసే తోడ్పాటుకు సంబంధించిన సూత్రము

ఈ సూత్రం ప్రకారము ఒక ప్రత్యేక కాలవ్యవధిలో వెరశి జాతీయాదాయంలో వచ్చే పెరుగుదలకు విద్య చేసే తోడ్పాటును

తోడ్పడే ఉత్పాదకతగల కార్యక్రమాలలో స్త్రీ పురుషులు ఉత్సాహవంతంగా పాల్గొనడానికి వారికి తగినంత ప్రోత్సాహకాలను లభ్యం చెయ్యాలి. వృత్తులకిచ్చే హోదాలు, జీతాలు ఆర్థికవ్యవస్థలో ఆ వృత్తులకుండే ప్రాధాన్యతతు అనుకూలంగా ఉండాలి. సేద్యాన్ని ఆధునికీకరణం చేయడం ద్వారా గ్రామీణ నిరుద్యోగితను, మధ్యలో చదువుమానివేసిన విద్యావంతుల నిరుద్యోగితను తగ్గించాలి. పెద్ద ఎత్తున ఔద్యోగిత నిచ్చిన సంస్థలకు శిక్షణ నిచ్చే బాధ్యతలో హెచ్చు భాగాన్ని ఇవ్వవలెను. ఆధునిక మార్గాల ద్వారా ఉద్యోగంలో ఉంచి శిక్షణ యిచ్చే కార్యక్రమాలను అట్టి సంస్థలు నిర్వహించేందుకు వారికి తగిన సూచన లివ్వవలెను అని కూడా హార్బిసన్ (హార్బిసన్ అండ్ సి. ఎ. మెయర్స్, ఎడ్యుకేషన్, మేన్ పవర్ అండ్ ఎకనామిక్ గ్రోత్, 1964) వ్రాసారు.

## మానవ మూలధన ఏర్పాటుకు పెట్టుబడి చెయ్యటానికి సూత్రాలు

మానవ మూలధన ఏర్పాటుపై చేసే పెట్టుబడి ఉత్పాదకతను, ముఖ్యంగా విద్యపై చేసే పెట్టుబడి ఉత్పాదకతను అంచనా వేయడం చాలా సున్నితమైన సమస్య. అంచనా వేయడానికి ఆర్థిక శాస్త్రవేత్తలీ క్రింది సూత్రాలను ఏర్పర్చారు.

### (1) ప్రతిఫల రేటు సూత్రము

విద్యారంగం పెట్టుబడిలో రెండు భాగాలున్నవి: (1) భవిష్యత్ వినియోగ భాగము (2) భవిష్యత్ ఆర్జనల భాగము. నైపుణ్యాలను, జ్ఞానాన్ని వృద్ధిపరిచే పెట్టుబడి భవిష్యత్ ఆర్జనలను పెంచుతుంది. విద్యా సముపార్జనవల్లకల్గిన సంతృప్తి వినియోగ భాగమౌతుంది. ''శాశ్వతంగా ఉండే వినియోగ భాగంగా, విద్య భవిష్యత్ ఉపయోగాలకు మూలము. విద్య కొలవబడే జాతీయాదాయంలో భాగం కాదు'' అని టి. డబ్ల్యు. షుల్ట్జ్ (రిఫ్లెక్షన్ ఆన్ ఇన్‌వెస్ట్‌మెంట్ ఇన్ మేన్, జర్నల్ ఆఫ్ పొలిటికల్ ఎకానమి, అక్టోబరు 1962) వ్రాసారు. అందువల్ల విద్యాభివృద్ధి మీద జరిగే పెట్టుబడిఫలితాలను గణించడానికి, భవిష్యత్ ఆర్జనలు లెక్కలోకి తీసుకోబడతాయి. ఈ గణింపుకు ఉపయోగించే పద్ధతి హెచ్చు విద్యగల వారి సగటు జీవిత ఆర్జనలను వారి వృత్తుల్లోనే తక్కువ విద్యతో పనిచేస్తున్న వారి ఆర్జనలతో పోల్చడం మీద ఆధారపడి అమలు జరుపబడుతుంది. ఉ: అమెరికా సంయుక్త రాష్ట్రాల తెల్లజాతి పట్టభద్రుల కళాశాల విద్యమీద చేయబడు మొత్తం పెట్టుబడికి ప్రతిఫలరేటు 1940లో 12.5 శాతమని, 1950లో 10 శాతమని బెకర్ అంచనా వేసాడు. అయితే 1940 1950 సంవత్సరాల్లో పడిన పన్నులను తీసివేయగా ఆ రెండుసంవత్సరాల ప్రతిఫలము 9 శాతమని బెకర్ (అండర్ ఇన్‌వెస్ట్‌మెంట్ ఇన్ కాలేజి ఎడ్యుకేషన్, అమెరికన్ ఎకనామిక్ రివ్యూ, మే 1960) వ్రాసారు. ఈ అంచనాలో విద్యార్థి పెట్టిన ప్రత్యక్ష ఖర్చు, విద్యాభ్యాస కాలంలో రావడానికి వీలున్న ఆర్జనలు, విద్యపై జరిగిన ఖర్చులో కళాశాల చేసిన ఖర్చు ఇమిడి ఉన్నయ్యి.

ఈ అంచనాలు వేయడంలో చాలా సాధక బాధకాలు ఇమిడి ఉన్నయ్యి. (1) ఈ అంచనాలు ప్రత్యక్ష భౌతిక లాభాన్ని మాత్రమే కొలుస్తాయి. విద్యకు సంబంధించిన బహిర్గతమైన ఆదాలను — ప్రజల విద్యా స్థాయి మెరుగు చెందడం వల్ల దేశానికి లభించే ప్రత్యక్ష, అప్రత్యక్ష లాభాలను కొలవవు. (2) ప్రజలు యూనివర్సిటీ విద్యవల్లమాత్రమే ఆర్జించటంలేదు. ఆర్జన సహజశక్తి, అనుభవము, సాంఘిక హోదా, కుటుంబ సంబంధాలు, ఉద్యోగంలోఉంచి ఇచ్చేశిక్షణ మొ.వాటికి ప్రతిఫలము. (3) ఈ అంచనాలు విద్యాభివృద్ధి పెట్టుబడివల్ల వచ్చే ప్రయివేటు ప్రతిఫలాల రేట్లను మాత్రమే కొలుస్తున్నవి. ఆర్జనలలోని వ్యత్యాసాలు ఉత్పాదకతలలోని వ్యత్యాసాలకు ప్రతిబింబాలని ప్రమేయం పెట్టుకుని, ఈ అంచనాలు దేశం ఉత్పత్తిమీద విద్యకున్న ప్రభావాన్ని అప్రత్యక్షంగా కొలుస్తాయి. వివిధ ప్రజా సమూహాలు (డాక్టర్లు, కాయకష్టంచేసే శ్రామికులు, ఉపాధ్యాయులు, ఇంజనీర్లు, వారి వర్గ సంఘాలద్వారా చేసే ప్రయత్నాలు), ఇతర కారకాలు చేసే సమష్టి ప్రయత్నాలు ఆర్థిక వ్యవస్థలోని సాపేక్షిక ఆర్జనలను వక్రింపచేయవచ్చు భారతీయ గ్రామాల్లో ఫీజు లేకుండా నడిపే ఏకోపాధ్యాయ పాఠశాలలపై జరిగేఖర్చు అతిస్వల్పం కాబట్టి, ఇటువంటివాటి విషయంలో ప్రయివేటు ప్రతిఫలరేట్లను అంచనావెయ్యలేము అని హార్బిసన్, మెయర్స్ (ఎడ్యుకేషన్, మేన్‌పవర్ అండ్ ఎకనామిక్‌గ్రోత్, 1964) వ్రాసారు. (4)నైపుణ్యాలను,జ్ఞానాన్ని సృష్టించే పెట్టుబడులు వాటిని పొందిన వ్యక్తుల ఆర్జనలను పెంపొందించవు; కాని ఆర్థిక వ్యవస్థయొక్క మొత్తం ఉత్పాదనశక్తిని పెంచుతాయి. (5) ప్రతిఫలరేట్లను అంచనాచేయడంలో ఉపయోగించే విద్యావంతులైన శ్రామికులకిచ్చే రేట్లు ఆ ప్రత్యేక కార్యకలాపంలో ఉపయోగించే కారకాలకొరతను ప్రతిబింబించాలి అని ఇకాస్ వ్రాశారు. అయితే విద్యాభివృద్ధి ఖర్చులలో అత్యధికభాగాన్ని ప్రభుత్వం భరిస్తున్నట్లయితే విద్యావంతులైన శ్రామికులకిచ్చే రేట్లు సాపేక్షిక మార్కెట్లలో నిర్ణయించబడిన కారక ఉత్పాదకాల కొరతలను ప్రతిబింబించవు. అంతేగాక ఆర్థికాభివృద్ధికి ఏ రకంవిద్య, ఎంత అదనంగా కావాలో చెప్పే సమాచారాన్ని ఈ సూత్రాలు ఇవ్వడం లేదు అని ఆర్. ఎస్. ఇకాస్ (ఎకనామిక్ క్రయిటీరియా ఫర్ ఎడ్యుకేషన్ అండ్ ట్రయినింగ్, ఆర్.ఇ.యస్., మే 1964)వ్రాసారు. (6)ఆర్జన అవకలనలను ఉత్పాదక అవకలనలతో ఏకీభవింప చేయడంలో గల ఇబ్బందులవల్ల, జాతీయఉత్పత్తిపై విద్యకుగల ప్రభావాన్ని గురించి నిర్ణయాలు చేయడంలో చాలా జాగ్రత్తగా ఉండక తప్పదు అని డబ్ల్యు.జి. బొవెన్ (ఎకనామిక్ యాస్పెక్ట్స్ ఆఫ్ ఎడ్యుకేషన్, 1964) వ్రాసారు.

### (2) వెరశి జాతీయాదాయానికి లేక భౌతిక మూలధన ఏర్పాటుకు విద్య చేసే తోడ్పాటుకు సంబంధించిన సూత్రము

ఈ సూత్రం ప్రకారము ఒక ప్రత్యేక కాలవ్యవధిలో వెరశి జాతీయాదాయంలో వచ్చే పెరుగుదలకు విద్య చేసే తోడ్పాటును

డా. హెచ్. ఎస్. బ్రహ్మానంద

# వాక్కు - భాష*

"In view of the claims putforward by linguistics since the late 1950s, I have ... ... tried to show that the study of language is not now a science ... ... Very likely, it will never be a science. Language is, at vital points of usage and understanding, idiolectic."

— **George Steiner P. 294**

శాస్త్రీయ పరిశోధనలకు ప్రధాన లక్షణం పరిణామం. భాషాశాస్త్రం (**Linguistics**) ఈనాడు బహుముఖంగా వృద్ధిపొందుతోంది. భారతీయ భాషల్లోకి '**Language**' అనే పదాన్ని అనువదించుకోవడంలో కనిపించని క్లిష్టత ఒకటుంది. 'భాష' అని సాధారణంగా అనువాదం చేయడం జరుగుతోంది. కాని ఒక విషయం విస్మృతమై ఈ అనువాదం జరుగుతోంది. లోకంలో ప్రతి వస్తువుకి వ్యవహారనామం (**Social nomenclature**), శాస్త్రీయనామం (**Scientific nomenclature**) రెండూ ఉంటాయనడం — ఆ విషయం. 'నీళ్ళు' వ్యవహారనామం. శాస్త్రీయచర్చలకు [$H_2O$] అని సంకేతించుకోవాల్సిందే. అలాగే 'భాష' అన్న అనువాదం వ్యావహారికం తప్ప శాస్త్రీయం కాదు. తెలుగు, హిందీ, ఆంగ్లం మొదలైనవి భాషలు. అంటే అర్థమేమిటి? ఒక ప్రాంతంలో ఒక తెగ వారిచేత వ్యవహరింపబడుతున్న వాఙ్మర్మాణాన్ని 'తెలుగు' అని పిలుస్తోంది ప్రపంచం. అలాగే ఇతర భాషల్ని కూడా. ఇన్ని భాషల నడుమా సామాన్యంగా ఉన్న అంశం వాగ్వ్యవహారం (**Communication through vak**) అన్ని భాషల్లోనూ అచ్చులు, హల్లులు, పదాలు, వాక్యాలూ భిన్న భిన్న రీతుల్లో ఉన్నా ఉన్నాయి. అలాగే ఒక పదానికి అర్థం, విశేషార్థం, వ్యతిరేకార్థం — ఇవీ అన్ని భాషల్లోనూ ఉన్నాయి. భాషలమధ్య ఉన్న ఈ అనేకత (**Plurality**)కు అంతర్గతంగా ఉంటూ సాంఘిక భేదాలచేత ప్రభావితం కానట్టి నిర్మాణ ప్రమాణం (**Structural unit**) ఒకటి ఉండకపోతే ఒక భాష నుంచీ మరో భాషకు అనువాదం కాని, ఒక భాషనుంచి మరో భాష పరిణమించడం కాని సంభవించదు. ఇవి సంభవాలవుతున్నాయంటే నిర్మాణ ప్రమాణం ఉందని అర్థం. '**Language**' అనే పదానికి శాస్త్రీయ నామం — భారతీయ శాస్త్ర గ్రంథాలననుసరించి '**వాక్కు**'. దాని నిర్మాణం శబ్దార్థమయంగా ఉంటుందని ఈ గ్రంథాలు నిరూపించాయి. 'భాష' శబ్దాన్ని నిర్మాణ ప్రమాణంగా ఎవరూ గుర్తించలేదు. అందుకే ఎక్కడా 'భాష' శబ్ద నిర్వచనం కనిపించదు. అమరకోశం కొన్ని పర్యాయ పదాలు చూపింది.

'బ్రాహ్మీతు భారతీ భాషా గీర్వాగ్వాణీ సరస్వతీ'
'భాష్యత ఇతి' అనడం కూడా '**that which is spoken is speech**' అని చెప్పినట్లేఅవుతోంది· మరి ఆధునిక భాషాశాస్త్రజ్ఞులందరూ ఒకో నిర్వచనాన్ని '**language**'కి ఇవ్వగలుగుతుండగా భారతీయ గ్రంథాల్లో ఇలాంటి ప్రయత్నం ఎందుకు కనిపించదు?

ఆధునికులంటే ఎప్పటి నుంచి నిర్వచిస్తున్నవాళ్ళు? సోక్రటీసు కన్నా ప్రాచీనులు పాశ్చాత్యులకు లేరు. వేదాలకంటె ప్రాచీన దశ భారతీయులకు లేదు. సోక్రటీసు భాషను నిర్వచించాడేమో మొదట చూద్దాం.

## ప్రాచీన వాదాలు - పాశ్చాత్యులు

శబ్దార్థాలమధ్య నిత్య సంబంధం ఉందా? రూఢి మూలకమైన యాదృచ్ఛిక సంబంధం ఉందా! అన్న ఈ ప్రశ్నలే సోక్రటీసు వంటి తార్కికుల్ని ఆయుగాల్లో ఇబ్బంది పెట్టాయి(క్రీ.పూ. 5–4 శ.). తార్కికుడుగా ఆయన ఒక సందిగ్ధ సమాధానం చెప్పాడు.

"**We must admit that both convention and usage contribute to the manifestation of what we have in mind.**"

(**Q. From I. G. L. 1967, p. 76**)

ప్లాటో మరికొంత ముందుకుపోయి శబ్దార్థాలు భిన్నం కావన్నాడు. అర్థాన్ని '**thought**' అని శబ్దాన్ని '**speech**' అని ఆయన వ్యవహరించాడు. ఈయన తాత్త్వికుడు (క్రీ.పూ.5–4శ.)

---

* ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో క్రిందటి రెండు సంవత్సరాల్లో ఈ వ్యాసకర్త రాసిన రెండు వ్యాసాలకు ఈ వ్యాసం పొడిగింపు.

చూ. (ఎ) భారత దేశంలో భాషా శాస్త్రం
(1978 సంచిక) పుటలు 82–83

(బి) శబ్దార్థాద్వైతం (1979 సంచిక)
పుటలు 49–51

ఈ వ్యాసంలో చర్చింపబడుతున్న విషయాలకు ఈ వ్యాసకర్తచే రాయబడ్డ '<u>వ్యంజన సూత్రం</u>' (**The Principle of Suggestivity**) అన్న పిహెచ్. డి. సిద్ధాంత గ్రంథంలోని మొదటి అధ్యాయం (పుటలు 1–99) మూలం (1979, అముద్రితం).

బట్టి విద్యాభివృద్ధికి పెట్టుబడి చేయడం జరుగుతుంది. 1900వ సంవత్సరం నుండి 1956వ సంవత్సరం వరకు అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో జాతీయాదాయం పెరగడానికి విద్య ఇచ్చిన తోడ్పాటును టి. డబ్ల్యు. షుల్ట్స్ విశ్లేషించి "విద్యకు కేటాయించిన వనరులు (ఎ) వినియోగదారుల డాలర్ ఆదాయానికి సాపేక్షికంగాను (బి) డాలర్ల రూపంలో విలువగా పెరిగే భౌతిక మూలధనానికి సాపేక్షికంగాను 3.5 రెట్లు పెరిగినాయని(కేపిటల్ ఫారమేషన్ బై ఎడ్యుకేషన్, జర్నల్ ఆఫ్ పొలిటికల్ ఎకానమి, డిసెంబరు 1960) వ్రాసారు. అనగా విద్యపై జరిగిన పెట్టుబడి భౌతిక మూలధనంపై జరిగిన పెట్టుబడి కంటె 3.5రెట్లు హెచ్చు ఉత్పాదకంగా ఉన్నదని షుల్ట్స్ అభిప్రాయపడ్డారు. అదే విధంగా డెనిసన్ చేసిన పరిశీలనలు [ఇ. యఫ్. డెనిసన్, ఎడ్యుకేషన్, ఎకనామిక్ గ్రోత్, అండ్ గేప్స్ ఇన్ ఇన్‌ఫర్‌మేషన్, జర్నల్ ఆఫ్ పొలిటికల్ ఎకానమి (సప్లిమెంట్) అక్టోబరు 1962] 1929కి 1957కు అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో విద్యపై జరిగిన పెట్టుబడులు ఆ దేశ వెరశి వాస్తవ జాతీయాదాయంలో 23 శాతం వృద్ధికి, పనిలో నియుక్తమైన ప్రతివ్యక్తి తలసరి వాస్తవిక జాతీయాదాయంలో 42 శాతం వృద్ధికి తోడ్పడినవని తెలియజేస్తున్నవి.

వివిధ కాలబిందువులవద్ద లభ్యమైన వెరశి విద్యా మూలధనాన్ని షుల్ట్స్ గణించారు. శ్రామికబలంలో విద్యా మూలధనము 1900వ సంవత్సరంలో 63 బిలియన్ డాలర్లు కాగా 1957 నాటికి 353 బిలియన్ డాలర్లకు పెరిగింది. విద్యా మూలధనానికి, భౌతిక మూలధనానికి మధ్య నిష్పత్తి 1900వ సంవత్సరంలో 22 శాతంకాగా అది 1957లో 42 శాతానికి పెరిగిందని షుల్ట్స్ (ఎడ్యుకేషన్ అండ్ ఎకనామిక్ గ్రోత్ ఇన్ సోషల్ ఫోర్సెస్ ఇన్‌ఫ్లూఎన్సింగ్ అమెరికన్ ఎడ్యుకేషన్, ఎడిటెడ్ బై యన్. బి. హెన్రీ, 1961) వ్రాసారు.

షుల్ట్స్ పద్ధతి ననుసరించి భారతదేశంలో పి. ఆర్. పంచముఖి కొన్ని అంచనాలు వేసారు. విద్యా మూలధనంమీద ఆయన వేసిన అంచనాలు భారతదేశంలో లాంఛన విద్యకయ్యే వెరశి ఖర్చు 1950–51లో రూ 341 కోట్లుకాగా 1959 – 64లో రూ 769 కోట్లకు పెరిగిందని (పి. ఆర్. పంచముఖి, ఎడ్యుకేషనల్ కేపిటల్ ఇన్ ఇండియా, ఇండియన్ జర్నల్ ఆఫ్ ఎకనామిక్స్, జనవరి – మార్చి 1965) తెలియజేస్తున్నవి. పంచముఖి అంచనాలు ఆర్థికవ్యవస్థమీద విద్యాభివృద్ధి పెట్టుబడులకున్న ప్రభావాన్ని కొలుస్తూ ఉన్నందువల్ల విద్యాభివృద్ధి పెట్టుబడుల ప్రతిఫలాలను అంచనా చేయడంకంటె వాస్తవికంగా ఉన్నవి.

ఈ అంచనాలు విద్యయొక్క అవకాశ అంచనాలమీద ఆధారపడి ఉన్నవి. అనగా పాఠశాలల్లోను, కళాశాలల్లోను, విశ్వవిద్యాలయాల్లోను విద్యార్థులున్న కాలంలో వారు శ్రామికులుగా పనిచేస్తే వచ్చే ఆదాయాలు, లాంఛన విద్యపై జరిగిన ఖర్చులో తరుగుదలను తీసివేయగా మిగిలిన మొత్తములపై ఆధారపడి ఉన్నది. చదువుకునే రోజుల్లో పనిచేస్తే రావడానికి వీలున్న ఆదాయాలను గణించడం తేలిక పనికాదు. అలా చేయడంలో చాలా సమస్యల్ని ఎదుర్కోవలసి ఉన్నది. వీటిని ఎప్పుడూ పాఠశాలకు వెళ్లని అదే వయస్సువారి వర్తమాన ఆదాయాలపై ఆధారపడి గణించాలా ? అల్పాభివృద్ధి దేశాల్లోని యువకులు పాఠశాలలకు పోకుండా కుటుంబవృత్తి పనులు చేసి సంపాదించుతారు. అందువల్ల సంపాదించకుండా పాఠశాలకు వెళ్లడంవల్ల పోగొట్టుకున్న వేతనాలకు విద్యాభ్యాసానికయ్యేనిజమైన ఖర్చులుగా భావించాలి. దేశాలలో నిరుద్యోగిత హెచ్చుగా ఉన్నందువల్ల పనిచేసి సంపాదించడానికి వీలుండికూడా పాఠశాలకు పోవడంవల్ల వదులుకున్న వేతనాలు జాతీయాదాయంపై విద్యారంగపు పెట్టుబడి ప్రభావాన్ని ఖచ్చితంగా కొలవలేవు. అటువంటి పరిస్థితుల్లో వాస్తవ ఆర్జనలకంటె పెరిగిన శ్రామికుల సరఫరా తక్కువగా ఉన్నందువల్ల, రావడానికి వీలుండి కోల్పోయిన ఆర్జనల అంచనా హేతురహితంగా జరిగినట్లవుతుంది. సాంఘిక ఖర్చులు కూడా ఒక ముఖ్య కారకమే. పనిచేయడానికి వీలున్నయువకుల్ని పని మాన్పించి బడికి పంపడంవల్ల విద్యార్థికి, వారి కుటుంబానికేగాక సమాజానికి కూడా వారి పని తగ్గడంవల్ల ఖర్చు అనగా నష్టము వాటిల్లినట్లవుతుంది. ఇందువల్ల రావడానికివీలున్న జాతీయఉత్పత్తి రాకుండా పోయిందని అర్థం చేసుకోవాలని యఫ్. మాచ్‌లప్ (ది ప్రొడక్షన్ అండ్ డిస్ట్రిబ్యూషన్ ఆఫ్ నాలెడ్జి ఇన్ ది యునైటెడ్ స్టేట్స్) వ్రాసారు. విద్యవల్ల వచ్చే లాభదాయకతను గురించి చేసే అంచనాలు సాంకేతికమైన ఆర్థిక దృష్టిలో తప్పిదాలే గాక, రాజకీయంగా అవినీతికరములని ప్రొఫెసర్ గున్నార్ మిర్డాల్ (ఏషియన్ డ్రామా 1968) వ్రాసాడు. మానవ మూలధనం పెంపుదలకు పెట్టుబడి చేయడంలో సమస్యలున్నప్పటికి, అల్పాభివృద్ధి దేశాల ఆర్థికవృద్ధి భౌతిక మూలధనం కొరతవల్లనే గాక, లభ్యమైన భౌతిక మూలధనాన్ని ఇముడ్చుకోవడానికి ఆటంకమయ్యే "కీలక నైపుణ్య జ్ఞానాలకొరత" వల్లనని బాగా గ్రహించబడింది. అందువల్ల భౌతిక మూలధన ఏర్పాటుకంటె మానవ మూలధన ఏర్పాటు ముఖ్యముగాన విద్యాభివృద్ధిని, మేధాశక్తిని, భావ వ్యక్తీకరణ స్వాతంత్ర్యాన్ని, సాధనాలను అణగద్రొక్కరాదని బుద్ధిమంతులు తప్పక గుర్తించగలరు.



డా. హెచ్. ఎస్. బ్రహ్మానంద

# వాక్కు - భాష*

"In view of the claims putforward by linguistics since the late 1950s, I have ... ... tried to show that the study of language is not now a science ... ... Very likely, it will never be a science. Language is, at vital points of usage and understanding, idiolectic."

— **George Steiner P. 294**

శాస్త్రీయ పరిశోధనలకు ప్రధాన లక్షణం పరిణామం. భాషాశాస్త్రం (**Linguistics**) ఈనాడు బహుముఖంగా వృద్ధిపొందుతోంది. భారతీయ భాషల్లోకి '**Language**' అనే పదాన్ని అనువదించుకోవడంలో కనిపించని క్లిష్టత ఒకటుంది. 'భాష' అని సాధారణంగా అనువాదం చేయడం జరుగుతోంది. కాని ఒక విషయం విస్మృతమై ఈ అనువాదం జరుగుతోంది. లోకంలో ప్రతి వస్తువుకి వ్యవహారనామం (**Social nomenclature**), శాస్త్రీయనామం (**Scientific nomenclature**) రెండూ ఉంటాయనడం — ఆ విషయం. 'నీళ్ళు' వ్యవహారనామం. శాస్త్రీయచర్చలకు $[H_2O]$ అని సంకేతించుకోవాల్సిందే. అలాగే 'భాష' అన్న అనువాదం వ్యావహారికం తప్ప శాస్త్రీయం కాదు. తెలుగు, హిందీ, ఆంగ్లం మొదలైనవి భాషలు. అంటే అర్థమేమిటి? ఒక ప్రాంతంలో ఒక తెగవారిచేత వ్యవహరింపబడుతున్న వాఙ్మర్మాణాన్ని 'తెలుగు' అని పిలుస్తోంది ప్రపంచం. అలాగే ఇతర భాషల్ని కూడా. ఇన్ని భాషల నడుమా సామాన్యంగా ఉన్న అంశం వాగ్వ్యవహారం (**Communication through vak**) అన్ని భాషల్లోనూ అచ్చులు, హల్లులు, పదాలు, వాక్యాలూ భిన్న భిన్న రీతుల్లో ఉన్నా ఉన్నాయి. అలాగే ఒక పదానికి అర్థం, విశేషార్థం, వ్యతిరేకార్థం — ఇవీ అన్ని భాషల్లోనూ ఉన్నాయి. భాషలమధ్య ఉన్న ఈ అనేకత (**Plurality**)కు అంతర్గతంగా ఉంటూ సాంఘిక భేదాలచేత ప్రభావితం కానట్టి నిర్మాణ ప్రమాణం (**Structural unit**) ఒకటి ఉండకపోతే ఒక భాష నుంచీ మరో భాషకు అనువాదం కాని, ఒక భాషనుంచి మరో భాష పరిణమించడం కాని సంభవించదు. ఇవి సంభవాలవుతున్నాయంటే నిర్మాణ ప్రమాణం ఉందని అర్థం. '**Language**' అనే పదానికి శాస్త్రీయ నామం — భారతీయ శాస్త్ర గ్రంథాలననుసరించి '**వాక్కు**'. దాని నిర్మాణం శబ్దార్థమయంగా ఉంటుందని ఈ గ్రంథాలు నిరూపించాయి. 'భాష' శబ్దాన్ని నిర్మాణ ప్రమాణంగా ఎవరూ గుర్తించలేదు. అందుకే ఎక్కడా 'భాష' శబ్ద నిర్వచనం కనిపించదు. అమరకోశం కొన్ని పర్యాయ పదాలు చూపింది.

'బ్రాహ్మీతు భారతీ భాషా గీర్వాగ్వాణీ సరస్వతీ'

'భాష్యత ఇతి' అనడం కూడా '**that which is spoken is speech**' అని చెప్పినట్లేఅవుతోంది. మరి ఆధునిక భాషాశాస్త్రజ్ఞులందరూ ఒకో నిర్వచనాన్ని '**language**' కి ఇవ్వగలుగుతుండగా భారతీయ గ్రంథాల్లో ఇలాంటి ప్రయత్నం ఎందుకు కనిపించదు?

ఆధునికులంటే ఎప్పటి నుంచి నిర్వచిస్తున్నవాళ్ళు? సోక్రటీసు కన్నా ప్రాచీనులు పాశ్చాత్యులకు లేరు. వేదాలకంటె ప్రాచీనదశ భారతీయులకు లేదు. సోక్రటీసు భాషను నిర్వచించాడేమో మొదట చూద్దాం.

## ప్రాచీన వాదాలు - పాశ్చాత్యులు

శబ్దార్థాలమధ్య నిత్య సంబంధం ఉందా? రూఢి మూలకమైన యాదృచ్ఛిక సంబంధం ఉందా! అన్న ఈ ప్రశ్నలే సోక్రటీసు వంటి తార్కికుల్ని ఆయుగాల్లో ఇబ్బంది పెట్టాయి(క్రీ.పూ. 5-4 శ.). తార్కికుడుగా ఆయన ఒక సందిగ్ధ సమాధానం చెప్పాడు.

"**We must admit that both convention and usage contribute to the manifestation of what we have in mind.**"

(**Q. From I. G. L. 1967, p. 76**)

ప్లాటో మరికొంత ముందుకుపోయి శబ్దార్థాలు భిన్నం కావన్నాడు. అర్థాన్ని '**thought**' అని శబ్దాన్ని '**speech**' అని ఆయన వ్యవహరించాడు. ఈయన తాత్త్వికుడు (క్రీ.పూ.5-4శ.)

---

* ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో క్రిందటి రెండు సంవత్సరాల్లో ఈ వ్యాసకర్త రాసిన రెండు వ్యాసాలకు ఈ వ్యాసం పొడిగింపు.

చూ. (ఎ) భారత దేశంలో భాషా శాస్త్రం
(1978 సంచిక) పుటలు 82-83

(బి) వాగర్థాద్వైతం (1979 సంచిక)
పుటలు 49-51

ఈ వ్యాసంలో చర్చింపబడుతున్న విషయాలకు ఈ వ్యాసకర్తచే రాయబడ్డ 'వ్యంజన సూత్రం' (**The Principle of Suggestivity**) అన్న పిహెచ్. డి. సిద్ధాంత గ్రంథంలోని మొదటి అధ్యాయం (పుటలు 1-99) మూలం (1979, అముద్రితం).

ప్రక్రియ — తినడం నిద్రించడం లాగా. భాషకు ఈయన నిర్వచనం ఇది (ఇక్కడ భాష = Speech)

'శబ్ద తరంగాలు రెండు వ్యక్తుల దేహాల్లోని నాడీమండలాల మధ్యనుండే శూన్యాన్ని నింపడమే మాట్లాడటం' (Language - 1933 P. 26) అందువల్ల అర్థాన్ని ఇలా నిర్వచించాడు.

'We have defined meaning of a linguistic form as the situation in which the speaker utters it and the response which it calls forth in the hearer'

(op.cit. P. 139)

కాని తన నిర్వచన పరిధుల్ని గుర్తించాడు. ప్రేమ, ద్వేషం, మొదలైన భావాలకీ నిర్వచనం కుదరదన్నాడు. శాస్త్రీయ పరిజ్ఞానం ఎదిగేదాకా భాషా నిర్వచనాన్ని, ప్రయోగాన్ని శబ్దం వరకే పరిమితం చెయ్యడం శాస్త్రీయమని (పుట-140) హెచ్చరిక కూడా చేశాడు.

## భాషను సాంఘికంగా నిర్వచించే సంప్రదాయం

పై ఇరువురి ప్రభావాలకు లోబడ్డ పరిశీలకులందరూ భాషను సాంఘిక వస్తువుగానే పరిగణించారు. దాదాపు ప్రతి పుస్తకంలోనూ ఈనాడు భాషా నిర్వచనానికి సంబంధించి కింది అంశాలు కనిపిస్తాయి.

సాంఘిక వ్యక్తులు — అభిప్రాయ నివేదనం — యాదృచ్ఛిక శబ్దసంకేతాలు - పరస్పర అవగాహన. *

వాస్తవికతా దృష్టిమాత్రమే ధ్యేయంగా కల్గిన సోవియట్ పరిశీలకుల గ్రంథాల్లో కూడా ఇలాంటి అభిప్రాయమే కనిపిస్తుంది.

'Language reflects the character, mentality. and social activity of the people who use it'

(Berezin F. M, 1976 ed. P. 5)

పై వివరణ భాషోపయోగానికి సంబంధించింది తప్ప భాషా నిర్మాణానికి కాదు. పై వాక్యంలో 'reflect' అనడానికి 'ప్రతిబింబించడం' అని అర్థమైతే-శబ్దం-అర్థంతో ఒక వైపు యాదృచ్ఛిక సంబంధాన్ని కల్గిందిగా అంగీకరిస్తూ—పై ప్రతిపాదన చెయ్యడం ఎలా సమంజసం ? — అన్న ఈ ప్రశ్న ఒక్క ప్రాచీన భారతీయ ఆలంకారిక గ్రంథాల్లో తప్ప మరెక్కడా కనిపించదు. భాషోపయోగానికీ, నిర్మాణానికి మధ్యన యాదృచ్ఛికత అంగీకరిస్తే మరి పరిశోధన ఎలా జరుగుతుంది? శాస్త్రీయత ఎలా సిద్ధిస్తుంది?

## భిన్న మార్గాలు - ఫర్త్ సంప్రదాయం

పై వాదంలోని అసమంజసత్వాన్ని తొలగించే పద్ధతులు కొన్ని ఆధునిక యుగంలోనే పుట్టాయి. ఇంగ్లండులో పుట్టిన ఫర్త్ సిద్ధాంతంలోను, దానికి మూలమైన మాలినావ్‌స్కీ మొదలైన మానసిక / శరీర నిర్మాణ శాస్త్రజ్ఞుల ప్రతిపాదనల్లో కాని భాష ఒక ప్రక్రియగా గుర్తింపబడింది తప్ప అభిప్రాయ సంకేతంగా కాదు. అనాగరకుల భాషల్లోను, శిశు వాగ్వ్యవహారం లోనూ ఈ దృష్టికి చాలా ప్రాముఖ్యం ఉంది. సమకాలీనులైన Jean Piaget వంటి మానసిక పరిశోధకులు కూడా ఇలాగే అభిప్రాయపడ్డారు. శిశువులు మాట్లాడేటప్పుడు శ్రోత నుద్దేశించి మాట్లాడని సందర్భాలున్నాయి. అప్పుడు వాళ్ళ భాష అభిప్రాయ నివేదన సాధనం ఎలా అవుతుంది ? అని Piaget ప్రశ్న (చూ. The language and thought of the child 1966)

[అందుకే శిశువుల ఆలోచనా పద్ధతి స్ఫురణారూపమని (autistic or intuitive), పెద్దల ఆలోచన తార్కికం—బౌద్ధికం (intelligent) - అని ఆయన వేరు చేశారు.]

మాలినావ్‌స్కీ శిశుభాషను గురించి ఇచ్చిన వివరణం ఇక్కడ ప్రసక్తం.

"In all the child's experience, words when seriously uttered mean in so far as they act. The intellectual function of words probably develops later, and develops as a by-product of the pragmatic function..."

[Coral Gardens (I.G.L. 300) P. 62]

శిశుభాషలో శబ్దార్థాలమధ్య నిత్య సంబంధం వుంది. పెద్దల భాషలో వీటి నడుమ యాదృచ్ఛికత ప్రవేశిస్తోంది. బుద్ధి వికసనానికి సంబంధించిన దశ ఇది. కాని ఆ నిత్యత్వం కావ్య భాషలో — వృద్ధుల్లోనూ — నిల్చి వుంది.

ఈ దృష్టితో అర్థాన్ని శబ్దపు భావంగా గుర్తించక తప్పదు.

"Meaning is therefore the effect of words on human minds and bodies, and through these, on the environmental reality as created and conceived in a given culture"

[Coral Gardens (I.G.L. 302) P. 53]

ప్రభావమంటే శబ్దంతోపాటు పుట్టే మానసిక వ్యాపార మని అర్థం.

అమెరికా భాషా పరిశీలన సంప్రదాయాల్లో చాలా మార్పులు వచ్చాయి. ఆ మార్పులన్నీ శబ్ద స్వరూప విశ్లేషణకు అర్థంతో ఉన్న సంబంధం మీదకాకుండా- శబ్ద ప్రమాణాలకు (Linguistic units ) గుర్తించడంలో ఉన్న భేదాభిప్రాయాలకు సంబంధించినవి. అందువల్లే ససూర్ నుండి ఈనాడు ప్రమాణంగా ఉన్న ఛామ్‌స్కీ

---

* దాదాపు కొన్ని వందల గ్రంథాల్లో కనిపించే సమాన అంశాలివి. చూ. Hockett C. F. A Course in modern linguistics (1958). విద్యాలయాల్లో పాఠ్యగ్రంథాలలోనూ ఈ సంప్రదాయాన్నే చెబుతున్నారు. చూ. Bloch & Trager G. L. 'art line of linguistic analysis' (1942).

దాకా అందరూ నిర్మాణవాదులే (Structuralists). ఉదాహరణకు ఛామ్స్కీ అర్థ దృష్టిని F.P. Dinneen ఇలా సమీక్షించారు.

"...what appears to be an elegant intralinguistic method of describing meaning without making a commitment to any of the disputed theories about what meaning is"

(I. G. L. 1966 P. 423)

## వీన్ రిష్

ఇటీవలి సంవత్సరాల్లో వచ్చిన ఒక పరిణామం కావ్య భాష (Poetic language) స్వరూపాన్ని గురించి పరిశీలించడం. రోమన్ యాకబ్సన్, బార్త్స్, హాక్స్, రోజర్ ఫౌలర్, రిచర్డ్స్, రీడ్ మొదలైన పండిత విమర్శకులు తమ తమ పరిశోధనరంగాలు భిన్నమైనా కావ్య భాషకు సంబంధించిన అనేక మౌలికాంశాలను బయటపెట్టారు. వాటి సారాంశం ఇది ఛామ్స్కీ ప్రభృతులు భావించినట్టు అర్థాన్ని శబ్దాతిరిక్తం (metalinguistic) గా భావిస్తే శబ్దం కావ్యంలో విశేషార్థ ప్రతిపత్తిని ప్రత్యక్షంగా ఎలా సాధిస్తుందో చెప్పడం కుదరదు. అంతేగాకుండా, చేష్టాది భావ వ్యంజక సామగ్రినికూడా సంకేత సామగ్రిలో భాగంగా గ్రహించి నిర్వచించకపోతే సమగ్రత సిద్ధించదు — ఈ అభిప్రాయాన్నే వీన్‌రిష్ ఇలా వ్యక్తం చేశాడు.

"Today linguists are resuming their search for a far richer characterisation of the notion of 'human language', and it is apparent that in such a characterisation a detailed statement of the semiotic submechanisms of language will occupy a prominent place"

(C.T.L. 1970, P. 396)

## సామాజిక భాషా పరిశీలన (SOCIOLINGUISTICS)

భాషా వ్యవహారం మాండలికం (idiolect–dialect) లో సాగుతుంది. కాబట్టి వ్యవహారంలో ఉన్నది కాదు భాష — అదొక అమూర్త నిర్మాణం. మాండలికం దాని వ్యక్తీకృతి — అంటూ ససూర్ అభిప్రాయాన్ని పునరుద్ధరిస్తున్నారు. ఈ దృష్టితో సమాజానికి భాష ప్రతీక (symbol).

"A language is the medium of communication between speakers of different dialects"

(E. Haugen 1972 P. 110)

ఇలాగే వ్యక్తి సంస్కార విశేషం జాగ్రద జాగ్రదవస్థల్లో ఉపయుక్తమవుతూన్న భాషాప్రయోగ పద్ధతినిబట్టి తెలుస్తోందని కొందరు నిరూపించారు

ఈ దృష్టితో శైలులు ఈ సాంఘిక భేదాలకు సంబంధించినవి. నిర్మాణాం వీటి కంతర్గతమైన శబ్దార్థ సమన్వయ రూపంలో వుండటంవల్ల మారదు. పరిశోధనను శబ్ద దశకే పరిమితం చేసిన ఆధునిక పరిశోధకుల్లో చాలా మందికి ప్రశ్న ఒకటి మిగిలిపోతూవుంది.

" We donot understand, and for all we know what makes it possible for a normal human intelligence to use language as an instrument for the free expression of thought and feeling..."

(N. chomsky . 1968 P. 101)

శబ్దార్థ వ్యవహారంలో intelligence కి ప్రాధాన్యమున్నా, భావస్ఫురణలో, శబ్దసృష్టిలో దానికి చోటులేదు. అది హృదయ సంబంధి మనోవ్యాపారం (sympathetic induction through intuition)

## సంకేతవాదులు - వాఙ్నిర్మాణదృష్టి

వాక్కుకు మానవుడికి ఆంగిక (Organic) సంబంధముంది. సంకేతవాదం(Semiotics) దీన్ని ఆధారంగా వృద్ధిపొందుతోంది. Roland Barthes అనే ఫ్రాన్సు దేశీయుడు భాషనిలా నిర్వచిస్తున్నాడు.

"Language is the most pure organic semiotic system. Every aspect of it signifies, and it is produced solely by means of the body.";

(Q. from Hawkes 1977, p. 135)

లాటిన్ భాషలో lingua=నాలుక, సంస్కృతంలో వాక్కు= నాలుక; కాబట్టి ఆంగిక సంబంధ దృష్టితో కూడా language= వాక్కు.

ఈ దృష్టితో వాగ్వ్యాపారాన్ని (function of language) గురించి పరిశోధిస్తున్నవాళ్ళు కొందరున్నారు. Geofrey Leech అర్థాన్ని ఏడురకాలుగా విభజించాలని చెబుతూ అందులో 'associative meaning' అన్నది శబ్దార్థ వ్యాపార జనితంగా ఉంటుందంటూ :

'What is communicated by virtue of what language refers to.'

(Cf. Semantics 1975. pp. 1-20)

## ఒక ప్రమాణం

పైన నిరూపించిన విషయాన్నంతా J. F. Stall చేసిన ఒక ప్రసంగంలో సమన్వయిస్తూ ఈ అంశాన్ని ఆపవచ్చు.

"...Here it must suffice to say that Kashmir Saivism considered its doctrine as a manifestation of the God Siva in the medium of language (vāk) ..."

[C. T. L. (1969) pp. 522-23]

వాక్కు, వాక్యం, వాచ్యం—ఈ మూడు పదాల్ని భిన్నరీతుల్లో సమన్వయించాల్సిన అవసరం వుంది. అప్పుడు language అన్న పదానికి శాస్త్రీయ నిర్వచనం 'వాక్కు' అన్న ప్రతిపాదనకు బలం చేకూరుతుంది.* ఇంతవరకు చూపించింది ప్రధానంగా పాశ్చాత్య పరిశోధనలో 'language' నిర్వచన స్వభావాలను మాత్రమే.

## రిఫరెన్సులు (ముఖ్యమైనవి)


1 George Steiner — 'After Babel', Aspects of language and translation—OUP. London (1975)

2 F. P. Dinneen — 'Introduction to General Linguistics' (I GL) Holt, Rinehart and winston Inc. NY (1967)

3 Morris Henry Partee, 'Plato's theory of language', Foundations of language Vol 18–1, 1972, pp. 113–132.

4 F. M. Berezin — 'Lectures on linguistics', visalandhra Publishing House, Vijayawada (1976).

5 Ferdinand de Saussure, 'Course in general Linguistics (Tr) wade Baskin, Peter Owen, London(1960)

6 Hjemslav Louis, — 'Prolegomena to a theory of language' (Tr) whitefield. Madison (1961)

7 Sapir, Edward — 'Language', Harvert Books (ed) (1949)

8 Bloomfield, Leonard — 'Language', Henry Hock & co. Ny (1933)

9 Weinreich Uriel — 'Explorations in semantic theory', in (CTL) Current Trends in Linguistics. Vol. 3, PP. 395-478 (1970)

10 Chomsky, Noam, — 'Language and mind', Harcourt Brace Jovenovich, Inc. NY. (1968)

11 Haugen, — 'Dialect, language Nation' in 'Socio Linguistics', J.B. Pride (ed), PP 97-111. (1972)

12 Hawkes, Terence, — 'Structuralism and Semiotics', Methuen & Co. Ltd. London (1977)

13 Leech, Geofrey — Semantics', Penguin Books (1975)

14 Stall, J. F. — 'Sanskrit Philosophy of Language', in TL (above) Vol. V, PP. 499-531 (1969)


* ఉపయుక్త సారస్వతంలో ప్రధానంగా పాశ్చాత్య గ్రంథాలమీదే ఊనిక చూపడంవల్ల 'వాక్కు' అన్న శబ్దానికి ఆలంకారికులిచ్చిన నిర్వచనాన్ని విపులంగా పరిశీలించలేదు. శబ్దార్థ వ్యాపారాల్ని మూటిని 'వాక్' శబ్దంచేత ఆనందవర్ధనుడు, అభినవులు స్వీకరించారు (చూ. ధ్వన్యాలోకం1-1. పుట 25). అందువల్ల 'భాష్' ధాతువుకి అర్థంలో 'Speech' సంవదించినట్లుగా 'Voice' సంవదించదు. 'భణ్' అన్న మరో ధాతువు 'style of expression' అన్న మరో అర్థంలో వుంది—'భణితి' నిదర్శనం. ఆధునికుల 'భాష' అన్న అనువాదం 'secular mental frame'ని కల్గింది. 'వాక్కు' అన్న ఈ అనువాదానికి తాత్త్విక నేపథ్యం ఉంది. అదే ప్రధానం.



# ఒక్కొక్క వస్తువులో

శ్రీ మాదిరాజు రంగారావు

ఒక్కొక్క వస్తువులో ఒక్కొక్క వింత
అన్నీ గృహానికి చేరేసే దురాశ.
ఒక్కొక్క బిందువులో ఒక్కొక్క ఆశ
అన్నీ ఉషస్సులుగా మార్చే ప్రయాస.

సంచయ భావనతో త్వరపడే చరణాల
శిక్షిత సైనిక పంక్తివలె చీమల బారు
జీవన యాతనలో కదలుతూ ప్రతిజీవి
ప్రత్యణువూ ప్రతిలిప్త తనకోసమనేగా.

చెట్టుకొమ్మల్లో చేతులుకలిపి
పూలు పండ్లల్లో ఊహలు నిలిపి
వేళ్ళ రూపంలో శక్తిని మలచి
నేను కన్పిస్తా మేఘపదగతి.

జనం చూపుల్లో చూపులు నిలిపి
జనం చేతుల్లో చేతులు కలిపి
జనం గుండెల్లో శబ్దఝరి అయి
చరిస్తా చైతన్యం విరిసి పదం.

లేదు నాలో ఎవరిపైనా
అగ్ని కీలాచలన రూపం
నల్పు తెల్పూ ఎరుపుపైనా
శూన్యమై నిల్చిన, మొగంపై.

రాళ్ళను పగులగొట్టే ఉత్సాహంతో
గుండెను హడలగొట్టే ఉద్రేకంతో
సాగిన పవన శబ్దం విన్పించేను
నా హృదయ కుహరంలో గాథాలోకం!

ఏ శిఖరం ఎక్కినా
ఏ నదిలో దూకినా
నీడ అదే వెన్కనే
దీపమదే ప్రాణిలో!

మనిషి హృదయం ఎంతనీ
జలధి చలనం; అందులో
పవనగతి సంగీతమై
గగన వలయం అంచునా.

మనపై ప్రతివేళ వర్షిస్తూ
ఒకదేవత చూపుతోపాటు
కదలే బ్రతుకుల్ని ఆడిస్తూ
ఒక రాక్షసి చేయి! ఉండేను.

ఆ నేలకు సరిపడిన సృష్టి
వస్తుంది వెలుగుకి తలఎత్తి!
రానీ మనసుకు సరిపడింది
శబ్దం సురభితమయినవోహ!



శ్రీ పులికంటి కృష్ణారెడ్డి

# వెలగని దీపాలు

ఆరుమ్మైళ్ళు ఆర్టీసీ బస్సు మీద అందులో సగం అందాల అర్ధాంగితో కలిపి కట్నంగా మామగారందించిన సైకిలుమీద పడుతూ లేస్తూ ప్రయాణం చేసి ఆ మూడంకణాల పూరింటిముందు ఆగి—ఆగిన సైకిలుమీది నుండి క్రిందికి దూకి నొసటి చెమటను నేలపాలుచేశాడు చూపుడు వ్రేలితో—వో నిట్టూర్పు విడుస్తూ దేవరాజు!

దేవరాజు ఏకోపాధ్యాయుడు!

ఎవరనినా అనకపోయినా ఈ మాటచెవినిపడితే తెలుగు మనిషి మాత్రం తప్పకఅంటాడు—ఏకోపాధ్యాయుడా? మేకోపాధ్యాయుడా? అని. అసలే ఉపాధ్యాయులంటే అందరికీ అలుసు. తెలిసి తెలిసీ అతనిని ఆమాట అనిపించడం సముచితం కాదు కాబట్టి — తెలుగువాడికి యిష్టమయిన యింగ్లీషులోనే చెబుకొందాం! — దేవరాజు వో సింగిల్ టీచర్!!

ఊరిముందర చింతతోపులో వెలిసిన ఆ మూడంకణాల పూరిల్లు—ఏకోపాధ్యాయ పాటశాల!

దేవరాజు కంట పడీపడడంతోటే 'అద్దో! అయ్యోర్లొచ్చేసినాడ్రే!' అని అరుస్తూ ఆ చింతచెట్లనీడలో బిళ్ళంగోడి, తొక్కుడుబిళ్ళ, ఉప్పరపట్టి ఆట లాడుకొంటున్న పిల్లలుపిల్లినిచూచిన ఎలుకలు బొరియలో దూరినట్లు బిలబిల ఆ పూరింట్లో ప్రవేశించారు!

ప్రతిదినము ఉదయం ఆరుమ్మైళ్ళు సాయంత్రం ఆరుమ్మైళ్ళు ప్రయాణం చేసి దేవరాజుకు ... మిట్టపల్లాలలో ఎక్కెక్కి దిగి సైకిలుకు నడుములు విరిగాయి. వో చింతమాను బోదె ఆధారంగా సైకిలు నిలబెట్టాడు దేవరాజు. బడిలో అడుగిడపోయి అలా నిలబడిపోయాడు.

''ఏం అయ్యోరా? నీకు తీరినపుడు నువ్వొస్తే యెట్లా? పిల్లకాయలేవో యిట్ల యింటితోడు, అట్ల దోవతోడు రొండు తప్పి సెడిపోతుండారు!'' —సద్దిదుత్త నెత్తిన బెట్టి మడిదగ్గరికి పోతూండినలక్ష్మమ్మ అదేపనిగ నిలబడి సాగదీసింది. దేవరాజు తలవంచుకొన్నాడు!

''అదిగాదు లచ్చుమక్కా! అయ్యోరు మాత్రమేం జేస్తాడు? ఆ ఆర్టీసీ బస్సులు యాళకేడ్సి సస్తేగదా? అవెప్పుడొస్తాయో? ఎప్పుడు పోతాయో? వాటికే తెలవకపోయ! ... వాటికంటే నోరులేని గొడ్లమేపుకుండే నేనేనయం!''—అయ్యవారికి మద్దతు పలికాడు ఆవుల్ని మేతకు తోలుకొనిపోతూండిన యింగంపల్లి బోడెబ్బ!

బోడెబ్బ వైపు సాదరంగా చూశాడు దేవరాజు! — 'అలకాపరివి. నీ కయినా ఆమాత్రం సానుభూతి ఉంది నామీద!' అన్నభావపూరకంగాఉన్నాయి ఆ చూపులు!

''అది నిజమేలే బోడెబ్బా! ఆ బస్సులేవో యాళకురావు. ఈపల్లెకొంపలో అయ్యోరుండ్లేడు. ఈ పిల్లకాయల కింక వానాకాలం సదువే!'' అని గొణుక్కొంటూ మిద్దింటి లక్ష్మమ్మ ముందుకు సాగింది.

పక్కన చేనిలో పడబోతూండిన 'దొంగగొడ్డు'ను అదిలిస్తూ బోడెబ్బ అటువైపు పరుగెత్తాడు.

పాటశాల అనబడే ఆ పూరింట్లో అడుగుపెట్టాడు దేవరాజు!

పిల్లలందరు లేచి నిలబడ్డారు — గురుభక్తి చిహ్నంగా! గురుశిష్యులకు మధ్యనున్న ఆత్మీయతానురాగాలన్నీ అడుగంటి పోతూంటే— యింకనూ ఈ పద్ధతి మాత్రం కొనవూపిరితో ఉంది. దేవరాజు తనకుర్చీలో తాను కూర్చుంటూ పిల్లల్ని కూర్చోమన్నాడు. పిల్లలందరు కూర్చున్నారు.

ఎదురెండ! మూడుమ్మైళ్ళకు కాస అటోయిటోగా బండిబాట! ముప్పయిమూడు సంవత్సరాల స్వపరిపాలనలో మన ప్రజాప్రతినిధుల సేవా పరాయణతకు నిదర్శనంగా నిలబడిన ఆబాట — మూరెడుదూరం బాగుంటే బారెడుదూరం మోకాటిలోతు మిట్టపల్లాలతో ముండ్ల పొదలతో నిండి ప్రజాస్వామ్య వ్యవస్థకు ప్రతీకగా ఉంది. బాగున్న చోట సైకిలెక్కి తొక్కుతూ——బాగలేనిచోట దిగినడుస్తూ ఆ మూడుమ్మైళ్ళు తన సైకిలు ప్రయాణం తలచుకొంటే—మాటిమాటికి ఏదో ఒక తప్పుచేస్తూ, చేసిన తప్పుకు ఫలితంగా గుంజిళ్ళు పెట్టే వో పోకిరి విద్యార్థి మనసులో మెదిలి— తనలోతాను నవ్వుకున్నాడు దేవరాజు!

బడిపంతుళ్ళ జీవితాలలో నిద్రలేచే వేళలు అసలు బాగుండవు. ఆరోజు మరీ బాగలేదు. లేకుంటే—తానప్పుడే రావాలా? పడకపడక మిద్దింటి లక్ష్మమ్మ కండ్లల్లోనే పడాలా? ఆ యిల్లాలు అటుయిటు చూడకుండా మెత్తగా రెండంటించాలా? గ్రహచారం కాకపోతే— ఏమిటిదంతా ?

ఎండవేడి!. . . . మిద్దింటి లక్ష్మమ్మ మాటల్లో వాడి!! — దేవరాజు నోరు పిడచగట్టుకపోతూంది.

గుక్కెడు నీళ్ళు గొంతులో పోసుకోవాలనిపించింది!

అది విద్యాలయము!. . . భావిభారతపౌరుల్ని తీర్చిదిద్దగల దేవాలయము! ఆ దేవాలయంలో గోడలమీద దేశనాయకులపటాలుండేవి. తలుపులు ద్వారబంధ నాలకుకూడ నోచుకోని ఆ పూరింట్లో దేశనాయకుల్ని దోచుకపోతారని 'సర్పంచ్' జాగ్రత్తపడ్డాడు. దేశనాయకులు ఆయనింట చేరారు. ఆతరువాత 'సర్పంచ్' గారి కుటుంబం వేర్లుపోయింది. దేశనాయకులు కూడా వేర్లు పోయారు. ఇక పోతే — రాత్రిపూట ఆబడి యువతరానికి వినోద కేంద్రంగా మారుతుంది. ఈతాకు చాపలు పరిపిస్తారు. 'పెట్రమాక్స్‌లైట్లు' పెట్టుకొంటారు. అర్ధ

రాత్రి దాటినా యిస్‌పేట్ ఆకులాట ఆడుతుంటారు. ఉదయాన వూడిపిస్తే బీడీసిగరెట్టు ముక్కలు వో బుట్టెడుంటాయి! — అయినా తనకు అడిగే తాహతులేదు. అడ్డుకొనుశక్తి అసలేలేదు! తాను ఉపాధ్యాయుడు.

తానొక ఉపాధ్యాయుడనుకొనేసరికి నోరు మరీ పిడచగట్టుకపోయింది.

నోరెండుకపోతూంటే ఆతనిదృష్టి వో మూలకు తిరిగింది. అక్కడ ఆతని కంటపడిందొక కుండ. అది మంచినీళ్ళకుండ!

''ఏరా! ఆ కుండను కడిగినారా?'' అని రోజూ అడుగుతాడు తాను.

''కడిగినాము సార్!'' ముక్తకంటంతో ముప్పయి మూడు గొంతుకలు పలుకుతాయి.

''మంచినీళ్ళు తెచ్చారా?''

''తెచ్చినాముసార్!'' అన్ని గొంతుకలు కలిసి అదేస్థాయిలోపలుకుతాయి.

అయితే ఆ కడిగిన కుండనుతెచ్చిన మంచినీళ్ళను తలచుకొంటే ఒడలు జలదరిస్తుంది. దోసెడు మంచినీళ్ళు ఆకుండ మొగాన కొట్టిదానిని అటుయిటు తిప్పితే—అది కడిగినట్లు! ఏ యింట్లోనో—వీలుగాకుంటే పెరటి తోట్లోనో ఆ కుండ ముంచి నీళ్ళు తెస్తే — అప్పటికవి మంచినీళ్ళయినట్లు !!

ఇక ఉన్నది ఒక్కగానొక్క సత్తులోటా!

వో బుద్ధిమంతుడు కాస్త పైకెత్తి తాగాలని ప్రయత్నిస్తాడు. మరొక్కడు సత్తులోటాను సగానికి పయిగా నోట్లో చొప్పించుకొంటాడు. ఇంకొకడు తాగుతుంటే— సగం నోట్లోకి సగం మళ్ళీ కడవలోనికే!

ఆ దృశ్యం కనులముందు మెదలుతూంటే—దప్పికతో అలానే చావవచ్చునేమో కానీ ఆ నీళ్ళుమాత్రం ముట్టలేమనిపిస్తుంది.

శుచిశుభ్రతను గురించి చెప్పినంత సేపు శ్రద్ధగా వింటారు. శ్రద్ధగా వింటున్నందుకు నిదర్శనంగా చేతులు కట్టుకుంటారు. చెప్పడం అయిన తరువాత చేతులు వదలిపెడతారు. దాంతోపాటు విన్నదీ వదలిపెడతారు.

అందుకే దేవరాజు సుందరరాజును పిలిచాడు. ఇంటికి వెళ్ళి వోచెంబుడు మంచినీళ్ళు తెమ్మన్నాడు.తానేమో ఆకుర్చీలో అలానే చేరగిలపడ్డాడు.పిల్లవాండ్ల గుసగుసలు చింతచెట్ల గాలి విసవిసలతో మేలమాడుతున్నాయి. చింతచెట్ల సందుల్లో నుండి పడుతున్న పొడ ఎండలోపూరిగుడిసె వెలవెలపోతూ ఉంది!— దేవరాజు మొగంతో పోటీ పడుతూ.

సుందరరాజు వో పరుగున బయటపడ్డాడు. దేవరాజు 'ఎప్పుడొస్తాడా?' అని పిల్లవానికోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. పదినిముషాలయినా జరిగీ జరుగక ముందే— ఆ పిల్లవాడు ప్రత్యక్షమయ్యాడు.దేవరాజుకు పోతున్నప్రాణం లేచివచ్చినట్లయింది. లేచి సరిగ్గా కుర్చీలో కూర్చున్నాడు. అయితే కంటపడిన దృశ్యంతో వో క్షణం కలవరపడ్డాడు!

ఆ పిల్లవాడు! — వాడే సుందరరాజులు.దర్జాగా ముందు నడుస్తున్నాడు. వాడింటి సేద్యగాడు వాడివెనుక నడుస్తున్నాడు. సేద్యగాని చేతిలో వో గుండు చెంబు. గుండుచెంబుపై వో లోటా బోర్లించి ఉంది. వింతగా చూశాడా దృశ్యాన్ని దేవరాజు!

సేద్యగాడికంటే ముందు సుందరరాజు దేవరాజు దగ్గరకు వచ్చాడు. సేద్యగానివైపు తిరిగి నిలబడ్డాడు. సేద్యగానిని చూస్తూ ''వూ! ''అంటూ మేజావైపు చేయిచూపాడు. పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది. వాడుచేయిచూపడం లోనే దర్జాఉంది. సేద్యగాడు వినయవిధేయతలతోవంగి గుండుచెంబును మేజా మీదపెట్టి గౌరవ సూచకంగా ఒక్కఅడుగు వెనక్కుజరిగి నిలుచుకొన్నాడు.

దేవరాజు బుర్ర గిర్రున తిరిగింది!

గుండు చెంబునందుకొన్నాడు. గుటగుట గుక్క ఆర్పకుండా నాలుగు నోటల నీళ్ళు పట్టించాడు. 'అబ్బ!' అంటూ తేలిగ్గా నిట్టూర్చాడు. గుండు చెంబుపై లోటా బోర్లించి మేజామీద పెట్టాడు. సేద్యగాడు ఆ చెంబు నందుకొన్నాడు. ఒక్క నమస్కారం పడేసి బడి కడప దాటేవరకు అలానేవెనక్కు నడిచాడు—తన చెమటతాను తింటున్నా తానుతానుగా బ్రదకలేని మనిషి !

సుందరరాజులు ఏదో సాధించినంత తృప్తితో ఠీవిగాగావెళ్ళి తనస్థానంలో కూర్చుంటున్నాడు. సేద్యగాడు కడపదాటేవరకు వెనక్కునడిచి ఆ తరువాత ముందుకు నడుస్తున్నాడు. కూర్చుంటున్న సుందరరాజుల్ని వెడుతున్న సేద్యగాడిని మార్చిమార్చి చూశాడు దేవరాజులు!

కాసిని మంచినీళ్ళు తేవడానికి కుర్రవెధవకు కూలిమనిషి కావలసి వచ్చింది!

అవునుమరి! సుందరరాజులంటే ఎవరు?—సాక్షాత్ ఆ గ్రామసర్పంచ్ ముద్దుల కొడుకు. తాను? — ఆఫ్టరాల్ వో సింగిల్ టీచర్! తనకు దప్పికయితే సర్పంచ్‌కొడుకు నీళ్ళు మోసుక రావాలని ఎక్కడుంది?

అయినా ఎంత విచిత్రంగా మారిపోయిందీ కాలం!

మారిన కాలంతోపాటు మారుతున్న మనస్తత్వాలను గురించి ఆలోచించేసరికి—మనస్సు ఈకాలాన్నిదాటివెనక్కువెళ్ళి ఆకాలంలో అడుగు పెట్టింది.

ఆకాలంలో తానూ ఒక విద్యార్థి!. . . .సుందరరాజుల్లాంటి విద్యార్థి!!

అప్పుడు తన వయస్సుకూడా దాదాపు సుందరరాజుల వయస్సంతే ఉంటుంది. ఆ వయస్సులో ఆ పల్లె కూటమిలో తాను. తనతో కలిసి తనకంటే పెద్దవాళ్ళు కొందరు. . . .చిన్నవాళ్ళు కొందరు!— అందరూ కలిస్తే అయిదు పదులకు మించరు. తనగ్రామం కూడా యిలాంటి వో కుగ్రామమే! —అయితే సహజసౌందర్యం వనగూడిన పల్లె అది!

ఆరోజుల్లో వో మోస్తరుగా ఎదిగిన రెండుపట్టణాలను కలిపే వో బాట అక్కడ వో అర్ధవృత్తాకృతిని సంతరించుకొనింది. తెలివిగల మానవుడు. . . . ఆరునూరయినా అవకాశాన్ని విడిచిపెట్టని ఆలోచనాపరుడు— ఆ అర్ధవృత్తాకృతిలో కాస్త మట్టినితీసి ఆబాట కిటువైపు,అటువైపుపోస్తే— అది మంచినీళ్ళ గుంట అయింది. ఆ కొలనులో కలువలు తామరలు—తమలో తాము పోటీపడుతుంటాయి ఆ కొలను అందాన్ని పెంచడానికి !

ఆకట్టకిందనే వూరు. జక్కదనమని దానిపేరు. ఆ జక్కదనం చూడ చాల చక్కదనంగా ఉండేది!

ఆ వూరిలో అన్నీ కలిపితే పాతిక యిండ్లకు లోపు అయినా అందులో ముప్పాతికవంతు మిద్దెయిండ్లు. . . . ఇంటింటిని చుట్టి అధమపక్షం అర ఫర్లాంగు ప్రహరీగోడ . . . .వూరికి ఉత్తరంగా రామాలయము . . . . రామాలయం ప్రక్కనే వీధిబడి . . . బడిని ఆనుకొని పెద్దచింతతోపు. . . . ఆచింత తోపులో పెద్దబావి. ఒకనాటి మానవుని ప్రతిభావిశేషాన్ని చాటగల నడబావి!

వూరికి మధ్యగా వో మర్రి వృక్షము. ఆ మర్రిచెట్టు బోదె చుట్టు రచ్చబండ. మర్రిచెట్టు నీడలో మరో చెట్టు ఎదగదంటారు. అయితే ఆ చెట్టు నీడ ఆపాయకట్టులోని ఏ కుటుంబాన్ని కూడా కోర్టు వరకు ఎదగనీయలేదు. కోర్టుకెక్కిన కొంప రతికెక్కదని బహుశా దానికిగూడ తెలుసునేమో ?

దాదాపు పది పదిహేను గ్రామాలు ఆ గ్రామానికి కూతదవ్వులో ఉంటాయి. ఆ గ్రామాల కన్నింటికీ అది పాయకట్టు గ్రామము. ఈ పల్లెల్ని చుట్టుముట్టినట్లు చుట్టూ కొండలు వలయాకారంగా ఉంటాయి. ఆ వృత్తాకృతిలో ఈ పల్లెలు. వ్యవసాయమే ఈ పల్లెల్లో జీవనోపాధి. బావినీటిమీదనే ఆధారపడుతుంది అక్కడి సేద్యం. కాగా తొలికోడి కూసేవేళ నుండి ప్రొద్దు తిరిగేదాక 'రాః వన్నెరాః వో! ' అన్న రాగాలతో ఆ ప్రాంతం మారుమ్రోగుతూ ఉంటుంది. ఎద్దులగొట్టి ముద్దలు తినడమయినా-అక్కడి జీవితం క్రమబద్ధం.

ఆ పల్లెల్లో అంతో యింతో వెసులుబాటున్న వాళ్ళు తమ పిల్లల్ని జక్కదనంలోని వీధిబడికే పంపేవాళ్ళు.

ముప్పయి యేండ్లకు ముందటిమాట. భారతదేశ స్వాతంత్ర్య పోరాటం జరుగుతున్న రోజులు. అసలు స్వాతంత్ర్యమంటే ఏమిటో ఆపల్లె లెరుగవు. ఇప్పటిలాగా వూరికొక్క బడి అప్పట్లో లేవు. చదువుచెప్పినా చెప్పకపోయినా బడికి వెళ్ళితే చాలు! నెలపుడుతూనే జీతం చేతికందేరోజులు కావవి. బిడ్డల్ని చదివించాలని శ్రద్ధ ఉన్నవాళ్ళు—చదువంటే యేమిటో అంతో యింతో తెలిసినవాళ్ళు-వొబడి పెట్టి ఆబడిలో అయ్యవారిని నియమించే వాళ్ళు. అయ్యవారికేలోటూ రాకుండా చూసుకోవడం పల్లీయులకు, పిల్లలకు బాగా చదువుచెప్పడం అయ్యవారికి బాధ్యతలుగా ఉండేవి. అయితే ప్రతిఫలం యిస్తున్నామని పల్లీయులకు కానీ— ఏదో చదువు చెప్పాలని చెబుతున్నట్లు భావన అయ్యవారికికానీ—ఉండేవి కావు. 'అయ్యవారు!' అన్న గౌరవం పల్లీయులకు! . . . . పిల్లలు బాగా చదువుకోవాలన్న తపన అయ్యగారికి!! — ఆ ఆత్మీయతల్ని నిర్వచించడం మహా కష్టం. ప్రతిఫలం అన్నమాటకు అతీతంగా ఉండేది వ్యవహారం!

చెరకుగానుగలు ఆడుతుంటారు. "నువ్వు ఒకముద్దేనా? నేను రెండు ముద్దలు!" అని పోటీపడి తెస్తారు పిల్లలు. ఒొట్టెవాడికంటె ముక్కలవాడిపనే నయమన్నట్లు ఆ యేడాది అయ్యవారింట్లో బెల్లానికి లోటుండదు. అలాగే చింతపండు . . . మిరపకాయలు . . . ధాన్యం— ఏ కాలానికాపంట! ఏయే పంట కాలానికి అయ్యవారింట్లో ఆయా పంట!

అప్పట్లో వీధిబడిలో చదువు చెబుతున్నది అప్పావు పిళ్ళ!

కన్నుకాస్త మెల్ల అయినా ఆయన స్వరూపం యింకను కన్నులకు కట్టినట్లుగానే ఉంటుంది.

ముచ్చటగా మూడు విభూతిపట్టెలు. . . .మధ్యగా దమ్మిడంత గంధం బొట్టు. . . అరవ అడ్డపంచెకట్టు. . . . అరచొక్కామీద ఏ నాటిదో పాత కోటు. . . . రడీమేడ్ తలపాగా! చేతికి చింతబరికె అందుకొంటే బడి గడగడలాడేది.

అయినా అయ్యవారికీ పిల్లలకు మధ్య ఎంత ఆత్మీయత?

అలనాటి తలంపులలో తేలిపోతున్నాడు దేవరాజు. అయితే అయ్యవారి తలంపులు అయ్యగారివిగా ఉంటే పిల్లల రంపు పిల్లలదయింది. ఆ రంపుతో ఈ లోకంలో పడ్డాడు దేవరాజు.

పిల్లల రంపుతో అనుభూతి చెడిపోయినందుకు ఆవేశపడ్డాడు దేవరాజు. బెత్తం చేతికందుకున్నాడు. 'సైలెన్స్' అని అరుస్తూ, చేతి బెత్తంతో శక్తి కొలదీ కొట్టాడు— మేజామీద! — ఎటూ పిల్లల్ని కొట్టలేడు కాబట్టి.

గతాన్ని నెమరువేయడంలో ఆనందముంది. ఆనందంలో అనుభూతి. అదే అనుభవిస్తున్నాడు దేవరాజు. అయితే పిల్లల రంపుతో ఆ అనుభూతికి అంతరాయం కలిగింది. అంతరాయం తొలగాలంటే అల్లరి తొలగాలి. అల్లరితొలగాలంటే పిల్లలకేదో పనిపెట్టాలి. అందుకే సుద్దముక్కను చేతికందుకొన్నాడు. నల్లబల్లను సమీపించాడు.

చిన్నకాపురానికయితే పెద్దది... పెద్దకాపురానికయితే చిన్నది—అనిపించగల సంకటి పలకంత ఉంటుందా నల్లబల్ల. అదిగూడ అప్పుడప్పుడు మాయమవుతుంటుంది. ఆ వూళ్ళో పొట్టేలినో, మేకపోతునో కోస్తే పాళ్ళు వేయడానికి పలక అవసరముంటుంది. ఈ పలక ఆ పలకగా మారుతుంది. అయితే అదృష్టవశాత్తూ ఆరోజు అలాంటి అవసరము రాలేదు కాబట్టి ఆ పలక నల్లబల్లగా మిగిలింది.

ఆనల్లబల్లను అయిదు భాగాలుగా విభజించాడు దేవరాజు. ఒక్కొక్క తరగతికి ఒక్కొక్కభాగం. మిద్దింటి లక్ష్మమ్మ అక్కడ వుంటే కసిదీరా అడుగుదామనిపించింది ఆ పలకను చూపించి — 'యింతమందికి ఈ ఒక్క పలకతో నా చావెట్లా చావమంటావు ?' అని.

ఆ వూళ్ళో తాను అడుగుపెట్టింది మొదలు— ఎంతో మందితో ఎన్నో చెప్పాడు. మరెన్నో అడిగాడు. విన్న నాథుడు లేడు. ఇదిలా అన్న యోగ్యుడూ లేడు. సరిపెట్టుకోవడములో సాధ్యుడయ్యాడు దేవరాజు.

అందుకే ఒక తరగతికి లెక్కలు . . . వ.రొక్క తరగతికి పద్యాలు ... యింకొక్క తరగతికి పదాలు — యిలా తరగతి కొక్కపని కల్పించాడు. కల్పించిన పనిని చేయమని పురమాయించాడు పిల్లల్ని!

పిల్లలందరు పలకలందుకొంటున్నారు. ఒకడు నీళ్ళుపోసి పలకను కడుగుతున్నాడు. వ.రొక్కడు అటుయిటు చూచి అంత ఎంగిలి రుద్దుతున్నాడు. ఇంకొక్కడు జేబులో భద్రపరచుకొన్న బలపాకు పిండిరసం తీస్తున్నాడు. నవ్వుకొంటూ దేవరాజు కుర్చీలో కూలబడ్డాడు.

''సార్!''

పిలుపు వినిపించిన వైపు తిరిగాడు దేవరాజు.

వో కుర్రవాడు నిలబడి ఉన్నాడు.

''ఏరా?''

''ఒంటికిసార్!'' కుడిచేతి చూపుడు వ్రేలిని వంచి చూపుతూఅడిగాడు.

''వచ్చి పదినిముషాలయినా కాలేదు. అప్పుడేఒంటికి బయటికి. చదువుకోమంటే చాలు— సవాలక్ష సాకులు!'' అని గొణుక్కుంటూ 'పోరా!' అన్నాడు.

ఆమాట చెవిని పడడంతో ఆ కుర్రవాడు అక్కడే నిక్కరు గుండీల మీద చేతులు పెట్టి పరుగందుకొన్నాడు. అలా పరుగెత్తుతున్న కుర్రవాడిని చూస్తూ తనలో తాను నవ్వుకొన్నాడు దేవరాజు!

అప్పుడు తనకూ అదే వయస్సు!

అప్పావుపిళ్ళ అయ్యవారి ముందర లేచినిలబడి ఎడమచేతినివెనక్కు పెట్టి కుడిచేతిని మూతివరకు పైకెత్తి చూపుడు వ్రేలినికాస్త వంచితే చాలు!— 'చిన్నోడా!' అని ఆప్యాయంగా పిలుస్తూ ఎడమచేతిని పైకెత్తి అన్ని వ్రేళ్ళు ముడిచి చూపుడు వ్రేలిని మాత్రంచూపేవాడు అప్పావుపిళ్ళ. అలా చూపుతూ అదోరకంగా నవ్వేవాడు. గుబురుమీసాల సందులనుండి ఆ నవ్వు అందచేసే కబురు తనకు అయ్యవారికి మాత్రమే తెలుసు!—అంతే!— ఒక్క పరుగులో గుంటకట్టమీద వాలేవాడు.

గుంటకట్టమీద వెలగచెట్టు. వెలగచెట్టు క్రింద వో పూరి గుడిసె. గుడిసెలో 'అంగిడవ్వ!' — 'అంగిడవ్వ' వడలు, మురుకులు కాలుస్తుంది. దోసెలు పోస్తుంది. బీడీలు సిగరెట్లు ఆకు వక్క పొగాకు అమ్ముతుంది. ఆబాట మీద పడి నడిచేవాళ్ళ నోటికంత ఆకు వక్క కావాలన్నా, ఆచుట్టుపక్క పల్లెల్లో పిల్ల చేతికి ఒక వడనో, మురుకునో యివ్వాలనుకొన్నా 'అంగిడవ్వ'యే శరణ్యం.

అవ్వముందు నిలబడితే చాలు. 'ఏమిరా? మనవడా? వచ్చేస్తివా?' అని బోసినోటితోనవ్వుతూ వో మురుకునో లేదా వడనో చేతిలో పెడుతుంది. అక్కడితో పూర్తికాదు పని. అవ్వతో ఆమాటా ఈమాటా మాట్లాడాలి. అవ్వకేదయినా కావలసి వస్తే అందిస్తూ సాయపడినట్లు నటించాలి. అవ్వ ఏమరుపాటును ఎదురుచూడాలి. సందుదొరికితే చాలు! — అంత పొగాకు కాడతుంచుకొని పరుగో పరుగు !

గసపోసుకొంటూ వెళ్ళి అయ్యవారి పక్కన నిలబడినట్లు నిలబడి ఎవరి కంటా పడకుండా ఆ పొగాకుకాడను అయ్యవారిచేతిలో పెడితే ఆపిచ్చిమారాజు ఎంత సంతోషించేవాడో?— పొగాకు కాడ నోట్లో వేసుకొని తన్మయత్వంతో నములుతూ పాఠాలు చెబుతూంటే తనకెంత సంతృప్తి కలిగేదో?

గత స్మృతి దేవరాజు ఆనందానికి శ్రుతికలుపుతూ ఉంది!

ఒకటిరెండురోజులు ఆటవిడుపువస్తేచాలు! బడిబడిగా కదలినట్లుండేది గూటంకొండకు. 'బుడంకాయంత బుల్లోళ్ళు!—మీరు గూటంకొండ ఎక్కడ మటుంచి అంతదూరం నడవలేరురా!' అని అయ్యవారు వారిస్తున్నా వినకుండా గూటంకొండ వైపు పరుగులుతీసేవాళ్ళు పిల్లలు. ఆ పల్లెల్ని చుట్టివున్న కొండల్లో ఎండిన కట్టెల్లాంటి ఆకారాల మధ్య వో ఒళ్ళుబలిసిన మనిషి నిలబడినట్లుండేది గూటంకొండ! ఆ కొండలో బిక్కి బీర ఉలింజ పరిగ రేగుపండ్లు చెట్లు విరగకాసినట్లుండేవి. బయలుదేరడ మేమో పండ్లకోసమని! — తీరా అక్కడికి వెళ్ళిన తరువాత పండ్లమీది దృష్టికంటే ఎండుకట్టెలమీది దృష్టి పంతాలు పడేది. పోటీలుపడి ఎండుకట్టెలు ఏరుకొనేవాళ్ళు పిల్లలు. 'నీమోపు కంటే నా మోపు పెద్దది. మనిద్దరిమోపు కంటే వాడి మోపు చిన్నది!' అని పంతాలు పడుతూ తలకు మించిన బరువును మోపుగా కట్టుకొనే వాళ్ళు. నెత్తిమీదికి చుట్టగూడా ఉండేదికాదు. కాస్త తంగేడుఆకు పెరుక్కొని తీగలతో చుట్టగాచుట్టి ఆకట్టెలమోపు నెత్తికెత్తుకొనేవాళ్ళు! ఉచ్చిపీకుతున్నా

లెక్క చేయకుండా దాదాపు రెండుమూడు మైళ్ళు చెప్పులులేని కాళ్ళకు చైతన్యమొస్తే ఆ కట్టెల్ని మోసుకొనివచ్చి అయ్యవారింట్లో కుప్పవేస్తే— అదెంతెత్తు కుప్పయ్యేది? ఆ కుప్పనుచూచి 'అయ్యోరికింక నెల్నాళ్ళుబాదే లేదురా!' అని అనుకొనేసరికి ఆ చిన్నిగుండెలు ఆనందంతో ఎంతెత్తు ఎగిరేవి?

ఇంట్లో పొద్దస్తమానము పొలం పనుల్లో అలసిసొలసి వచ్చినఎద్దుల్ని చూపించి 'ఒరే! సిన్నోడా! ఆ ఎద్దుల మొకానంత తవుడు కలిపికొట్టురా?' రాత్రి పూట పాలువారి అమ్మో నాయనో చెబితే చాలు! — వూరుచూడమంటే ఉత్తరం చూచేదిమూతి. అలాంటి మనస్తత్వం—అయ్యవారింటి పనంటే ఎగిరి గంతులు వేసేది. ఏమిటో ఆ ఆత్మీయత?

రామాలయానికి వెనుక వో తోట ఉండేది. స్వామిపూజకు ఆ తోటలో ఒకప్పుడు రకరకాల పూలుపూచేవి. వూళ్ళోవాళ్ళకు పొత్తులు పోకుండా ఆతోట పాదముయంగా తయారయింది. ఆ తోటను 'భజనతోట' అంటుంటారు. ఆ తోటమీద పడింది అయ్యవారి దృష్టి. 'తోటపని' పేరుతో ఆ తోట కూర గాయల తోటగా తయారయింది. పెద్దబావినుండి కావిళ్ళు గట్టి నీళ్ళుమోసే వాళ్ళు పిల్లలు. అలాగే అయ్యవారింటికి కూరగాయలూ మోసేవాళ్ళు!

అంతేనా? గంగమ్మజాతరలు . . దసరాపండుగలు — వస్తేచాలు. వేషాలు వేసుకొని పిల్లలు తొక్కని గుమ్మం లేదంటూతిరిగేవాళ్ళు. కోటికి పడగలెత్తక పోయినా కొదువలెరుగని గుండెలు ఆకాలం మనుష్యులకు! చాటతో ముంచితేస్తే పార్లిపోతుండేది ధాన్యం. ఆ ధాన్యం ఎంతలేదన్నా మూడు, నాలుగు మూటలయ్యేది. ఆ ధాన్యాన్ని మోసుకొనిపోయి అయ్యగారింటి నట్టింట్లో పోసి నపుడు 'అయ్యోరమ్మ' ఆ ధాన్యాన్ని కడవలకెత్తి దొంతర్లు పెట్టేటప్పుడు— పట్టపగ్గాలుండేదికాదు ఆనందానికి!

ఆరోజులు ఆరోజులే! — ఆరోజులిక రావు !!

ఈరోజుల్లోనా?— "గుక్కెడు మంచినీళ్ళు గొంతులోపోయరా!" అంటే ఆ మంచినీళ్ళు మోసుకరావడానికి మనిషి అవసరమయింది.

ఎంతచిత్రంగా మారిపోయారీ కాలం పిల్లలు.

దేవరాజు మారిన పిల్లల మనస్తత్వాల్ని గురించి యింతవరకు ఆలోచిం చాడు. అయితే ఆతని ఆలోచనలు ఆతనికే ఎబ్బెట్టుగా కనుపిస్తున్నాయి. తాను యింతసేపు ఆలోచించింది ఒకవైపే! — అంటే పిల్లల్ని గురించి. మరి ఉపా ధ్యాయుల్ని గురించి?

ఉపాధ్యాయుల్లో మాత్రం విద్యార్థుల మీద ఆనాడుండిన ఆత్మీయత అనురాగము అనుబంధము ఈనాడున్నాయా? ఈ ఆత్మీయతానురాగాలు ఉపా ధ్యాయునికివిద్యార్థికిమధ్య సేతువులని కనీసం ఆలోచించగలుగుతున్నారా ఈనాటి ఉపాధ్యాయులు? వస్తున్నారు. బడికి రావాలి కాబట్టి వస్తున్నారు. రాకపోతే జీతాలు రావు. జీతాలు రాకపోతే పూటగడవదు. కాబట్టి వస్తున్నారు. వచ్చి చెబుతున్నారు—తమకు తోచినంతవరకు!— లేదా తెలిసినంత మట్టుకు!! వినిన వాడు వింటున్నాడు. లేనివాడు పోతున్నాడు?— ఆ సంగతులేవీ అక్కర్లేదు తనకు!

కానీ ఆనాటి ఉపాధ్యాయుడు!

ఆమాట తలచుకొనేసరికి శరీరం గగుర్పొడిచింది దేవరాజుకు!

ఆ దృశ్యం యింకను కళ్ళకు కట్టినట్లు కనుపిస్తూ ఉంది.

వో వేసవి కాలంనాటి రాత్రి. ఉక్కపోస్తూ వుంటుంది కాబట్టి — వూరువూరంతా యిండ్లముందు వాకిళ్ళల్లో వరుసగా మంచాలు వేసుకొని పడు కొన్నారు. అప్పావుపిళ్ళ కుటుంబం కూడా అలాగే పండుకొనింది. అయ్యవారి మంచి హృదయంలాంటి పండువెన్నెల . . . . పుచ్చపూసినట్లు పిచ్చిగా నవ్వుతూ వుంది. ఎక్కడనుండి వచ్చిందో మాయదారి పాము. ఎవరికంట పడకుండా ఎలా కరిచిందో అయ్యవారి కొడుకును. నిద్రలేచేసరికి — అయ్యగారి ఒక్కగానొక్క కొడుకు — పడుకొన్నవాడు పడుకొన్నట్లే ఉన్నాడు. అయితే చచ్చిపడిఉన్నాడు.

ఊరూనాడూ ఏకమయింది. కంటికి కడివెడు కన్నీరు కార్చింది.

"అందుకే ఒక కన్ను కన్నుగాదు. ఒక్కొడుకు కొడుకు కాదన్నారు పెద్దోళ్ళు. పాపం. అప్పావుపిళ్ళయ్యోరు యింక పైకి లెయ్యలేడురా !" అన్నారు ఊళ్ళోవాళ్ళు.

అయితే దహన సంస్కారంచేసి ఆ మధ్యాహ్నమే బడికి వచ్చాడు అప్పావు పిళ్ళ. అయ్యవార్ని చూసేసరికి గొల్లుమన్నారు పిల్లలందరు !

మహావేదాంతిలా నవ్వాడు అప్పావుపిళ్ళ !

"ఒరే! అబ్బాయిలూ! చచ్చిపొయ్యింది ఒక్క కొడుకే గదరా! — మరి మీరంతా బిడ్డలుకారా? యింతమంది బిడ్డలుంటే నాకెందుకురా బెంగ!"

**ఆ మాటతో** కుమిలికుమిలి యేడ్చారు పిల్లలు!పిల్లల్నిచూస్తూ అయ్య వారు, అయ్యవార్ని చూస్తూ పిల్లలు!! — కాకిశోకంగా తయారయింది.

ఏమయిపోయారలాంటి ఉపాధ్యాయులు ?

ఆ ప్రశ్న మనస్సులో మెదిలేసరికి మనస్సు చివుక్కుమనింది దేవరాజుకు!!

అవును. ఆనాటి ఉపాధ్యాయులు వెలిగేదీపాలు! తామువెలుగుతూ ఎన్నో దీపాల్ని వెలిగించారు. వెలిగినదీపాల్ని చూచి 'ఇదినావెలుగు! ఇది నా వెలుగు!' అని మురిసిపడ్డారు.

కానీ ఈనాటి ఉపాధ్యాయులు వెలిగించినా వెలగని దీపాల మధ్య తామూ వెలగని దీపాలు!

దేవరాజు గుండెల్లో నుండి భారంగావెలువడిన నిట్టూర్పు ఆ పూరింటి పైకప్పు సందుల్లో నుండి బయటపడి చింతచెట్లమీద చేరి అరుస్తున్న కాకిగోలతో కలిసిపోయింది!

శ్రీ ఎన్. ఎస్. సుందరేశ్వరరావు

# ఎలకూచి బాలసరస్వతి

'శ్రీ సకల భాషా కవితా స్వతంత్ర భట్టారక యెలకూచి బాల సరస్వతీ మహోపాధ్యాయుడు' ఆంధ్రశబ్ద చింతామణిని అవతరింపజేసిన భగీరథుడు. ఇతని అసలుపేరు వేంకటకృష్ణయ్య.[1]

''వేంకట కృష్ణయాఖ్యుండనేనంధ్ర శబ్ద చింతామణి తెలిఁగించెద'' అని శబ్దచింతామణి అవతారిక.

ఆదికవి నన్నయ తరువాత బాలసరస్వత్యప్పకవ్యహో బల పతులకున్న ప్రచారము ఆంధ్రవ్యాకరణ పండిత లోకమున మఱొకరికి లేదనుటలో అతిశయోక్తి లేదు.

''బాల్యమునఁబల్కు ప్రవిముగ్ధభాషణముల
తోడనె కవిత్వ పద్య సూక్తులును బల్కు
నేర్చి విఖ్యాతి మెఱసి పండితవరుండ
నైతి నిది శారద యనుగ్రహంబు కాదె''

అని తన చంద్రికా పరిణయమునందు చెప్పకొనుటచే నీతనికీ బాలసరస్వతి నామ మన్వర్థ నామధేయమై యుండనోపును. 55 సంవత్సరముల క్రితమే క్రోధన పుష్యమాస 'భారతి'లో మానవల్లి రామకృష్ణకవి రచించిన 'ఎలకూచి వెంకటరాయకవి' వ్యాసము ముద్రితమైనది.

## దేశము

బాలసరస్వతి ఇంటిపేరు ఎలకూచివారు. క్రీ.శ. 1343లో కౌండిన్యస గోత్రోద్భవుడును, యజుశ్శాఖాధ్యాయియును, నాపస్తంభ సూత్రుడును, సర్వేశ్వరయజ్వపౌత్రుడును, శంభుసోమయాజి పుత్రుడును నైన ఎలకూచి వల్లభశిష్టకు ప్రోలయవేమారెడ్డి కొండవీటి ప్రాగ్భాగమున గల మంచాళ్ల గ్రామము[2] ను ధారాదత్తము చేసెను. ఈ దీర్ఘ శాసనమునందు ఎలకూచి వంశీయుల నామము లనేకము గలవు. మంచాళ్ళగ్రామము పాకనాటిలోనిది. ప్రోలయ వేమారెడ్డి కాలమున గుండ్లకమ్మనది కిరువైపులనున్న దేశమునకు పాకనాడని వ్యవహారము. మంచాళ్ల గ్రామదాన ప్రతి గ్రహీతయైన వల్లభ శిష్ట ''సకలజగద్విత వేదవేదాంత సర్వతంత్ర స్వతంత్రానేక స్మృతి పురాణేతిహాస సారజ్ఞుడు. షడ్ధర్మనీ వల్లభుడు'' శాసనమునందున్న వారిలో ఎలకూచి తిరుమలభట్లు, తిప్పనసోమయాజి మొదలగువారి నామధేయములున్నవిగాని బాలసరస్వతి యిచ్చిన తన పూర్వ వంశజుల నామములతో నేకీభవింపకున్నను నా శాసనమునందున్న ఎలకూచి వారు బాలసరస్వతి పూర్వులేయని చెప్పగలము. గోత్రసూత్రములను బట్టియు ప్రదేశమును బట్టియు ఎలకూచివారు పాకనాటివారనియు, కౌండిన్యసగోత్ర ఆపస్తంభ సూత్ర యజుశ్శాఖాధ్యాయులనియు మాత్రము స్పష్టము. ఎలకూచివారిది పాకనాటి పండిత కుటుంబ మని విస్పష్టము. వీరు తొలుత పాకనాడు[3] నివాసులు.

## వంశము

ఆంధ్రశబ్ద చింతామణి[4] అవతారికా పద్యములలో నొకదాని యందు బాలసరస్వతి తన పూర్వులను గూర్చి చెప్పియున్నాడు. ఆ పద్యము ననుసరించి వంశవృక్షం నిర్మింపబడినది.

వంశవృక్షము ననుసరించి చూడగా బాలసరస్వతి తల్లి లక్ష్మనాంబిక, తండ్రి కృష్ణసత్కవి, తమ్ముడు ఆదిత్యకవి. తండ్రియు తమ్ముడును కవులైనట్లు బాలసరస్వతి చెప్పచున్నాడు. తండ్రి 'పాకనాటి సకల కవిజనాచార్యుడు' (బా.స.తీ. 9) తమ్ముడైన ఆదిత్యకవి యే గ్రంథమును వ్రాసెనో బాలసరస్వతి చెప్పలేదు. కాని ఆదిత్య పురాణమను నొక గ్రంథమును వ్రాసినట్లీటీవల తెలిసినది.

''ఇతని సోదరుడగు ఎలకూచి పినయాదిత్యుఁడా దిత్య పురాణమును దెలిఁగించెను. దాని కృత్యాదియందాతఁడు తాను బాల సరస్వతికి నవరజుండనని వ్రాసికొనెను. బాలసరస్వతి తన నన్నయ భట్టీయ వ్యాఖ్యాన పీఠికలోఁగూడ నీతఁడు తనసోదరుఁడని చెప్పెను. ఆదిత్యపురాణ మెనిమిది యాశ్వాసముల గ్రంథము. పినయాదిత్యుడు చతుర్విధ కవిత్వ రచనా ధౌరేయుడు. ఆదిత్యపురాణము దాతయగు పొంపూరి గురవమంత్రీంద్రునకుఁగృతి యిచ్చెను. ఇతని తాతయగు భైరవుడు రామరాజాస్థాన కవియఁట! ఇతని గుఱించి సంపూర్ణ వ్యాసము కావలసినవారు నేను ఆంధ్రపత్రిక సారస్వతానుబంధంబున వ్రాసిన వ్యాసమును జూచుకొనుఁడు.'' అని శతక కవుల చరిత్ర[5] కర్తలగు వంగూరి సుబ్బారావుగారు తెల్పియున్నారు. దీని శిథిల ప్రతి ఆంధ్ర సాహిత్య పరిషత్తునందుగలదు. బాలసరస్వతి ముత్తాతయైన రామనకు తిర్మలయ్య యను అన్నగారు కలడు. అతడు అళియరామరాయలచే నెడవల్లి ముఖ్య సద్గ్రామ హేమచామర ఛత్రాందోళికా పల్యంకి కామణీ విభూషుడు (బా.స.తీ. 8)




## బా ల స ర స్వ తి

రాఘవ యాదవ పాండవీయమునుబట్టి, బాలసరస్వతి వేద శాస్త్రపురాణ వివిధ సంగీత సాహిత్యాది విద్యోప బృంహణుడనియు, కౌండిన్యస గోత్రుడనియు, హరిభక్తి శీలుడనియు తెలియుచున్నది. బాలసరస్వతీయమునుబట్టి చూడగా నీతడు దక్షిణ కాళికాదేవ్యుపాసకుడని తేటపడుచున్నది. బాలసరస్వతీయ మీ దేవత కే అర్పితము.[5a] బాలసరస్వతికి గురు వెవ్వరో తెలియదు. చంద్రికా పరిణయమున "గురు ముఖ్యు స్మరించెద మల్లికార్జునున్" అని మల్లికార్జునొకని గురు ముఖ్యునిగా పేర్కొనెను. ఆ పద్యపాదములు స్పష్టముగా లేనందున మల్లికార్జున గురువుయొక్క వివరములు లభ్యపడవయ్యెను.

గద్యలలో బాలసరస్వతి తాను మహోపాధ్యాయుడనని చెప్పుకొన్నాడు. ఈ బిరుదములు వ్యాకరణ మీమాంసాది శాస్త్రముల యందారి తేరినవారును నిరంతరము శిష్యులకు పాఠములు చెప్పువారలును ధరించెడి వారట! ఉపాధ్యాయ, మహామహోపాధ్యాయ[6] బిరుదములను గూర్చి కొంత శోధింపవలసినదే.

## బాలసరస్వతి రచనలు

ఆంధ్రశబ్ద చింతామణి వ్యాఖ్యానమే అన్ని గ్రంథావతారికల యందు కనబడుచుండుటచే నదియెన్నడు వ్రాయబడెనో యూహించుట కష్టము. దీని నాధారము చేసికొని గ్రంథరచనా పౌర్వాపర్యమును నిర్ణయించుట నిష్ప్రయోజనము. లభ్యములగుచున్న వానిలో చంద్రికా పరిణయము ప్రథమము.

(1) చంద్రికా పరిణయము: —నల్లగొండ జిల్లాలోని పరిటాల జమీందారులగు జూపలివారికి కృతి. కృతిభర్త వెలమవీరుడైన వేంకటాద్రి. ఏతత్ కృతిభర్త బాలసరస్వతితో

క. "పరమేశ్వరియగు భారతి
కరుణ వడసి వివిధ శాస్త్రకవితా సంగీ.
త రహస్య తజ్ఞులై పరం
గిరి కీర్తుల మత్కులమునఁ గీర్తితు లెల్లన్"

కావున శారదయందు మాకు భక్తిగలదు. నీ ప్రబంధంబు "శారదాంబ కర్పణము సేయు"మనెను. ఇది సమంజసముగనే యున్నది. సర్వజ్ఞ సింగభూపాలుడీవంశమున సంగీత సాహిత్య గ్రంథములను రచించి విఖ్యాతికెక్కెను. శ్రీనాథునివంటి కవితల్లజుడే భూపాలుని మెప్పబడయుటకై శారదాదేవిని 'సరస సద్గుణ నికురంబ శారదాంబ'యని స్తుతించుట విజ్ఞులెరింగినదే. ఈ చాటువు బాలసరస్వతి నాటికే ప్రచారములోనున్నట్లు బాలసరస్వతీయమున అజన్త పరిచ్ఛేదము. 9వ సూత్ర వ్యాఖ్యాన సందర్భమున 'నమహత్తుల' విశేషణములు నమహత్తులగునని తెల్పుచు 'సరస సద్గుణ నికురంబ శారదాంబ'యని పేర్కొనెను.

"చంద్రికా పరిణయము అసమగ్రము. ద్వితీయా శ్వాసారంభముతో నిలిచిపోయినది. వ్రాత ప్రాచీనము. అర్ధానుస్వారములు

తెనుఁగు ౧టవ అంకెను బోలియున్నవి. శైథిల్యగ్రంథ పాతములు రెండును గలవు. "కుంతీ సుత మధ్యముఁడైన భీముఁడు కాశీ రాజు కూఁతు చంద్రికను వరించుట మున్నగు కథ యిందు వర్ణింపఁబడినది. విప్రర్ణాన్వయుఁడును, తిమ్మమహీపతి పుత్రుం డును, కవి కాశ్రయ దాతయునగు జూపల్లి వేంకటాద్రి ప్రేరణ మున నీ కృతి సరస్వతి కంకితము చేయఁబడినది. గ్రంథమెన్ని యాశ్వాసములో యెఱుంగ రాదు." [7]

(2) రాఘవ యాదవ పాండవీయము:—ఈ గ్రంథావతారికలో చంద్రికా పరిణయమును బేర్కొనుటచే దాని తరువాత కృతియని స్పష్టము. రామాయణ, భాగవత, భారత కథలు మూడును జోడించి చెప్పుటచే నిది త్ర్యర్థి కావ్యమని చెప్పకయే చెప్పుచున్నది. అద్భుతమైన తన ప్రజ్ఞకు సాక్షిగా నీ కావ్యమును జేసినట్లు కవి చెప్పుకొనెను.

గీ. "ఖ్యాతికై కొందఱే మేమొ త్ర్యర్థి కృతులు
చేసితి మటందురది కల్లసేయనేల
సరసులకుఁ బ్రతిపద్య విస్మయ మొసంగు
నాదు కబ్బంబునకు సాటిలేదు గాన"

ఈ త్ర్యర్థి కావ్యకర్త లెవరో తెలియుటలేదు. ఇదే కాలము నకు, ప్రదేశమునకు చెందిన మరింగంటి సింగరాచార్యులు ద్వ్యర్థి, చతురర్థి కృతులను గావించెనుగాని త్ర్యర్థి కావ్యము రచించినట్లతడు చెప్పలేదు.[8] వ్యాఖ్యానముతోనున్న ప్రతి కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తునందుగలదని గ్రంథ వివరణపట్టిక తెల్పుచున్నది.

(3) మల్ల భూపాలీయము:— బాలసరస్వతి తన కృతిగా బేర్కొనని గ్రంథమిది. భర్తృహరి సుభాషిత త్రిశతి కాంధ్రీ కరణము. 'సురభి మల్లానీతి వాచస్పతీ', సురభి మల్లామానినీ మన్మథా! సురభి మల్లావైదుషీ భూషణా ! యను మకుటములు గల్గి శతక లక్షణమునకు సరిపోవుచున్నది. గ్రంథారంభమున 'శ్రీమద్బాల సరస్వతీ ప్రకట లక్ష్మీ హేతువై'యని బాలసరస్వతి నామ ముదాహరింపబడుటచే నీ కృతి బాలసరస్వతి కృతముగా నెన్నవలసినదేకాని, ఈ శతకమును బాలసరస్వతి వ్రాసినట్లెచ్చ టను జెప్పియుండలేదు.

(4) శబ్దాను శాసనటీక (బాలసరస్వతీయము):— 'సత్కవీంద్ర మస్తక మాణిక్య మౌచుంబశస్తమై ధాత్రినా చంద్ర భాస్కరముగా విభాసిల్లుచున్న ఆంధ్ర శబ్దచింతామణికి టీక. అప్ప కవ్యహోబల పతులీ శిరోభూషణము కళ్ల కద్దుకొని నెత్తికెక్కించు కొనియేయున్నారు.'

'మున్నొక నాడు విద్యానగరిలో నచింత్య కారణోపాగమ స్నేహ సాహచర్యుండగు శివయోగిచే దైవ చోదనం బరిప్రాప్తమైన ఆంధ్ర శబ్ద చింతామణి గ్రంథమునకు లోకోపకారార్థంబు బాల సరస్వతి' గావించిన తెలుగు టీక యిది. క్రీ. శ. 1656వ సంవ త్సరమున అప్పకవి, బాలసరస్వతి కిచ్చిన శివయోగి రాజరాజ నరేంద్రుని పట్టియైన సారంగధరుడని, ఆ సారంగధరుడే'మొన్నటి కీలక సమమున మతంగ గిరికడ' నాంధ్ర శబ్దచింతామణిని బాల సరస్వతికి నొసగెనని చెప్పియుండుటచే బాలసరస్వతికి ఆ.శం చిం. లభించిన సంవత్సరము క్రీ. శ. 1608 యనియు, స్థలము విద్యా నగరిలోని మతంగగిరి[9] సమీపమున ననియు స్పష్టము. ఆంధ్ర శ. చిం. లభించినది విద్యానగరమేయని చెప్పుటకు అందు విరూపాక్షుని స్తుతియుండుట నిదర్శనము.

ఆంధ్ర శబ్ద చింతామణి కర్త శబ్దశాసనుండగు నన్నయ యనియు నతడు 'యథోచితసూత్రతగర్భంబులగు నార్యావృత్తంబులు బంచ పరిచ్ఛేదకంబుగా సమకట్టెననియు, తాను నేర్పుకొలది తత్సూత్ర విభాగంబును దత్ప్రమేయ వివరణంబును, దదుదాహ రణ స్వరూపంబులను నాం ధమయ గద్యపద్యంబుల నేర్పరచి తన యాత్మదేవతయగు అంబాదేవి కర్పించెననియు నవతారికయందు విపులముగా చెప్పియున్నాడు. తన టీకకు శబ్దాను శాసన టీకయని పేరిడినాడు. ఆంధ్ర శబ్ద చింతామణికి అప్పకవి పద్య వ్యాఖ్యాన మును అహోబలపతి కవి శిరోభూషణమను, సంస్కృత వ్యాఖ్యా నమును రచించి తెనుగు నాట ఆంధ్ర శబ్దచింతామణిని పండితు లకు హస్తామలకములుగా నందిచ్చినారు. చారిత్రకముగా 'అపరాధ పరిశోధన' గావించినచో ఆంధ్ర శబ్ద చింతామణి అవతరణము అసదృశ వాఙ్మయ ప్రపంచ రహస్యములలో నొకటిగా గుర్తింప వలసి యున్నది. ఆంధ్ర శబ్దచింతామణికి ప్రచారమునకు వీరు మువ్వురేగాక వర్తమాన కాలమున స్మరింపదగిన మహాపురుషు లొకరు కలరు. ఆ కీర్తి మూర్తి కథాశేషులైన కళాప్రపూర్ణ వఝుల చిన సీతారామశాస్త్రిగారు. వాఙ్మయ చారిత్రకుల వాలు సవాళ్ల నెదుర్కొని, తొడల్ సరచి నన్నయభట్టే ఆంధ్ర శబ్ద చింతామణికి కర్తయని తమ రచనల ద్వారమున ఆంధ్ర భాషా పండితులు మనః కుహరములయందు శాశ్వతముగా నిల్పిన జగజెట్టివీరు.

## ఇతర రచనలు

ఈ క్రింది రచనలు లభ్యముకాలేదని కవి చరిత్రకారులందరు ముక్తకంఠముగా నంగీకరించిరి. 1. రంగకౌముది. (నాటక విధానము):—"కవి సమీహితరంగ కౌముదీ నామ నాటక విధాన ప్రతిష్ఠా ఘనుండ" అని రా. యా. పా. స్పష్టముగా చెప్పుటచే నిది నాటక లక్షణము మాత్రమేయని గ్రహింపదగును.

2. కార్తికేయాభ్యుదయము:— బాలసరస్వతీయమునందలి శివ సంబంధములైన కొన్ని పద్యములిందలివగునో! ఏమో ?

3. వామన పురాణము: - దీనిని పలువురాంధ్రీకరించిరి.

4. బాహటస్థానము.— ఇది ఆయుర్వేద గ్రంథము. బాల సరస్వతి వైద్యశాస్త్రమునందు నిష్ణాతుడని చెప్పుట కితని శిష్యు డైన చుండి లింగయయనువానిచే అష్టాంగ హృదయము నాంధ్రీక రింపజేయుంచుటయే నిదర్శనము. లింగయ "బాలసరస్వతీ కవి మహోపాధ్యాయ ప్రసాదసిద్ధ కవితా విలాసుడన"ని చెప్పెను. [10]

5. భ్రమరగీతలు :— బాలసరస్వతీయమున మాత్రమే పేర్కొనబడినది. భ్రమర గీతలన తంజావూరి విజయరాఘవ నాయకుడాంధ్రీకరించెను. గ్రంథ మలభ్యము.

6. భాషావివరణము :— దీనిని షడ్భాషావివరణమని చంద్రికా పరిణామము స్పష్టపరచినది. షడ్భాషలనగా మహారాష్ట్రీ, శౌరసేని, మాగధి, పైశాచి, చూళికా పైశాచి, అపభ్రంశములు. అప్పకవి సంస్కృతాంధ్రములను చేర్చి అష్ట భాషలని చెప్పెను (1.77). వాల్మీకి మహర్షి రచితములైన ప్రాకృత మూల సూత్రములకు బాలసరస్వతి సంస్కృతమున వివరణము వ్రాసెను.

## షడ్భాషా వివరణము

నేటివరకు బాలసరస్వతినిగూర్చి వ్రాసిన రచయితలందరును షడ్భాషావివరణమును నామమాత్రావశిష్టమనిరి.[11]

ఆంధ్రుల భాగ్యవశమువనో, భారతీయ ప్రాకృతభాషా పండిత మండలి అదృష్టముచేతనో నేడీగ్రంథము అడయారు (మద్రాసు) దివ్యజ్ఞాన సమాజమువారి హస్తలిఖితపుస్తక విభాగమున భద్రపరుప బడియున్నది. వారి వ్యాకరణ గ్రంథవివరణ పట్టికయందు నెం. 742గా నమోదు చేయబడినది.[12] వారిచ్చిన వివరణ మీ దిగువ యథాతథముగ నుద్ధరింపబడినది.

"నెం. 742. షడ్భాషావివరణము—బాలసరస్వతి. కాగితపు ప్రతి. 74 కాగితములు. అనగా 148 పుటలు. ఒక్కొక్క పుట యందు 14 పంక్తులు. లిపి దేవనాగరి. వ్రాత బాగున్నది. ప్రతి నిక్షేపముగ నున్నది. వాల్మీకి షడ్విధ ప్రాకృతసూత్రములకు వివరణము. పూర్వవృత్తికారులైన హేమచంద్ర, తివిక్రములు స్తుతింప బడిరి. రామచంద్రాశ్రముని సిద్ధాంత చంద్రికను బాలసరస్వతి తన వివరణమున నుపయోగించెను. సిద్ధాంత చంద్రిక సారస్వత సూత్రములపై వ్యాఖ్య."

ఈ గ్రంథమును నేనామూలచూడముగ చూడలేదు (12అ), గాని అడయారు వారిచ్చిన ఆద్యంతము లిందు పొందుపరచుచున్నాను. భాషావేదులు మన్నింతురు గాక!

## ఆరంభము

చతుర్ముఖ ముఖాంభోజ సుఖక్రీడిత రాగిణీ
వాణీ యమభిషేతేస్మ తస్మై వాల్మీకయే నమః॥

కవి సంజ్ఞాపురా యస్మా దజనిష్ట జగత్త్రయే
కావ్యాని యదుపజ్ఞాని తస్మై వాల్మీకయేనమః॥

వాల్మీకిం సూత్రకారంచ వృత్తికారం తివిక్రమమ్
వన్దా మహే మహాచార్యాన్ హేమచంద్రాది కానపి॥

తాతపాదం గురుందేవం తాన్మహాకవి నాయకాన్
కృష్ణదేవాన్ నమస్యామి బ్రహ్మవిద్యా గురూన్ సతామ్॥

యలకూచి కృష్ణదేవ ప్రథమసుతో భైరవస్యయః పౌత్రః
బాలసరస్వత్యార్యః షడ్భాషా వివరణం సమాతనుతే॥

ప్రాగర్వాగు పరిప్రభూత కవిరాడ్ బృందానుహార్యస్వవా
గ్జాలో బాలసరస్వతీ కవి మహోపాధ్యాయ భట్టారకః।
సంగృహ్య ప్రథమాగమాన సుగమాం స్త్రైవిక్రమాదీనిదం
బాలానుగ్రహ కామ్యయా రచయతి ప్రఖ్యాప్యతాం సజ్జనైః॥

సిద్ధిర్లోకాచ్చ। ప్రాకృతభాషా సిద్ధిఃలోకవ్యవహారాత్ జ్ఞేయా స్యాత్। చకారాల్లక్షణాచ్చ। పరస్మై పదాత్మనే పదనియమాధ్య భావాదిర్లోక వ్యవహారగమ్యః। త్రివిధాప్రాకృతభాషా—దేశ్యా, తద్భవా తత్సమాచేతి। తామ్రస్య తంబరః ఆమ్రస్య అంబర ఇత్యాదయో దేశ్యాః శబ్దాః। తత్సమా సంస్కృతసమా—అహో, హే, హి, అహ హేత్యాదయః। తద్భవా సంస్కృత జా। సాచ సకలభాషా నిదానాత్ సంస్కృతాత్ సిద్ధావస్థయా సాధ్యావస్థయాచజాయమానత్వాత్ సిద్ధా సాధ్యా చేతిద్వివిధా। తస్స్వరూపం యథాస్థానం ధర్మయిష్యామః। అనుక్తమన్యశబ్దాను శాసనవత్। అత్యాకాంక్షణీయం। యదనుక్తమపి పాణినీయ శాస్త్రానుసారేణ జ్ఞేయం స్యాత్। అత ఏవాత్రాపి ప్రత్యాహారాది వ్యవహారః। అత్రచత్వారింశ దక్షరాణ్యేవ వ్యవహార్యాణి। యథా ఏకారౌకార ఋ ౠ ఌవర్ణ శషక్షకారా నస్యుః।

## అంతిమ గ్రంథ భాగము

ప్రాకృతం షడ్విధం చాపి భారత్యా బాలభాషితమ్
భాషాణాం ప్రాకృతాదీనాం వాల్మీకి ర్మూల సూత్రకృత్॥

వినాభిజ్ఞాన మేతేషాం దుర్జ్ఞేయం నాటకాదికమ్
అనుగ్రహేణ బాలేషు సర్వం సంకుచితం మయా॥

నను ప్రాకృతభాషాను పాదేయా, అపభ్రంశత్వాత్ గావీ గోణ్యాది శబ్దవత్। ఉపాదానే మ్లేచ్ఛత్వ ప్రసఙ్గః। శిష్టానిబద్ధ విరల దేశ భాషాత్వం అపభ్రంశత్వమ్. హుమ్మతి రమ్మత్యాదీనం విరల దేశ భాషాత్వేఽపి శిష్టనిబద్ధత్వాన్నాప భ్రంశత్వమ్। నాట్యవిషయ ఝుణ్ణాకిణాది శబ్దానాం శిష్టానిబద్ధత్వేఽపి నాపభ్రంశత్వమ్। ప్రాకృతం త్వపభ్రంశః, అతోనగ్రాహ్యామితిచేన్న। భగవతా వాల్మీకినా నిబద్ధ లక్షణం సర్వదేశ ప్రసిద్ధ్యా మిశ్రకోపకారి ప్రాకృతం నాప భ్రంశః సంస్కృత తుల్యమేవ। అన్యథా నాటకేఽప్యప భ్రంశస్యా నుపాదేయత్వ ప్రసంఙ్గః।

## గద్య

ఇతి శ్రీ సకలసుకవి మహోపాధ్యాయ భట్టారక బాల సరస్వతీ కృతే షడ్భాషా వివరణే సర్వం సంపూర్ణమ్।

అప్పకవి (క్రీ. శ. 1656) 'షడ్భాషా చంద్రికయును, షడ్భాషా వివరణంబును, హేమచంద్రుని ఫక్కికయు, త్రివిక్రమ వృత్తియు' (1–5) బేర్కొనెను. అప్పకవి గోప్యముగా నుంచినను షడ్భాషా చంద్రికా, షడ్భాషా వివరణముల కర్తలు చెఱకూరి లక్ష్మీధరుడు, బాలసరస్వతియని మనమూహింపవచ్చును. ప్రాకృత వ్యాకరణ సూత్రములను దద్వృత్తులను నప్పకవి షడ్భాషాచంద్రికనుండి గ్రహించినట్లగుపించుచున్నను భాషా వివరణము ముద్రితమైనచో అప్పకవి యెవరి గ్రంథమునుండి తానెరువు తెచ్చుకొనెనో నిర్ధారింప వీలగును.[13]

# వాల్మీకి మహర్షి ప్రాకృత మూలసూత్రములు

''వాగ్దేవీ జననీ యేషాం వాల్మీకి ర్మూలసూత్రకృత్
భాషా పయోగా జ్ఞేయాస్తే షడ్భాషా చంద్రికాధ్వనా॥
(లక్ష్మీధరుని షడ్భాషాచంద్రిక — అవతారిక శ్లో॥15)

వాల్మీకిం సూత్రకారం చ వృత్తికారం త్రివిక్రమమ్
వన్దామహే మహాచార్యాన్ హేమచంద్రాది కానపి॥

ప్రాకృతం షడ్విధం చాపి భారత్యా బాలభాషితమ్
భాషాణాం ప్రాకృతాదీనాం వాల్మీకి ర్మూల సూత్రకృత్.

(బాలసరస్వతి — షడ్భాషావివరణమ్—అవతారిక. శ్లో. 3 మరియు గ్రంథాంతిమ శ్లోకము.)

ఈ విధముగా లక్ష్మీధరుడును, బాలసరస్వతియు తమ గ్రంథములందున్న మూల ప్రాకృత సూత్రములకు కర్త వాల్మీకి యని గట్టినమ్మకముతో చెప్పుచున్నారు. కాని వీరికంటె ముందుగా ప్రాకృత సూత్రములకు వృత్తులను వ్రాసిన హేమచంద్ర, త్రివిక్రమ, సింహరాజులుగాని, వీరి సమీపకాలమునకు, దేశమునకు చెందిన అప్పయ దీక్షితులవారుగాని వాల్మీకి మూలసూత్రకర్తయని చెప్ప లేదు.[14] దీక్షితులవారు త్రివిక్రమ, భోజ, హేమచంద్ర, వరరుచులతో బాటు లక్ష్మీధరునిగూడ పేర్కొనిరి. గాని మూలసూత్రకర్త విషయమున మౌనము వహించుటనుబట్టి చూడగా వారికీ సూత్ర కర్తృత్వము వాల్మీకి మహర్షి కంట గట్టుట కిష్టములేకనో, నిరాధారమని తోచుటవలననో వాల్మీకిని స్మరింపరైరి.

హేమచంద్రుడు తన వ్యాకరణమును 'స్వోపజ్ఞవృత్తి సహితమ్' అనియు, త్రివిక్రముడు 'నిజ సూత్ర మార్గమనుజిగమిషతామ్' అనియు వాకొనిరిగాని వాల్మీకి స్మరణను మాత్రము చేయరైరి.

అసలీవాదముయొక్క చరిత్ర కొంత అప్రస్తుతము గాదను కొందును. వాల్మీకి ప్రసక్తిని దెచ్చిపెట్టిన చెరకూరి లక్ష్మీధరుడు తెనుగువాడైనను నతనికి తెనుగుభాషా వాఙ్మయములతో నంతగా సంబంధము లేకపోవుటచే ఆంధ్ర విద్వాంసులు పట్టించుకొనలేదు. ప్రస్తుతము బాలసరస్వతికూడ వాల్మీకిని మూలసూత్రకర్తగా నమస్కరించుటచేత 'ఈ వాల్మీకి కల్పన'నుగూర్చి కొంత తెలుసు కొనుట యుక్తమనిపించుచున్నది.

1909లో హుల్ష్‌దొర సింహరాజు వాల్మీకి సూత్ర వృత్తిని ప్రచురించి సూత్రకర్త వాల్మీకి యనియే విశ్వసించెను.

1911లో విశాఖపట్టణ వాస్తవ్యులైన పరవస్తు భట్టనాథ స్వామిగారీ వాదమును ఖండించి త్రివిక్రముడే సూత్రసహిత వృత్తి కర్త యని ప్రతిపాదించిరి. (ఇండియన్ ఆంటిక్వెరీ—వాల్. XL పే. 219–233, ఆగస్టు సంచిక) 1916లో కె. పి. త్రివేది లక్ష్మీధరుని షడ్భాషాచంద్రిక కుపోద్ఘాతము వ్రాయుచు, లక్ష్మీధరుని వాక్యమాధారముగాగొని సూత్రకర్త వాల్మీకియేయని పునరుద్ఘాటించిరి. వారి వాదమున కుపబలకముగా శంభురహస్యమను నితిహాసమునుండి కొన్ని పంక్తులుదాహరించి, అందు ప్రాకృతవ్యాకర్త—రామాయణకర్త, అయిన వాల్మీకి మహర్షియని నిరూపించిరి.

1941 లో ప్రొఫెసరు ఏ.యన్.ఉపాధ్యాయిగారు ''వాల్మీకి సూత్రములు—అభూత కల్పన'' యను శీర్షికతో 'భారతీయ విద్య' (సం. 2, సంచిక 2, మే 1941, పుటలు 160 76) లో తమ వ్యాసమును ప్రకటించిరి. వాల్మీకి సూత్రకర్త యనుట వట్టి 'అభూతకల్పన'మని త్రోసిపుచ్చిరి.

1953 లో మైసూరు ప్రాచ్య పరిశోధన సంస్థ అప్పయ దీక్షితుని ప్రాకృత మణిదీపికను ప్రకటించినది. ఆ గ్రంథ సంపాదకులైన శ్రీ టి. శ్రీనివాస గోపాలాచార్యులు గ్రంథములో లేని వాల్మీకి ప్రసక్తిని తమ పీఠికలోనికిదెచ్చి రామాయణకర్త వాల్మీకియే సూత్రకర్తయని పురాణవాదమును పునరుజ్జీవింపజేసిరి.

1954 లో డాక్టరు పి. యల్. వైద్యగారు త్రివిక్రమ వ్యాకరణమును సుపరిష్కృత మొనర్చి వాల్మీకి వాదమును వారిట్లు ఖండించిరి:

"I feel further that the sutras in Hemachandra are his own as also in Trivikrama. None of them, at any rate Hemachandra can be accused of plagiarism of the so-called Valmiki Sutras." (Trivikrama's Prakrit Grammar, Sholarpur 1954. Pages XXIV.)

1956 లో ప్రొఫెసరు ఉపాధ్యాయిగారు తిరిగి యొకసారి ఈ అభూతకల్పనను ఖండించిరి. (Bharatiya Vidya Vol. 15 3, April 1956)

వారి సింహావలోకన వాక్యములు వినుడు.

"To conchide, the Valmiki Sutra is a myth and the fresh evidence brought forth by the editors of Prakrita manidipika is of no value at all. It is only a later tradition made popular by Lakshmidhara that Valmiki the author of Ramayana wrote a Prakrit Grammar and there is no evidence at all to show that Hemachandra and Trivikrama followed Valmiki Sutras' (Page 31)

ఉపాధ్యాయగారి వాక్యములు వాల్మీకి — మూలసూత్రకారుడని చెప్పిన మన బాలసరస్వతికిగూడ చెందునని వేరే చెప్పనక్కర లేదు. ఒక బాలసరస్వతికేయని చెప్పనేల 'ప్రాకృతే షడ్విధం చాపి వాల్మీకిం వా మహేశ్వరమ్' అని చెప్పిన అథర్వణునికిగాడ.

## బాలసరస్వతి లక్ష్మీధరుననుసరించుటకు కారణములు

ఇరువురును నాంధ్రదేశీయులే. సమీపకాలమువారే. బహుశః ఒకరినొకరు చూచుకొనియే యుందురు. లక్ష్మీధరుడు జయదేవుని ప్రసన్న రాఘవమునకు వ్యాఖ్య వ్రాసి సిద్ధిరాజు తిమ్మరాజు పేర తిమ్మభూపాలీయ నామముతో (ఆర్. నెం. 2338 కాగితపు ప్రతి) ప్రకటించినాడు. ఈ సిద్ధిరాజు తిమ్మరాజు తెనుగున పరమయోగి విలాస పద్య ప్రబంధకర్తయగుటయేకాక, కొండవీడు దుర్గమునకు విజయనగర సార్వభౌముడైన తిరుమలరాయల పక్షమున కార్యకర్తగా వ్యవహరించియున్నాడు. తిరుమలరాయల మేనల్లుడే తిమ్మరాజు క్రీ. శ. 1558 నుండి 1564 వరకును తిమ్మరాజు శాసనములు కొండవీటి పరిసర ప్రాంతములందు కన్పించుచున్నవి. లక్ష్మీధరుడు షడ్భాషాచంద్రికావతారికయందు

> అస్త్యంధ్రదేశే చరకూరి వంశః
> కృష్ణాతటే కాశ్యపగోత్ర రూఢం
> యో బహ్వృచా నాం బహుమాననీయో
> దత్తే సదా కీర్తి సువైజయంతీమ్॥.

అని చెప్పుకొనుటచే కృష్ణాతీరవాసియైన లక్ష్మీధరుడు క్రీ. శ. 1560 ప్రాంతమున ప్రసన్న రాఘవ వ్యాఖ్యనంకితమిచ్చి యుండును. షడ్భాషాచంద్రిక లక్ష్మీధరుని తొలికృతి. దీని తరువాత ప్రసన్న రాఘవ వ్యాఖ్య. ఈ రెండును మూడవ కృతియైన శ్రుతి రంజనియందు స్మరింపబడినవి. జయదేవుని గీత గోవిందమునకు వ్యాఖ్యయైన శ్రుతి రంజనికి తాళపత్ర ప్రతులలో కొన్నింట తిరుమల రాయలు కర్తగా చెప్పబడెను. బహుశః లక్ష్మీధరుడు తిరుమల రాయలపేర దీనిని రచియించెనేమో ? ఈ తిరుమల దేవరాయలు వసు చరిత్ర కృతిపతి తిరుమలరాయలే. సదాశివరాయలు క్రీ. శ. 1571 లో చనిపోగా తొంబదియేండ్ల వయసున పెనుగొండ సింహాసనమెక్కి 11 నెలల కాలము మాత్రమే రాజయోగమును పొందగలిగెను. లక్ష్మీధరుడప్పుడు పెనుగొండ యందుండెనేమో ! తిరుమలరాయల మరణానంతరము క్రీ.శ. 1572లో లక్ష్మీధరుడు దక్షిణదేశమునకు తరలి కృష్ణాశ్రమయోగివద్ద ఆశ్రమ స్వీకారము చేసి రామానందాశ్రమయోగియై మురారి కృత అనర్ఘరాఘవమునకు ఇష్టార్థకల్పవల్లియను వ్యాఖ్యను రచియించెను.

బాలసరస్వతి కాలము సూక్ష్మముగా నిర్ణయించుట కష్టము అయినను దీనికొక మార్గముగలదు అప్పకవి లెఖ్ఖప్రకారము ఆంధ్ర శబ్దచింతామణి మూలకృతి బాలసరస్వతికి 1608 కీలకలో లభించెను. క్రీ. శ. 1572 ప్రాంతముననున్న లక్ష్మీధరునిగూర్చి వినియో కనియో యుండును. అతని గ్రంథమైన షడ్భాషాచంద్రికను జూచియే తనుగూడ భాషావివరణమును వ్రాసి దేశభాషా వ్యాకరణము వ్రాయుటకు కావలసిన ప్రాకృత వ్యాకరణ పరిజ్ఞానమును, సూత్ర సంపాదనశక్తిని సంపాదించెను. ప్రచారమునకో ప్రమాణమునకో లక్ష్మీ

ధరుడు తన గ్రంథమందలి మూలసూత్రములు ఆదికవి వాల్మీకికి అంటగట్టెను. అది చూచి బాలసరస్వతి ఆంధ్రశబ్ద చింతామణిని ఆంధ్రుల ఆదికవియైన నన్నయ కంటగట్టెను. ఈనన్నయ 'యుగాది సంభవుండై మనిచన్న నన్నయ మహాకవి' యట. ఆంధ్రశబ్ద చింతామణీ మంత్రసిద్ధులగు అప్పకవ్యహోబలపతులు వాల్మీకినన్నయలను ప్రాకృతాంధ్ర వ్యాకరణసూత్ర నిర్మాతలుగా దేశమున వారి పేర్లను డవిణకొట్టి మ్రోగించిరి.

బాలసరస్వతి మంత్రవేత్త. దక్షిణ కాళికా మంత్రబలముచే 'ఆంధ్రశబ్ద చింతామణి'ని సమకూర్చి దానికొక లఘుటీక వ్రాసి అప్పకవి కవి ఇచ్చిన మతంగాచల విప్రుడీతడే. చరిత్రలో కాలు సేతులు లేని సారంగధరుడు సిద్ధుడై మతంగగిరికివచ్చి బాల సరస్వతులకు ఇవ్వగా నతడు దానికి 'తెనుఁగుఁడీక' చేసెనట. అతడు టీక యెన్నడొనరించెనో తెలియదు. కాని మతంగాచల విప్రుడు అప్పకవి ఇంటికివచ్చి టీకతోకూడిన ఆం. శ. చి. నిచ్చునని కలలోని శ్రీహరి వార్త. మతంగాచల విప్రుడెవడు ? బాలసరస్వతిగాక. "ఆమతంగ నగ నివాసి పుస్తకనికాయధరుండొకరుండు" అని బాల సరస్వతిపేరు చెప్పక 'నొకరుండ'ని బుకాయించినప్పటికి "రాజ నరేంద్రుని పట్టిదామొన్న నొసంగి విప్రునకు మూలము, అతండొన రించెఁడీక" (1–90) యని 49 పద్యాల తర్వాత పద్యములో బాలసరస్వతిగుట్టు బయటపడినదే. అప్పకవి అల్లిన అబద్ధపు కథ మతంగాచల విప్రుడను ప్రయోగముచేతనే బయటపడినది. అప్పకవి ఎంత ఛాందసుడో అంత అమాయకుడు. అప్పకవి ఇంటికి అర్ధరాత్రమునవచ్చి తలుపుతట్టి ఆం. శ. చి. నిచ్చినది బాలసరస్వతి యని స్పష్టము.

# BIBLIOGRAPHY


1 Descriptive and Trenniel catalogues of Government Oriental Manuscripts Library – Telugu (Madras)

2 Balasaraswatiyamu–Balasaraswati Vavilla(1963) Madras.

3 Reddi Sanchika – Andhra Historical Research Society. Rajahmundry (1947)

4 Saraswati Samrajyamu - Ayyanki Venkata Ramanayya Sanmana Sanchika. Vijayawada (1943)

5 Sataka Kavula charitra – Vanguri Subba Rao. Madras (1927)

6 Journal of Bhandarkar Oriental Research Institute, Poona.

7 Mallabhupaleeyamu – Balasaraswati Vavilla, Madras (1954)

8 Andhra Kavula charitra – Rao Bahadur Kandukuri Veeresalingam Pantulu.

| | | |
|---|---|---|
| Vol. I | – Revised Edition – | 1917 |
| II | — | 1898 |
| III | — | 1950 |

9 Hampi Ruins - A. H. Longhurst. (1933) Madras.

10 Astanga Hrideeya Tika–T.T.D. Press. Tirupati.

11 Sabdaratnakaram . B. Seetharama charyulu Madras (1969) Vols. I, 10

12 Andhra Kavi Tarangini – Chaganti Seshaiah Kapileswarapuram (1954)

13 Samagrandhra Sahityam – Arudra, Vol. 10, M. Seshachalam & Co. Madras (1966)

14 Andhra Samsthanamulu – Sahitya Poshana, Andhra University, Waltair (1969)

15 Vyasa Bharati II – Terala Satyanarayana Sarma, Nallagonda (1970)

16 Descriptive Catalogue of Sanskrit Manuscripts in the Adyar Library. Vol. IV, Grammar. Prosody. dexicography. Adyar. Madras (1947)

17 Ahobala Panditeeyam (Kavi Sirobhushanam) Prof. K. Lakshmi Ranjanam Ed. Chelamacherla Rangacharyulu, N. C. Venkatachary, Amaresam Rajeswara Sarma-Andhra Writers' Association, Hyd-7 (196 )

18 Prakrit Vyakarana – Hemachandracharya. Ed. Dr. P. L. Vaidya (1936)

19 Trivikrama's Prakrit Grammar – Ed. Dr. P. L. Vaidya (1954) Sholapur.

20 Prakrita Rupavatara - Simharaja. Ed. E. Hultze London (1909)

21 Prakritamanidipika–Appaya Dikshita. Oriental Research Institute, Mysore. Ed. T. Srinivasa Gopalacharya, Mysore (1953)

22 Indian Antiquary. Vol. XL. (August issue) (1911)

23 Sadbhashachandrika – Lakshmidhara, Ed. K.P. Trivedi, Bombay (1916)

24 Bharatiya Vidya, Vol. 2. No. 2. Bombay (May 1941) & Vol. 15. No. 3. (April 1956)

25a Prasanna Raghava Vakhya (Sanskrit)

b Sruti Ranjani. Commentary on Jayadeva Gitagovinda (Sanskrit)

c Ittardha kalpavalli - Commentary on Anargha Raghavam (Sanskrit)

d Trenniel catalogues of Sanskrit Manuscripts in G. O. M. L. Library, Madras.

26 Kavijana Mandanam - Adharvana Karikavali. Vavilla, Madras (1921)

27 Ramaneeyam, Balavyakarana Sameeskha - Duvvari Venkata Ramana Sastry, Visakha-patnam (1964)

28 Tenugu Vyakarana Vikasamu - Dr. Koddupalli Purushottam. 2 Vols. Guntur (1969)

29 Srimadramayanadbhutottarakandamu, Nandagiri Venkatappa Rao, Duggirala (1911)

30 Jagannadheeyamu - Siva Venkata Kavulu, Machilipatnam (1915)

31 Saraswata Sarvaswamu, Tanuku (1924)

32 Sangraha Andhra Vijnana Kosam. Vol. III, Vidyanagar, Hyd-7 (196 )

# అధోజ్ఞాపికలు

1 ప్రాచ్య లిఖిత పుస్తకశాల గ్రంథ వివరణ పట్టిక, సం. 5 (1935) డి.నెం. 1248, తాళపత్ర ప్రతి. 1963లో వావిళ్లవారు ప్రకటించిన బాలసరస్వతీయ ముద్రిత ప్రతి యందీ భాగములేదు. ఇది కళాప్రపూర్ణ వఝుల చిన సీతా రామశాస్త్రిగారు బహు ప్రతులు చూచి పరిష్కరించినది. వఝుల వారి పీఠిక తేదీ 30-4-1930. ఇందులోగూడ శ్రీ శాస్త్రిగారీ పేరుదాహరింపరైరి.

2 మంచాళ్ల శాసనము. రెడ్డిసంచిక–అనుబంధము (1947) (పుటలు 3, 9).

3 బాలసరస్వతి మహబూబు నగర ప్రాంతముల డని కొంద రందురు. తెలంగాణమున పాకనాటి రెడ్లు గలరుగాని పాక నాటి బ్రాహ్మణు లున్నట్లు నిదర్శనములు లేవు. దేశాటము చేయుచు బాలసరస్వతి పరిటాలకు వచ్చియుండును. ఈ శాఖా భేదములను గూర్చి చూ. (బ్రాహ్మణ శాఖా భేదములు– కొన్ని నాడులు. మల్లంపల్లి సోమశేఖరశర్మ : సరస్వతీ సామ్రాజ్యము, అయ్యంకి వేంకట రమణయ్యగారి సన్మాన సంచిక. 1943. (పుటలు 467–482.)

4 అవతారికా పద్యములు 7, 8, 9.

5 శతక కవుల చరిత్ర (పుట 199) (1927).

5 a మహా సౌరాభిధాన విద్యా దక్షిణా కాళికా పరా।
చింతామణి మహావిద్యా ద్వాదశీ పరికీర్తితా॥

దక్షిణా కాళికా విద్యా పురశ్చరణతః పరం।
అనాచార దేక రాత్రా సిద్ధిదా చిర సాధనాత్॥

మంత్ర మహా సామ్రాజ్యములో 12 మహా మంత్రములు చెప్పబడినవని, వానిలో దక్షిణ కాళికా విద్య శీఘ్ర ఫలసిద్ధిని కలిగించును. (పరాశర సంహితలోని శ్లోకములుగా మంత్ర శాస్త్ర ప్రవీణ, హనుమదుపాసక శిష్టా చంద్రమౌళి శాస్త్రిగా రుదాహరించినవి) చూ. హనుమద్విలాసము ప్రథమ భాగము. పుటలు 38–39(1949) విజయవాడ ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల.

6 Antiquity of the Title Mahamahopadhyaya – D. B. Diskalkar. Annals of Bhandarkar Oriental Research Institute. Vol. XXXIV (1953) Pages 175-176. భాషావేత్తలయిన ప్రొఫెసర్ ద్రోణప్పగారు బాలసరస్వతికున్న మహోపాధ్యాయ బిరుదుతో తృప్తిపడక 'మహా మహోపాధ్యాయ' బిరుదము నిచ్చినారు. (చూ. ఆంధ్ర సంస్థానములు-సాహిత్య పోషణము' పుటలు 167, 552)

7 ప్రాచ్య లిఖిత పుస్తకశాల వివరణ పట్టిక.సం.2 (1921) డి. నెం. 509 క్రింద వర్ణితమైన భాగము.

7 అ ఇతని గ్రంథములలో యాదవ రాఘవ పాండవీయము ముద్రి తమయ్యుఁ బ్రఖ్యాతి చెందదయ్యె – (మానవల్లి కవిగారు).

8 చూ. నిరోష్ఠ్య శుద్ధాంధ్ర సీతాకల్యాణ పీఠిక. (కైౘ. క్యా. సం. 4· ప్రా. వి. పు. వివరణ పట్టిక 687. ఆర్. సంఖ్య 672.

రాఘవ యాదవ పాండవీయము, ప్రా. లి. పు. వివరణ పట్టిక. డి. నెం. 687.

8 అ 1954 వావిళ్ళ ముద్రణః టీకా సమేతము.

8ఆ ప్రథమ ముద్రణగా కాకతి పబ్లికేషన్సు (3-4-424/5, నారాయణగూడ, హైదరాబాదు) వారు సు (కవి) జన విధేయుడైన శ్రీనీలాజంగారు కవిశ్రేష్ఠునిచే పీఠికవ్రాయించి 77లో ప్రచురించిరి. అందున్న 60 పుటల పీఠిక రచించు టకు పీఠికాకర్త పడ్డ మనోక్లేశమునకు పరిశోధకులు కంట తడిపెట్టి సానుభూతి చూపవలసినదే.

9 ఈ మతంగగిరి నెల్లూరి మండలము లోనిదని వీరేశలింగం పంతులుగారు వ్రాయుట 'ప్రమాదో ధీమతా మపి' యను కొని సవరించుకొనునది. (ఆ. క. చ. ప్రథమ భాగము.

పుట. 45, 1917) ఇది హంపీ విజయనగరములోనిది. దీని ఛాయా చిత్రమును ఎ. హెచ్. లాంగ్‌హర్‌స్ట్ తన హంపీ రూయిన్స్ (1933) అను గ్రంథమున నిచ్చి యున్నాడు. దీనినానుకొనియే విద్యానగర బజారు వీథి గలదు.

10 ట్రై. క్యాటలాగు నెం. ఆర్. 940 (c) (1949). దీనిని తిరుమల తిరుపతి దేవస్థానము వారు వారి పరిశోధన సంస్థ పక్షమున ముద్రించిరి.

11 1898, కందుకూరి వీరేశలింగం పంతులు, ఆంధ్ర కవుల చరిత్ర ద్వితీయ భాగము.

1927, వంగూరి సుబ్బారావు, శతకకవుల చరిత్ర, పుటలు 196-199.

1930, వఝుల చిన సీతారామశాస్త్రిగారు, బాలసరస్వతీయ పీఠిక.

1954, చాగంటి శేషయ్య, ఆంధ్ర కవి తరంగిణి — 10, పుటలు 135-154.

1966, ఆరుద్ర, సమగ్రాంధ్ర సాహిత్యం—10, పుటలు 28–42.

1969, తూమాటి దోణప్ప, ఆంధ్ర సంస్థానములు — సాహిత్య పోషణ, పుట 552.

1970, తేరాల సత్యనారాయణశర్మ, వ్యాస భారతి II, పుటలు 77–93.

12 **Descriptive catalogue of Sanskrit Manuscripts in the Adyar Library. Vol IV. Pages 295-296 (1947).**

12అ చూచిన మానవల్లి కవిగారు 'భాషా వివరణము ప్రాకృత సూత్రములకు వివరణ గ్రంథము' సంస్కృత భాషలో రచింపఁబడియె. దీనిం జదువ గల్గితిమి. కాని యజ్వల దేవ, త్రివిక్రమ కృష్ణలీలా శుకాదుల సర్వంకష పాండిత్య మిందు గానరాదు. (ఎలకూచి వేంకట కృష్ణరాయ కవి వ్యాసములో).

13 అప్పకత్యాదుల గ్రంథములలోని వాల్మీకి సూత్రములు (?) స్వస్వరూపమును గోల్పోయి యున్నవని మన్మిత్రులును వైయాకరణులును నగు డా. అమరేశం రాజేశ్వరశర్మగారు అహోబల పండితీయమునకు దాము వ్రాసిన 'ఉపక్రమణిక' (34 పుట) యందు హెచ్చరించియున్నారు. అహో. పండితీయమున వారు వాల్మీకి సూత్రములను సుస్వరూపము లతో ముద్రించియున్నారు.

14 చూ. 1 హేమచంద్రుని — ప్రాకృత వ్యాకరణము — డా. పి. యల్. వైద్య (1936).

2 త్రివిక్రముని — ప్రాకృత వ్యాకరణము — డా. పి. యల్. వైద్య (1954).

3 సింహరాజు—ప్రాకృత రూపావతార — ఇ.హూల్ష్ (1909).

4 అప్పయ దీక్షిత-ప్రాకృత మణిదీపిక—టి. శ్రీని వాస గోపాలాచార్య (1953)

15 ఈ కృష్ణాశ్రమ యోగి పుంగవు నొద్దనే కృష్ణ కర్ణామృత కర్త వెలగపూడి వెంగయామాత్యుడు గూడ శిష్యుడుగా చేరి యున్నట్లు ఏతత్ కర్ణామృత చరమ పద్యములు చెప్పు చున్నవి.

[ఈ వ్యాసమును ద్వితీంత్రిణి సీతారామకవి వ్యాసములో చేర్చి శారదామంజీర రజతోత్సవ వ్యాస సంపుటికి పంపగా నేతత్ సంపాదకులును, మన్మిత్రులు, సుప్రసిద్ధ పండితులునైన డా. అమరేశం రాజేశ్వర్‌గారు స్థలాభావముచే నాకిది తిరిగి పంపిరి. అయినను నేనిచ్చిన షడ్భాషా వివరణమును గూర్చిన విశేషాంశమును శారదా మంజీరములోని వారి వ్యాసములో (పుట 118) దయతో పేర్కొనిరి. వారికి కృతజ్ఞుడను.]



# రావో వసంతమా!

## శ్రీ మేకా సుధాకరరావు

హేమంత శిశిరాల నోసరిల్లిన మనసు
వాసంతు రాకకై వేయి కన్నులు తెరచి
రేయి రేయంతాను వేచుంది, వెర్రిగా.
చీల్చి చెండాడేటి చలిగాడ్పులను తడిసి
జడిసింది, అలసింది సొలసిపోయింది !
ఆలోచనా ద్విపటి అంతటా కప్పుకొని —

రొదలేవీ లేకుండా మదితలుపులు చేరవేసి
యెదశయ్యను ఒరిగింది
లోలోపల తూగాడే ఊహలలో
సిద్ధార్థికి వీడ్కోలూ
రౌద్రికి ఘనస్వాగతమూ —

ఆవహించెను నిదుర
అలలు అలలుగ కలలు ...
అనంతంగ సాగుతూన్న
ఆరాకుల చక్రంలో
శిశిరమింక తొలగిపోయి
వసంత మేతెంచునంచు
ఎదురుచూచు నాత్రతతో ...
కాని...ఏలొ రాకున్నది !
చెలరేగిన దెదలోపల
ఏదో ఒక సంఘర్షణ —
... ... ... ...

ఎందరెందరి శ్రమజీవుల బ్రతుకులు
బండలై ఋతుధర్మానికే విరుద్ధంగా
తొలగని శిశిరంలో మలిగిపోతున్నాయో;
కడలేని కష్టాల చక్రాలకింద నలిగిపోతున్నాయో
అంతుదొరకడంలేదు
ఆకాశంలోని చుక్కల లెక్కలా !

* * *

"మేమంత శిశిరాలు దేశాంతరమ్మేగె
రావో వసంతమా ! రారమ్ము వేవేగ"
అనుచు కోయిల పిలుపు ...

పుడమి పులకించింది
తరులన్ని విరులాయె
లతలు ప్రసవించేను
ప్రకృతి పురిటిల్లుగా !

* * *

"కావాలి, రావాలి అందరకు ఆమని
అనుభవం అందరూ పంచుకోవాలి
ఆనందమందరూ పెంచుకోవాలి..."
ఏవేవో ఆకాంక్ష లాశయాలెగసె.

* * *

వివిధవర్ణాల వెలసి నయనాలకు విందుగూర్చే;
వివిధ సుగంధాలు కురిసి, నాసికకు పసందుకూర్చే
వసంత వనంలా వెలుగొందే మనోద్యానవనంలో
—ఉగాది పచ్చడిలో కుదురుకున్న రుచులవలె —
అంతరాంతరాలలో అణగివున్న ఊహలు
కొల్లలు కొల్లలుగా వెల్లివిరుస్తున్నాయి
అనుపల్లవిగా పల్లవిస్తున్నాయి
చరణాలు చరణాలుగా సురభిళిస్తున్నాయి !

* * *

ఆలోచనల నాగళ్లు దుక్కుచేసిన
ఆకాంక్షాక్షేత్రంలో
ఆశయాల విత్తనాలు నాటుతూన్న
మనసు నిద్రలేని కనులు
బద్ధకంగా విరుచుకుని తెరుచుకున్నాయి —

పత్రాల పంచలలోనూ
పొదల యెదలలోనూ
తపోముద్రలో మునిగివున్న చీకట్లు
ఉదయార్కుని కిరణాలలో అంతర్లీనమై పోతున్నాయి
జీవిత సరోవరంలో నిదురిస్తున్న

జనాల కనుదమ్మలు వికసిస్తూ
జగాన్నదే మేలుకొలుపుతున్నాయి !

మేల్కొన్న మనసు మిన్నువైపు చూచింది —
ఆదిత్యుడు తన కిరణ కోటితో
హారతి పడుతున్నాడు, భూమాతకు.

మోసులెత్తిన ఆశయాల
నాహ్లాదంగా చూస్తూ
తూర్పు ముఖాన వెలసిన
అరుణరాగ కుంకుమ
ఇత ఫాలన దిద్దుకుంది, మనసు.

సూర్యదేవుని శోచిస్సుల
జీవంపోసుకుని విరిసిన
ఆశయాల అక్షర సరసిజాలు —
శిశిర విశీర్ణ జీవితాల గాథలు
రూపొందిన కవితా శువుల జాలు

యెదనూ కుదుపసాగింది
మేల్కొలుపు గంటగా మ్రోగింది !

... ... ... ... ...
... ... ... ... ...

సామాన్యుల కడలేని కడగండ్ల శిశిరం తొలగి
సమ సమాజోద్యానవనం శోభాయమానమై
ఆనందోత్సవం గావించుకొనే
శుభతరుణాన
సుస్వాగతం పాడాలని, వసంతం
మునివాకిట
అశాంతంగా వేచిఉంది —

"రావో వసంతమా
రారమ్మ వేవేగ —"
మరి మరీ పిలచేను
మావిపై కోయిల ! !

శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం

# రాత

''శకుని అన్నప్పుడు కత్తిర శ వ్రాయాలి. మీరేమే స వ్రాశారు. అక్షరాలు కుదురుగాలేవు. ప్చ్...ఇలా అయితే లాభంలేదు. దస్తూరి బాగుండాలి రాత బాగుంటేనే గీత బాగుంటుంది. రోజూ కాపీ వ్రాయండి. పట్టి పట్టి అందంగా రాయండి.'' లోపలికివెళ్లబోతున్నవాడినల్లా వరండాలోనే ఆగిపోయాను. మావాడి ఆగడానికి మండుతూంది. పెంకితనమూ, పెద్దా చిన్నా తేడా లేకపోవడమూ కాకపోతే మా రాజాగాడి దుడుకుతన మేమిటి? మాస్టారిని పట్టుకుని ఎంతెంత మాటలంటున్నాడు! ... అసలు-మాస్టారిననాలి. రాజాకి ఎందుకంత చనువివ్వాలాయన? భయభక్తులూ గౌరవమూ లేకుండా తయారయ్యాడు కుర్రవాడు. శిష్యుడేమో గురువుగారికి పాఠాలు చెబుతున్నాడు! ఆటలాడుకుంటున్నారా? ఆటే అయినా యీ వరసేమీ బాగులేదు నాకు.

గురువు శిష్యుడాయె, శిష్యుండు గురువాయె అన్నది ఊరికే అనుకుందుకే కాని అది నిజమయితే ఎబ్బెట్టుగా ఉంటుంది. చైల్డీజ్ ద ఫాదరాఫ్‌మాన్ వంటివి కేవలం కవి చమత్కృతులుగానే మిగలాలి. ఓడలు బళ్ళూ, బళ్ళు ఓడలూ కానూ కావు. అయినా ప్రమాదమూ లేదు. కాని—గురు శిష్యులు తారుమారు కావడం — కనీసం హాస్యానికే అయినా—చూడ వేడుకగా ఉండదు.

రాజాని పిలిచి నాలుగంటిద్దామా అన్నంత కోపం వొస్తూంది నాకు. వేలెడు లేదు వెధవ! మాస్టారికి పాఠాలు చెబుతున్నాడు!

కొన్ని నెలల క్రిందటి ముచ్చట ... మాస్టారు మా పక్కవాటాలో దిగారు. చూడగానే గౌరవించాలనిపించే ఆకృతి మాస్టారిది. నాలుగు రోజుల పరిచయాన్ని పురస్కరించుకుని మెల్లగా ఆయన్నొక కోరిక కోరాను.

''మాస్టారూ!... మా రాజా మీకు పరిచయం అయ్యే ఉంటాడు. మీరీ యింట్లోదిగి వారమౌతూంది కనుక వాడెంత రాలుగాయో రణపెంకో మీరు గ్రహించే ఉంటారు. మూడోక్లాసు వెలిగిస్తున్నాడు. చదువువరకూ ఫర్లేదు ఎటొచ్చీ రాత దగ్గరే వచ్చిన చిక్కంతా. వాడి రాతచూస్తే డాక్టరుగా తప్ప మరెందుకూ పనికి రాకుండా పోతాడేమో అని నాకు భయంగా ఉంది. వాడి అక్షరాలు వాడికే బోధపడవు. స్థిరం తక్కువ పిల్లవాడు. మీరు రోజూ ఓ గంట వాడిని కుదురుగా కూర్చోబెట్టి ప్రయివేటు చెబుతే...'' అర్థించాను, ఆయన నాకంటె చిన్నవాడే అయినా.

''దానికేం, నాకూ కాలక్షేపమౌతుంది. బడినుంచి వచ్చి చేసే పనేముంది కనక?'' అంటూ అనుగ్రహించారు. ఇక మొదలయ్యాయి వారి పాట్లు.

''అక్షరాలు పొందికగా స్పష్టంగా ఉండాలి. రాత బాగుంటే గీత బాగుంటుంది. ఇలా కొక్కిరి గీతల్లాకాదు. సుందరంగా వ్రాయాలి. కాపీ—పట్టి పట్టి వ్రాయాలి. అక్షరాలు గీతలమధ్యనే ఉండాలి. దాటకూడదు. వాలిపోకూడదు.''

మాస్టారి రాత—ముత్యాల కోవే ఆయనలాగే ఆయన వ్రాత కూడా అందంగా హుందాగా ఉంటుంది. ఆరోగ్యంగా నిండుగా ఉంటుంది. ఆయనకు వ్యసనం లేనట్టే ఆయన వ్రాతకు వంక ఉండదు. ద్విత్వాక్షరాలు కూడా చక్కగా తీర్చి దిద్దినట్లు వ్రాస్తారు. ఆయన అక్షరాలు ఆయన శీలానికి ప్రతిరూపాలు. వాటికి సౌందర్యముంది, సౌశీల్యముంది. వ్యసనపరుల్లా అవి చిత్తమొచ్చినట్లు పరుగెత్తవు. క్రమశిక్షణాయుతమయిన ఆయన జీవన విధానానికి ప్రతి రూపం ఆయన చేతివ్రాత.

యథా గురుః తథా శిష్యః మా వాడి రాత బాగుపడుతుందని నాకు గట్టి నమ్మిక ఏర్పడసాగింది. ఇవతల వరండాలో నేను నా పని చేసుకుంటున్నా మాస్టారి మాటలు స్పష్టంగా నా చెవిన పడుతూనే ఉండేవి.

''మూర్ఖుడు వ్రాసేటప్పుడు ర కింద ఒత్తు ఖ ఉండాలి. దస్తూరి బాగుంటే మంచి మార్కులు వస్తాయి. రాత—గీత దాటకూడదు ..'' ఆయన సహనం అపరిమితం. పదే పదే నోరు నొచ్చేలా చెప్పేవారు అక్షరాలు పొందికగా రాయమని. ఐతే—రాజాని కొట్టేవారు కారు. ఆయనకి వాడంటే ముద్దు. పిల్లలులేని మాస్టారు రాజాని స్వంత పిల్లడికంటె ప్రేమగా చూస్తూ పాఠాలు చెప్పేవారు. మా అబ్బాయి గురించి యిక దిగులు పడనవసరం లేదనిపించేది వారి తీరు చూస్తూంటే. మావాడి దస్తూరి గొంగళి పురుగు దశనుంచి సీతాకోక చిలుకగా పరిణతి చెందబోతున్న తరుణంలో పై ఆఫీసునుంచి నాకా కాగితం వొచ్చింది. కాగితమేమిటి, హుకుం! శ్రీమతిని పిలిచి చావు కబురు చల్లగా చెప్పసాగాను. ''ఉద్యోగికి దూరభూమి లేదన్నాడు సుమతి. దూరని భూమికూడా ఉండకూడదంటూ ప్రభుత్వంవారు నన్ను మన్య ప్రాంతానికి బదిలీ చేసారు. అది—కాకులు దూరని కారడివే. ఐతే—యీ వనవాసం ఆరునెలలకు మించదు. ఇక్కడ వ్రాసిన ఉత్తరం అక్కడకు చేరాలంటే వారం రోజులు పడుతుందట. ఆరునెలలే కనుక ఎలాగో ముక్కు మూసుకుని గడిపేసి వచ్చేస్తాను. వచ్చి వెళ్లాలంటే చచ్చుగా వారం పడుతుంది. శలవు దొరకదు. కనుక నన్ను అపార్థం చేసుకోకు. మన దాంపత్యం విడని బంధం. అన్నట్లు అక్కడ గ్రాసమే దొరుకుతుందట. పచ్చళ్ళూ పొడులూ చేసిస్తే పట్టుకు పోతాను. పిల్లలు జాగ్రత్త. నువ్వు దిగులుపడకు.''

కన్నీళ్లతో సాగనంపింది శ్రీమతి.

ఐదు నెలల అరణ్యవాసంతో సరిపోగా—యిదుగో వచ్చాను—యింటికి.

వచ్చేసరికి—యిదుగో—యిదీ ఎదురయిన దృశ్యం, ఆదిలోనే హంసపాదులా.

పిల్లలు నేను లేనప్పుడెలా పెరిగారో యిక, అడగనక్కర్లేదు.

''ఎంతసేపయింది వచ్చి? పిలవరేం ?''

''నీ కొడుకు ఆగడం చూసి మురిసి—మైమరచిపోయాను.''

ఆమె కూడా కిటికీలోంచి చూసింది నాతోపాటు.

''ఏమిటి మాస్టారూ యీ రాత !... అబ్బ!... చెప్పి చెప్పి నా నోరు పడిపోతూంది కానీ మీచేత సరిగ్గా రాయించలేకపోతున్నాను—''

ఓరి వెధవా! . ఎంత పొగరెక్కిపోయావు...!

''వాడి నిటు పిలువ్...'' కోపంగా చూశాను.

''ముందు మీరు లోపలికి పదండి. కాఫీ తాగి స్థిమిత పడుదురు గాని'' చేయి పట్టుకుని లోపలికి నడిపించింది శ్రీమతి.

''కాఫీ తాగి గెడ్డం చేసుకోండి. శుభ్రంగా నూనె రాసి తలంటుతాను. అప్పటిక్కానీ మీరు మనిషి కారు'' అంటూ నా వొంటికి మానె పట్టించింది. ఆ కార్యక్రమం త్వరగా తెమిలేది కాదని— ''ఏమిటో చెబుతానన్నావు?'' కదిపాను.

''మీరు వెళ్లిన పదిరోజులకే—కూరలకని వెళ్లిన మాస్టారు రోడ్డుమీద హటాత్తుగా నురగలు క్రక్కుతూ పడిపోయారు. ఎవరో చూసి డాక్టరు దగ్గరకు తీసుకువెళ్తే ఆయనో యింజక్షనిచ్చి వెంటనే కె. జి. హెచ్.కి తీసుకుపొమ్మన్నారుట. అక్కడ నెల్లాళ్లున్నారు. అదృష్టంకొద్దీ మనిషి మిగిలారు. అదేదో పక్షవాతంలాటి వ్యాధిట. ప్రాణమయితే దక్కింది కాని ఆ మనిషికి మాట పోయింది. చలనం మందగించింది. జ్ఞాపకశక్తి పోయింది. మందులు వాడుతూ, ఎక్సరసయిజు చేస్తూంటే మెల్లిగా మునపటి మనిషి కావొచ్చునట. ఆయన్ని చూస్తేమాత్రం ఆ ఆశ కలిగింది కాదు. చిన్నపిల్లడినిమల్లె లేవదియ్యాలి. తినిపించాలి. నడిపించాలి. మాటలు చెప్పాలి...అవన్నీ చేస్తూంటే కొంచెంమార్పు కనిపిస్తూ వచ్చింది. రాజానిమాత్రం మాస్టారు త్వరగానే గుర్తించారు. ఇప్పుడు - రాజా ఆయనకి చదువు చెబుతున్నాడు...''

''ఆ!'' ఆశ్చర్యపోయాను. ''మాస్టారికిలా జరిగితే నాకు వ్రాయలేదేం?''

''ఏం శుభవార్తని మీకు రాసేదీ?''

''ఆయన పూర్వపు మనిషౌతారా?'' ఆత్రంగా అడిగాను.

''ఆశపడొచ్చు. ఇప్పుడిప్పుడు మనుషులని గుర్తుపడుతున్నారు. చదువు వొస్తూంది. కర్రపట్టుకుని నడవగలుగుతున్నారు. ఇవన్నీ శుభ సూచకాలే. అదృష్టం బాగుంటే...ఆవిడ గీత బాగుంటే... మళ్లీ ఆయన మనిషి కావొచ్చు...''

జాలివేసింది. హృదయం ఆర్ద్రమైంది.

ఎంత అశాశ్వతమయినా జీవితం యింత ఆశ్చర్యమయమా ! వ్యసనమనేదే లేని మాస్టారి కిటువంటి వ్యాధి రావడమేమిటి? పిల్లలకు పాఠాలు చెప్పి వాళ్ల రాతలు సరిదిద్దవలసిన మాస్టారు- వాళ్ల దగ్గరే చదువూ రాతా నేర్చుకోవలసి రావడం - ఎంత ఘోరం ! ఆరోగ్యానికి ప్రతిరూపంగా ఉండే ఆయన—కుంటుతూ నడవవలసి రావడం...!

విస్మయమయాలూ విషాదభరితాలూ అయిన ఊహల పరంపరలు.

''స్నానం అయ్యాక ఓసారి ఆయన్ని చూసి- పలకరించిరండి ''

''అలాగే'' నీరసంగా అన్నాను.

''మీరెవరో వారి కొకటి రెండుసార్లు చెప్పండి. లేకపోతే గుర్తుపట్టలేకపోవచ్చు.''

''ఊ...''

''రాజాని బట్టి సులువుగానే గుర్తుపడతారేమో లెండి.''

''వొద్దు. వాడిని ఆ సమయాని కక్కడ ఉండనివ్వకు. ఇంట్లోకి రమ్మను.''

తెల్లబోతూ చూసింది శ్రీమతి.

ఆమె కర్థంకాదు—నా బాధ.



డాక్టర్ వి. వి. యల్. నరసింహారావు

# తెలుగులో విమర్శ సాహిత్యపు తీరుతెన్నులు

## [స్థూల పరామర్శ]

ఎవరైనా నన్ను "ఓ పద్యం వ్రాస్తావా?" అంటే "సరే" నంటాను. "ఓ గేయం పాడగలవా?" అంటే "పాడలేక పోయినా పలకగల"నంటాను. "ఓ కథ చెబుతావా?" అంటే "సరే, అలాగే"నంటాను. "ఓ నాటకం వ్రాసి ఆడరాదా?" అంటే "అందుకూ సిద్ధమే" నంటాను. కాని ఓ మంచి సాహిత్య రచనను విమర్శించమంటే మాత్రం తటపటాయిస్తాను; భయం కూడా వేస్తుంది. ఎందుకంటే — మంచి రచనను ముందు చక్కగా అర్థం చేసుకోవాలి. అర్థంచేసుకున్న 'మంచి'ని జాగ్రత్తగా ఎదుటివాడికి అర్థమయ్యేట్లు చెప్పాలి. ఆ గండం గడిస్తే — ఒకోసారి అందంగా ఉండే ఆ 'మంచి' అనే పదార్థాన్ని అందంగా కూడా చెప్పాలి. అట్లా చెప్పడానికి — నావరకు నాకు — అర్థం చేసుకోగల సంస్కారం, మంచిని గుర్తించే మంచితనం, అందాన్ని పసిపట్టగల రక్తీ, పసిపట్టిన అందాన్ని అందంగా చెప్పగల శక్తీ యుక్తీ — ఇన్ని సమకూడితేకాని నేనొక విమర్శకుణ్ణి కాలేను. పైగా విమర్శకుడనేవాడికి స్వపరభేదాలకు చోటులేని ఆర్జవంకూడా ఆవశ్యకమే.

## వ్యాఖ్యానం విమర్శకాదు

"సరే బాగానే ఉంది; నువ్వు చెప్పిన సంస్కారం, సౌజన్యం, శక్తియుక్తులూ మొదలైనవన్నీ ఇవ్వాళ మన మొగంనుంచే ఊడి పడలేదు; వెనుకటి విమర్శకుల్లో మాత్రం ఇవి లేవా?" అని ప్రశ్నించే వారుండవచ్చు. "వెనుకటి విమర్శకులంటే ?" మరో ఎదురు ప్రశ్న. వాల్మీకి రామాయణ రహస్యాలను వెలికి తీసిన గోవిందరాజున్నాడు. వ్యాసభారతాన్ని కరతలామలకం చేసిన నీలకంఠ దీక్షితుడున్నాడు. సంస్కృత భాగవతాన్ని చక్కగా వివరించి చెప్పిన శ్రీధరుడున్నాడు. నైషదీయ చరితాన్ని నాకు కూడా అర్థమయ్యేట్లు చెప్పిన నారాయణుడున్నాడు ఇక కాళిదాసత్రయానికి మల్లినాథుడుండనే ఉన్నాడు. అయితే వీరందర్నీ వ్యాఖ్యాతలనవచ్చు గాని విమర్శకు లనవచ్చునా ?— వీలులేదు. ఎందువల్ల ?— వీరంతా తమ్ము తాము వ్యాఖ్యాతలుగా చెప్పుకున్నారే కాని విమర్శకులుగా చెప్పుకోలేదు. మల్లినాథుడు కుండ బద్దలు కొట్టినట్లు "వ్యాఖ్యాయతే మయా" అనికూడా అన్నాడు. ఆ మాట అంటూ ఆయన తన వ్యాఖ్యాన పద్ధతినికూడా వివరించి చెప్పాడు.

"ఇహాన్వయముఖేనైవ సర్వం వ్యాఖ్యాయతే మయా
నాఽమూలం లిఖ్యతే కించి న్నాఽనపేక్షిత ముచ్యతే"

అన్వయముఖంగా చేసే ఈ వ్యాఖ్యానంలో అమూలకమైందీ, అనపేక్షితమైందీ కించిత్తు ఉండదట. 'అమూలం' అంటే అప్రమాణమైందని కూడా అర్థం. అన్వయముఖంగా జరిగే వ్యాఖ్యలో పదపరిచ్ఛేదం, విగ్రహ వాక్య వివరణ, ఆక్షేప సమాధానాలు మాత్రమేకాక గుణాలంకారచ్ఛందో వ్యాకరణాది విశేషాలు కూడా వివరించబడతాయి. అన్నిటికీ ఆయా శాస్త్ర ప్రమాణాలు ఉటంకించబడతాయి. అవసరమైనచోట శ్రుతి స్మృతి పురాణేతిహాసాలుకూడా ప్రస్తావించబడతాయి.

తెనుగులో ఈ మార్గాన్ని అనుసరించిన సోమనాథుని వసుచరిత్ర వివరణం కాని, వేదంవారి శృంగారనైషధ — ఆముక్తమాల్యదా వివరణలుకాని కేవలం వ్యాఖ్యాలనదగినవేకాని విమర్శ లనదగినవి కావు.

## విమర్శ అంటే....

వ్యాఖ్యాన గ్రంథాలు విమర్శ గ్రంథాలు కావన్నాం. పోనీ, లక్షణ గ్రంథాలున్నాయి. కావ్యతత్త్వ పరామర్శ చేసిన ఆలంకారిక శాస్త్ర గ్రంథాలున్నాయి. అవి విమర్శ గ్రంథాల కోవకు వస్తాయా?— 'రావు' అనే సమాధానం. పూర్వ గ్రంథాలను లక్ష్యంగా గ్రహించి రచించిన ఈ లక్షణ గ్రంథాలు కావ్యలక్షణం 'ఇలాగే ఉండాలి' అని శాసనం చేసిన సందర్భాలే ఎక్కువ. పైగా ఆ అనుశాసనాన్ని మక్కికి మక్కిగా అనుసరించాలన్న దృష్టితో వ్రాయబడిన గ్రంథాలు కావ్యాత్మమీదకంటే కావ్య శరీరంమీదనే ఎక్కువ శ్రద్ధ చూపటం జరిగింది. అందువల్ల కృతక స్వరూపంతో కూడిన రచనలు అధిక సంఖ్యలో వెలువడటమూ జరిగింది. మన ప్రబంధాల్లోని అష్టాదశ వర్ణనలూ, శబ్దార్థాలంకారాలూ కావ్య సౌందర్యాన్ని భంజించిన సందర్భాలు ఇట్లా సంప్రాప్తమైనవే. ఇటువంటి ప్రమాదం ముందెప్పుడైనా వస్తుందేమోనన్న జాగ్రత్తతోనే ధ్వనికారుడు గొప్ప హెచ్చరిక చేశాడు.

"శబ్దార్థ శాసనజ్ఞాన మాత్రేణైవ న విద్యతే
వేద్యతే సతు కావ్యార్థ తత్త్వజ్ఞైరేవ కేవలమ్"

ఈ దృష్టితో కావ్యార్థతత్త్వాన్ని ఆవిష్కరించటానికి చేసిన ప్రయత్నం సకృత్తుగా కాని కనపడదు. ప్రాచీన గ్రంథాలను గూర్చి ఆధునికులు సాగించిన విమర్శల్లోకూడా శబ్ద సాధుత్వ – అసాధుత్వ నిర్ణయంగూర్చి తల పగులకొట్టుకున్నంతగా రసౌచిత్య ధ్వని విశేషాలనుగూర్చి ఆలోచించటం జరుగలేదు. ఆధునిక యుగానికి సంబంధించిన వీరేశలింగంగారుకూడా సుశబ్దాపశబ్ద చర్చను తెగిందాకా లాగినవారిలో ఒకరే.

కనుక కేవలం ప్రతి పదార్థ తాత్పర్యాలు, రసాలంకారచ్ఛందో వ్యాకరణాది విశేషాలూ కాక – కథా గమనం, పాత్ర చిత్రణం, తత్త్వ నిరూపణం, కవి మనస్తత్త్వ వివేచన, సమకాలీన పరిస్థితుల ప్రభావం మొదలైన అంశాలను పరిశీలిస్తూ సాగిన విమర్శ పద్ధతి నవీనమైన కొత్తబాణీ అనే ఒప్పుకోవాలి. ఈ బాణీలో సాగిన సమీక్షాపద్ధతే విమర్శగా తెలుగులో రూపు దిద్దుకొన్నది. కావ్యాత్మ సౌందర్యాన్నీ, కావ్యతత్త్వాన్నీ సమగ్రంగా ప్రకాశింపజేసే సమీక్షలే నిజమైన విమర్శలు.

## కొత్త బాణీ

ఈ విధమైన కొత్తబాణీకి శ్రీకారం చుట్టినవారిలో కట్టమంచివారికి సముచితమైన స్థానం ఉన్నది. కవిత్వతత్త్వాన్ని వివరిస్తూ కావ్యగత పాత్ర చిత్రణాదులు పరామర్శిస్తూ అనేక గ్రంథాల్లో ఒకానొక గ్రంథం ఏ స్థానాన్ని పొందుతుందో నిర్ధరించే ప్రయత్నం ఆయన చేశారు. ఆధునిక విమర్శ ఆ పద్ధతిలోనే క్రమంగా రేకు విప్పుకోవటం జరిగింది. భరతుని నాట్యశాస్త్రం మొదలుకొని తెలుగులో అప్పకవీయం వరకుగల శాస్త్ర లక్షణ గ్రంథాలు సాహిత్య గ్రంథాలను కొలిచే కొలబద్దలుగా ఉపయోగపడటం వెనుకబట్టింది.

ఈ దశలోనే ఆంగ్లసాహిత్య విమర్శ పద్ధతుల్లో తెలుగు విమర్శ వాఙ్మయం విస్తరించ మొదలుపెట్టింది. సంప్రదాయ లక్షణ గ్రంథాలను ఆపోశనం పట్టిన ఉద్దండ పండితులుకూడా ఈ కొత్త బాణీకి స్వాగతం పలికి కొత్త పాతలను అందంగా మేళవిస్తూ విమర్శ మార్గాలు అన్వేషించ మొదలుపెట్టారు. రాళ్లపల్లి, వేటూరి, పింగళి, కాటూరి, ముట్నూరి, దువ్వూరి మొదలయిన అనేకుల కొత్త తరహా విమర్శలే ఇందుకు నిదర్శనం.

దువ్వూరివారు వ్రాసిన "అల్లసాని పెద్దన : సమకాలీన భావప్రతినిధి" అనే విమర్శవ్యాసం సంప్రదాయధోరణిలో ఆలోచించే వారికి విపరీతంగాకూడా కనిపించవచ్చు. అందుకు కారణం ఆ వ్యాసంలో ఆయన అవలంబించిన విమర్శ పద్ధతి అతినవ్యమైంది కావటమే. మను చరిత్రలో వ్యక్తమౌతున్న దృక్పథంగూర్చి సుదర్శనంగారు వ్రాసిన వ్యాసం నవ్యధోరణిలో సాగినా కావ్యతత్త్వ నిరూపణం దగ్గరకు వచ్చేసరికి అందులోని ప్రధానరసం గూర్చి ప్రస్తావించక తప్పలేదు. ఔచిత్యము, రసము, ధ్వని మొదలైనవి ఊతకర్రలవంటివే ననిపించినా – తడుముకుంటూ నడిచే స్థితిలో అవి ఉపయోగకరమైన సాధనాలనే ఒప్పుకోకతప్పదు. విశ్వనాథవారి 'అల్లసానివాని అల్లిక జిగిబిగి' కావ్యంలోని కథా సంవిధాన శిల్పాన్ని అన్వేషించటమే కాక, పెద్దన మత దృక్పథాన్నికూడా స్పృశించింది. ఇట్లా ఎన్నింటినో ఉదాహరించవచ్చు. (అన్నింటినీ ఉదాహరించటం ఈ వ్యాస లక్ష్యమూ కాదు.)

నిజానికి సాహిత్యంలో మతం ఒక ముఖ్య భాగంగా అల్లుకుపోయి సాహిత్యంనుంచీ దాన్ని వేరుచేయటం అసాధ్యమైపోయింది. అయితే గడుసువాడైన రచయిత మత దృక్పథాన్ని కావ్యంలో రంగరించి ఆ దృక్పథాన్ని సూచనగా మాత్రమే అందిస్తాడు. సాహిత్య విమర్శకుడు అటువంటి గ్రంథాలను విమర్శించేటప్పుడు ఆ దృక్పథాన్ని కూడా పరామర్శించినప్పుడే విమర్శ సమగ్రమౌతుంది. "మతము : సాహిత్యము" అనే అంశాల్ని పరామర్శిస్తూ టి. యస్. ఇలియట్ కూడా ఈ అభిప్రాయాన్నే స్పష్టం చేశాడు. అంటే కేవలం సాహిత్య ప్రమాణాలనుబట్టే కాకుండా నైతిక ఆధ్యాత్మిక ప్రమాణాలను బట్టికూడా విమర్శ సాగించవలసిన ఆవశ్యకం ఉన్నదని ఆయన గుర్తించాడు.

## సత్యాన్వేషణ

సత్యాన్వేషణ దృష్టితో చూస్తే – మతాలన్నీ ప్రారంభ దశలో సంకీర్ణమైన మానవ జీవితానికి మార్గదర్శకాలుగా నిలిచినవే. మానవస్వభావంలో సహనం లోపించినప్పుడు సంకుచితదృష్టి ఏర్పడి అన్యమత నిరసనం, అసూయాద్వేషాలు, ఆవేశకావేషాలు ప్రబలి అవి సాహిత్యంలోకూడా చోటు చేసుకున్నవి. అటువంటి సందర్భాల్లోనే సాహిత్యం విశ్వజనీనతకు దూరం కావటం జరిగింది. ఈ కోవకు చెందిన సాహిత్యాన్ని పరామర్శించేటప్పుడు విమర్శకుడు మరింత కనువిప్పు కలిగి సత్యాన్వేషణ చేసి పాఠకలోకానికి కనువిప్పు కలిగించాలి. అంటే సమాజంలో తానూ ఒక సభ్యుడే అయిన విమర్శకుడు సమాజస్థాయికి ఒక మెట్టు పైగా నిలిచి సత్యాన్వేషణ చెయ్యవలసిన అవసరం ఉన్నదన్నమాట. అందుకే విమర్శకుని బాధ్యత ఒక దశలో ఏకపక్షావలంబి అయిన న్యాయవాది స్థాయిని మిగిలి ప్రధాన న్యాయమూర్తి స్థానం ఆక్రమించుకోవలసిన అవసరం కలుగుతున్నది. ఈ కారణంవల్లనే విమర్శకుని పని అసిధారావ్రతం అవుతున్నది.

మానవ జీవితంమీద మతము, నీతి, రాజకీయాలు, సాంఘిక సమస్యలు, ఆర్థిక సమస్యలు మొదలైన వెన్నో తమ తమ ప్రభావాన్ని చూపుతున్నాయి. తానూ ఒక మానవుడే అయిన రచయిత ఆయా ప్రభావాలకు లొంగి రచన చెయ్యటం అసహజమేమీకాదు. అయితే సమస్యలు నినాదాల స్థాయికి దిగజారినప్పుడే రచనలో శిల్ప మర్యాద లోపిస్తున్నది. ఇక్కడే రచయితకు ఎంతో సంయమం, శిల్ప దృష్టి ఆవశ్యకం. మనదేశంలో స్వాతంత్ర్యోద్యమం ప్రారంభమైన దశలో కవులు కూడా తమ రచనల్లో స్వాతంత్ర్య యోధులుగా దర్శనమిచ్చారు. అదే విధంగా ఆంధ్రరాష్ట్ర ఉద్యమం, చైనా దండయాత్ర, బంగ్లాదేశ్ విభజన మొదలైన అంశాలు కవిత్వంలోకి ఎగ్రబాకక తప్పలేదు. అయితే ఆ రచనల్లో కవిత్వంగా చెప్పదగిన సరుకు పరిమితంగానే మిగిలింది. మిగిలిన కొద్దిపాటి కవిత్వాన్ని ఇది అచ్చమైన కవిత్వం అని చెప్పటానికి విమర్శకునికి

ఆయా ఉద్యమాలతో సానుభూతి మాత్రమే కాక రచనల్లో గల సంవిధాన కౌశలాన్నీ, శిల్ప మర్యాదనూ పసిపట్టగల నేర్పు కావాలి.

## విశాల దృష్టి

ఇంగ్లీషులోని రొమాంటిక్ కవుల ప్రభావానికి లోగిన కొందరు తెలుగు కవుల రచనలు కాని, మార్క్స్ సిద్ధాంతాల వల్ల ప్రభావితులైన అభ్యుదయ కవుల రచనలు కాని, ఇటీవలి విప్లవ కవుల రచనలు కానీ పరిశీలించేటప్పుడు విమర్శకుడు ప్రప్రథమంగా ఆ రచనలతో సానుభూతి పొంది ఆ దశ గడచి అవి సమాజానికి ఎంతవరకు మేలు చేశాయన్నది తరువాత పరామర్శించాలి. ఆయా సిద్ధాంతాలతో తనకు వ్యక్తిగతంగా రాజీపడే దృష్టి లేకపోవచ్చు. అయినా వైయక్తిక భావనా పరిధిని దాటి సామాజిక దృష్టితో రచనలను పరిశీలించే విశాలదృష్టి అవసరం. ఈ దృష్టి కొరవడినప్పుడే విమర్శ సంకుచితమైపోయే ప్రమాదం ఏర్పడుతున్నది.

ప్రాచీన కవులు తమ కావ్యాల్లో ప్రధానంగా పురుషార్థ దృష్టిని ప్రపంచించటానికి ప్రయత్నించి ఉండవచ్చు. అదేవిధంగా ఆధునిక కవులు సమకాలీన సమాజాన్ని ప్రతిబింబించే రచనలు అధికంగా చేసి ఉండవచ్చు. సమకాలీన జీవితంలో సాహిత్యంతో పాటు ఆధునిక శాస్త్రవిజ్ఞానం కూడా చోటుచేసుకున్నది. సాహిత్యం ప్రధానంగా మనస్సుకు సంబంధించింది కావటం వల్ల మనోవిజ్ఞాన శాస్త్రం సాహిత్యం మీద ఎక్కువ ప్రభావం చూపసాగింది. ఈ కారణం వల్లనే పాశ్చాత్య రచనల్లో — ముఖ్యంగా ఆధునిక కథలు, నవలలు మొదలైన వాటిలో 'బిహేవియరిజం', 'సైకోఎనాలిసిస్', 'ఈడిపస్ కాంప్లెక్స్', 'ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్' మొదలైన మనస్తత్త్వ శాస్త్రవిషయాలు అతి మాత్రంగా చోటుచేసుకున్నై. ఆ రచనల ప్రభావం సోకిన తెలుగు రచనలు నేటి సాహిత్యంలో జీవితాన్ని నూతన దృక్పథంతో అన్వేషించిన మాట వాస్తవమే. మనస్తత్త్వ శాస్త్రజ్ఞుల పరిశోధనలు పరిమితమైన దేశపాత్రలకు మాత్రమే సంబంధించినవి కాక మానవ మనస్సును సర్వసాధారణ దృష్టితో పరిశీలించి విశ్లేషణ చేసి చూచినవి కనుక అవి సార్వ దేశికంగా సార్వజనీనంగా అన్వయించుకోదగినవే. అయితే శాస్త్ర పరిశోధన ఫలితాలను సాహిత్యంలోకి దించి మానవ జీవిత చిత్రణ చెయ్యటంలోనే ఉన్నది చిక్కు. సాహిత్యంలో శాస్త్రదృష్టి ముదిరినా, శాస్త్రంలో సాహిత్య దృష్టి ముదిరినా రెండూ ఉభయ భ్రష్టమయ్యే ప్రమాదం ఉన్నది. పద్య ఛ్ఛందస్సులో వ్రాయబడిన ఆయుర్వేదశాస్త్రాన్ని కాని—ఆ మాటకు వస్తే — ఛందో బద్ధంగా ఉన్న అలంకార శాస్త్రాన్ని కాని కావ్య సాహిత్యంలో జమ కట్టలేము కదా! అదే విధంగా మనస్తత్త్వ శాస్త్ర విషయాలు ముడిసరకుగా దిగుమతైన సాహిత్య రచనలు కూడా సాహిత్యంగా పిలువబడే యోగ్యతలేనివే అవుతాయి.

ఈ ప్రమాదానికి వెలియైన సాహిత్యమే ఆధునిక సాహిత్యంలో సజీవంగా నిలిచే యోగ్యత సంపాదించుకోగలదు. అసలీ ప్రమాదాన్ని వచన కవితలు వ్రాసిన ఆధునిక కవులకంటే ముందు కథలు,నవలలు వ్రాసిన రచయితలే గుర్తించారనవచ్చు. ఈ గుర్తింపు కారణంగానే 'గాలివాన' మొదలైన కథానికలు; 'అల్పజీవి', 'అసమర్థుని జీవయాత్ర', 'చివరకు మిగిలేది', 'సంసార వృక్షం' మొదలైన నవలలు తెలుగులో గణనీయములైన రచనలైనాయి.

ఈ కోవకు చెందిన సాహిత్యాన్ని విమర్శించేటప్పుడు విమర్శకునికి మనోవైజ్ఞానిక శాస్త్ర విషయాలతోపాటు ఆధునికమైన సామాజిక జీవిత సమస్యలూ, ఆ సమస్యలతో సతమతమయ్యే అల్ప జీవులతో సానుభూతి—ఉంటేకాని సమీక్ష అనిపించుకోగల సద్విమర్శ వెలువడదు.

## విమర్శకుని బాధ్యత

ఇంతకూ చెప్పవచ్చిం దేమిటంటే — 'సాహిత్య రచనను సమీక్షచేసే విమర్శకుని బాధ్యత రచయిత బాధ్యతకంటే గురుతరమైం'దనే. సమీక్ష అనేసరికి పత్రికాముఖంగా వెలువడే సాహిత్య సమీక్షలూ గ్రంథ విమర్శలూ ప్రస్తావించక తప్పదు. ప్రస్తుత కాలపు ప్రచార సాధనాల్లో పత్రికలు ప్రబలమైనవి కనుక, పత్రికలు గ్రంథ సమీక్షలకు సముచితమైన స్థానం ఇస్తున్నాయి కనుక రచయితలు తమ రచనలమీద పత్రికా సమీక్షలు రావాలని ఎదురు చూడటం సహజమే. పలువురు పత్రికా సమీక్షకులు రచనల్లోని గుణాన్ని గుర్తిస్తూ అవగుణాల్ని వేలెత్తి చూపటమూ జరుగుతున్నది. ఇది మెచ్చతగిందే. కొన్ని సందర్భాల్లో గుణాన్ని అతి మాత్రంగా ప్రస్తుతించటం, అవగుణాన్ని అసలు ప్రస్తావించక పోవటమూ జరుగుతున్నది. మరికొన్ని సందర్భాల్లో గుణాన్ని అసలు గుర్తించకపోవటమూ,అవగుణాలనుమాత్రమే పైకెత్తిచూపటమూ జరుగుతున్నది. ఇక్కడ సమీక్షకుల వైయక్తికమైన అభిరుచులు మాత్రమే ప్రాధాన్యం వహిస్తున్నాయన్నమాట. సమీక్షకుడు ఒక గ్రంథాన్ని విమర్శించ పూనుకున్నప్పుడు ముందు తనకా గ్రంథాన్ని విమర్శించే అధికారం ఉన్నదా లేదా అనే అంతర్విమర్శ చేసుకోవాలి. విషయం బుద్ధికెక్కక, గ్రంథం విసుగుపుట్టిస్తుందనే ధోరణిలో విమర్శ వెలువడరాదు. దోషాలు సప్రమాణంగా ఎత్తిచూపడాన్ని ఎప్పుడూ హర్షించవలసిందే.

అంతేకాదు; రచయితకూ పాఠకుడికీ మధ్యవర్తిగా నిలిచి ఇరువురికీ మార్గోపదేశం చెయ్యవలసినవాడుకూడా విమర్శకుడే. అతని రంగస్థలం పత్రిక అయినా, రేడియో అయినా, కేవలం గ్రంథపీఠిక అయినా చేసే విమర్శ 'తాంబోలం ఇచ్చేశా' నన్న తంతుగా జరుగకూడదు. విమర్శ సావధానంగా చదివిన పాఠకుడికి పఠనానంతరం గ్రంథమే మనస్సులో మెదిలేట్లుండాలి కాని — గ్రంథం గుర్తుకేరాక, విమర్శకుడు మాత్రమే కొట్టవచ్చినట్లు కనపడరాదు.

విమర్శ వేదంలా ప్రభుసమ్మితం అనుకోరాదు. కనుక అనుశాసనం చేసే ధోరణి పనికిరాదు. కావ్యంలా కేవలం కాంతా సమ్మితమూ కానక్కర్లేదు. కనుక పఠితను పరవశింప చెయ్యాలనే ప్రయత్నమూ అనవసరమే. విమర్శ, పురాణం కాకపోయినా మిత్ర సమ్మితంగా ఉండటంలో దోషంలేదు. దోషం లేకపోవటమే కాదు; క్షేమంకూడాను. స్వీయానుభూతిని చక్కగా ఆవిష్కరించిన రచయితతో విమర్శకుడికి సానుభూతి ఏర్పడితేతప్ప సద్విమర్శ వెలువడదు. సానుభూతి మాత్రమే చాలదు; మరోమెట్టు పైకెక్కి న్యాయ నిర్ణయం చెయ్యవలసిన అవసరంకూడా ఉన్నది. కనుక విమర్శకుడికి సౌందర్యాన్వేషణతోపాటు సత్యాన్వేషణకూడా అవశ్య కర్తవ్యమౌతున్నది. ఈ అన్వేషణ విమర్శకుడి సంస్కారం మీద ఆధారపడి ఉంటుంది కనుక ఏ ఒక్క రచనమీదా ఏ ఒక్క విమర్శా తుది తీర్పు కావటానికి వీలులేదు. ఋజుదృష్టితో అన్వేషణ సాగినంతకాలం నూతన విమర్శకు అవకాశం ఉండనే ఉంటుంది.

# మంగళాశంసనము

## శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

వచ్చితివె! రౌద్రి! యరువది వత్సరమ్మ
లయ్యె మానేల యడుగిడితమ్మ మరల!
పేరు మాత్రమ్మ చెవులకు భీకరమ్మ
నీదు గుండియ మృదు నవనీత మేమొ!!

మృదుల వాసంత నవపరీమిళదనంత
సౌరభోన్నతి నవ్యాంధ్రజగము వెలుగ
నీవు వనదేవతవుంబోలె నిజ ముగాది!
నింపితివి కాంతి పేద గుండియల నేడు!!

నీవు వచ్చెదవని రమణీయమై ప్ర
వాళ దీప మ్మల నిడె లతా లలనలు
నీవు వచ్చెదవని కమనీయరాగ
విభ్రమముంజూపె కోకిలపేరటాండ్రు!!

ప్రతి ఉగాదికి స్వాగతపత్రమిచ్చి
సరస సంభావనలుంజేసి మురియుటెల్ల
మాకు వార్షికమయ్యె! సంవత్సరాది!
ఆశలూనితి మెప్పటి యట్టులిపుడు!!

వినతి చేకొన్ని నవ్యాంధ్ర వీధులందు
ప్రచుర చైతన్య కేతన పంక్తి నెగుర
నిమ్మ! నీ పాలనమున ధర్మమ్మ - శాంతి
జోడు చక్రాలుగా కదలాడనిమ్మ!!

మహిత పూర్వాంధ్ర శౌర్య సంపత్తి దీక్ష
విశ్వశాంతికి పాదులు వేయుశక్తి
మరల నవ్యాంధ్ర జగమున మా యెడంద
లందు వెల్గింపరమ్మ! యుగాది! రౌద్రి!!

మా తెలుగుతల్లి పాదపద్మమ్మలందు
మధురగీతాలు పాడి సమ్మదముంగొనెడు
అభినవోత్సాహభావమ్మ లందుకొనగ
మాయెడందల చైతన్య మధువులిమ్మ!!

మొక్కవోనట్టి దీక్షకు మూలశక్తి
చెక్కుచెదరని భక్తికి సిద్ధఫలము
గా వెలుంగుచునుండి కృపావిశేష
మృదుకటాక్షల పాలింపుమీ!! యుగాది!!

సమత మమతలు సర్వాంధ్ర బనుల హృదయ
సీమలోం గాపురముసేయ — చీకుచింత
లేని సుఖమయ జీవనమూనునట్లు
చూడు మా రౌద్రి!! నవ యశశ్శోభం గనుమ!!

ప్రకటమౌ రుద్ర సంబంధ భావమునకు
చెందెనీపేరు! భయమింక చెందనేల!!
సర్వమంగళావిభుడు నీ సరసనుండి
సర్వమును మంగళంబులు జరుపు మాకు!!

శ్రీ బులుసు వేంకట రమణయ్య

# నాటి విజయనగర సంస్థానం

**ఈ** శతాబ్దంలోని సగం కాలంవరకూ మన దేశంలోని వివిధ రాష్ట్రాలలో జమీందారీలు ఉండేవి. అవి సంస్థానాలని ప్రసిద్ధి పొందాయి. సంస్థానాధిపతులు విద్యాశాలలను స్థాపించి, కళలను పోషించి, పండితులను, కవులను సత్కరించి, అమూల్యాలైన పెక్కు గ్రంథాలను ముద్రింపించి బహుముఖాల తమ ఔదార్యాన్ని వెల్లడించారు. మనకు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత జమీందారీలు రద్దు కావడంతో సంస్థానాలు కూలిపోయాయి. సంస్థానాధిపతులు నిస్పృహులై తాము స్థాపించిన విద్యా సంస్థలను ప్రభుత్వానికి అప్పగించవలసిన స్థితి యేర్పడింది. ఇక పండితపోషణ, కవిసమ్మానం, కృతి స్వీకరణల సంగతి వేరే చెప్పనక్కర్లేదు. కొన్ని సంస్థానాలలో — శిథిలమైపోతున్న భవనాలను చూస్తూఉంటే మనస్సుకు ఎంతో బాధ అనిపిస్తుంది. ఈ తరంవారికి అప్పటి సంస్థానాలు చేసిన సేవ తెలియదు. ఆ సంస్థానాల చరిత్రలుకూడా లేవు. ఎప్పుడో ముద్రితాలయిన కొన్ని సంస్థానాల చరిత్రలు ఇప్పుడు లభ్యం కావు. అప్పటి చరిత్రలను ఎరిగినవారుకూడా చాలా తక్కువగానే ఉన్నారు. వారితరం దాటిపోతే — ఆమీద సంస్థానాలను గురించి తెలుసుకొనుటకు అవకాశమేలేకుండా పోతుంది. అందువల్ల నాకు కొంత పరిచయం ఉన్న విజయనగర సంస్థానాన్ని గురించి. తెలిసిన విషయాన్ని ఈ వ్యాసంలో వివరిస్తున్నాను.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని సంస్థానాలలో విజయనగర సంస్థానమే చాలా ముఖ్యమైనది. పిఠాపురం, బొబ్బిలి, వెంకటగిరి, గద్వాల, వనపర్తి, జటప్రోలు మొదలైన సంస్థానాలు దాని తర్వాత చెప్పదగినవే!

15వ శతాబ్దం నడుమ నుంచి 16వ శతాబ్దం మధ్యవరకూ హంపీ విజయనగరం ఎట్టి ప్రసిద్ధిని పొందినదో, 19వ శతాబ్ది నడుమ నుంచీ 20వ శతాబ్ది మధ్యవరకూ విజయనగర సంస్థానం అట్టి యశస్సును సంపాదించింది. శ్రీకృష్ణదేవరాయల వారు ఆంధ్ర భోజుడని విఖ్యాతి పొందినట్లే విజయనగర సంస్థానాధిపతి ఆనంద గజపతి ప్రభువు అభినవ భోజుడని పేరు గడించాడు.

ఆనంద గజపతి ప్రభువు పితామహులైన నారాయణ గజపతి రాజుగారు అప్పటి రాజకీయ పరిస్థితులను బట్టి కాశీలోనే స్థిరనివాసం ఏర్పాటు చేసుకోగా, ఆయన కుమారులు విజయరామ గజపతిరాజుగారు ప్రభుత్వంవారి సలహాపయి చాలా చిన్నవయస్సులోనే విజయనగరానికి వచ్చారు. ఆయనకు పరిపాలనా సామర్థ్యం కలిగే వరకూ, అప్పుడు దేశాన్ని పాలిస్తూ ఉన్న విదేశీయ ప్రభుత్వమే సంస్థాన వ్యవహారాలను చూస్తూ ఉండినది. అధికారం చేతిలోకి వచ్చిన తర్వాత విజయరామ గజపతిరాజుగారు విద్యాభివృద్ధికి ఎంతో కృషి చేశారు. విద్వత్కవులను పోషించడమే కాక ఎన్నో దాన ధర్మాలు చేశారు.

విజయనగర ప్రభువులు మొదటినుంచీ ఉదార స్వభావులు. స్వయంగా పండితులు. గ్రంథాలను కృతి పొందడమే కాకుండా స్వయంగా గ్రంథాలు రచించిన ప్రతిభావంతులు. ఆ వంశ పరంపరలో వచ్చిన విజయరామ గజపతి ప్రభువు ఘనకార్యాలు చెయ్యడంలో ఆశ్చర్యంలేదు.

విజయరామ గజపతిరాజుగారు విద్యాప్రియులు. ఆంగ్ల పాఠశాలను, వేదసంస్కృత పాఠశాలను, బాలికా పాఠశాలను ఆయన స్థాపించారు నూటముప్ఫయి, నూట నలభై ఏళ్లక్రిందట స్త్రీలకు విద్య నేర్పడానికి ప్రతికూల వాతావరణ పరిస్థితులలో బాలికా పాఠశాలను స్థాపించడం ప్రశంసనీయం. అప్పటి ఆంగ్లపాఠశాల మరి కొద్ది కాలంలోనే ఫస్ట్ గ్రేడ్ కాలేజీ అయింది. సంస్కృత పాఠశాల దేశమంతటా ప్రఖ్యాతిగాంచిన సంస్కృత కళాశాలగా తయారయింది. వీరు విజయనగరంలోనే కాకుండా మద్రాసులోను, కాశీలోనూ కూడా బాలికా పాఠశాలలను నెలకొల్పారు. దూరప్రాంతాలలో విద్యను అభ్యసిస్తూ ఉన్న విద్యార్థులకు స్కాలర్ షిప్పులు యిచ్చి ప్రోత్సహించారు. కాశీలో టౌన్ హాలును నిర్మించారు. అలహాబాదులో ఒక లైబ్రరీని, కాశీలో ఒక ధర్మవైద్యశాలను ఏర్పాటు చేశారు. మద్రాసులో మౌంట్‌రోడ్డులో రౌండ్ ఠాణావద్దను, లండన్‌లోని హైడ్ పార్కులోను జలయంత్రాలను నెలకొలిపారు.

ఈ ప్రభువు తమ రాజధానిని ఎన్నో విధాల అభివృద్ధి పరిచారు. మ్యునిసిపాలిటీలు లేని ఆ కాలంలో ఈయన విజయనగరంలో మ్యునిసిపాలిటీని ఏర్పరచి పట్టణానికి కావలసిన సౌకర్యాలు కలిగించారు. ''ప్రిన్స్ ఆఫ్ వేల్సు'' పేరున పెద్ద మార్కెట్ నిర్మించి వర్తకానికీ, వస్త్ర వ్యాపారానికీ సౌకర్యాలు కలిగించారు. తమ రాజధానినుండి నాలుపైపుల ఉన్న పట్టణాలకు రస్తాలు వేయించారు. ఆ రస్తాలు రాకపోకలకు, వ్యాపారానికీ ఎంతో సదుపాయంగా ఉండినవి.

వీరు స్థాపించిన విద్యాలయాలలోని విద్వాంసులే కాకుండా వీరి ఆస్థానంలో సుప్రసిద్ధులైన విద్వత్కవులుండేవారు. వారిలో ముడుంబై నరసింహస్వామిగారు సుప్రసిద్ధులు. బహుగ్రంథకర్తలు. ఆయన స్వయంగా శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల అనే ప్రెస్సును స్థాపించి తమ గ్రంథాలను అచ్చు వేసేవారు. శ్రీపాద చలమయ్యగారు, మండ కామేశ్వరశాస్త్రిగారు మున్నగువారు ఇతర విద్వత్కవులు. చలమయ్యగారు 'రామకృష్ణోపాఖ్యాన' కర్తలు. కామేశ్వర శాస్త్రిగారు మహారాజావారి కోరికపై కూర్మపురాణాన్ని ఆంధ్రీక

రించి ఆయనకు అంకితమిచ్చారు. మార్కండేయ పురాణాన్ని తెలిగించి మహారాజుగారి దేవేరి శ్రీమతి అలక రాజేశ్వరీదేవికి అంకితం చేశారు.

తండ్రిగారి అనంతరం సంస్థానాధిపత్యం వహించిన ఆనంద గజపతి ప్రభువు గొప్ప ప్రతిభాశాలి. కళాపోషకుడు, విద్వత్పక్షపాతి, సౌందర్యశాలి. తెల్లదొరలు ఈయనను "ప్రిన్స్ చార్మింగ్" అని ప్రశంసించేవారు. ఈయనకు విద్యాసక్తి ఎక్కువ. ఆస్థాన విద్వాంసులైన భాగవతుల హరిశాస్త్రిగారివద్దను, మైసూరు భీమాచార్యులు గారి వద్దను ఈయన సంస్కృతం నేర్చుకుని వ్యాకరణాది శాస్త్రాలలో కూడా పాండిత్యం సంపాదించారు. లింగం లక్ష్మాజీ పండితులు వీరి ఆంగ్ల భాషా గురువులు. ఈ ప్రభువు సంస్కృతాంధ్రాంగ్లాలతోపాటు గ్రీక్, లాటిన్, అరబిక్, పర్షియన్ భాషలను కూడా నేర్చుకున్నారు. సంగీతంలోనూ మంచి ప్రవేశం వారికి ఉన్నది. రాయలవారి సభలో అష్టదిగ్గజాలు ఉన్నట్లే ఈయన సభలో కూడా దిగ్దంతులవంటి పండితులు ఉండేవారు. వారిలో ముదుంబై నరసింహాచార్యస్వామిగారు, కొల్లూరు కామశాస్త్రిగారు, మండ కామేశ్వరశాస్త్రిగారు, వారి కుమారులు లక్ష్మీకామశాస్త్రిగారు, మైసూరు భీమాచార్యులుగారు, ముదుంబై వరాహస్వామిగారు, పేరి కాశీనాథశాస్త్రిగారు ముఖ్యులు. సంగీత విద్వాంసులు ఆదిభట్ల నారాయణదాసుగారు, గురాచారి వెంకటరమణదాసుగారు.

ఆనందగజపతి ప్రభువునకు సంస్థాన వ్యవహారాలు చూసుకునే అవసరం లేకుండా—ఆయనకు విశ్వాసపాత్రులైన దివాన్ జగన్నాథరాజుగారు ఆ కార్యభారాన్ని తామే నిర్వహించేవారు. ఆయన గొప్ప లోకజ్ఞానం కలవారు చండశాసనులు. అందువల్ల ప్రభువు తమ కాలాన్ని విద్యాగోష్ఠిలోనే గడిపేవారు. సంస్కృత గ్రంథాల ముద్రణకోసం లెక్కలేని ధనాన్ని ఖర్చుపెట్టేవారు.

తారానాథ తర్క వాచస్పతి గాని వాచస్పత్యమనే సంస్కృత విజ్ఞాన సర్వస్వం ఆయన ద్రవ్యసహాయం వల్లనే ప్రకటితమయింది. జర్మనీదేశ మహావిద్వాంసుడు మాక్సుముల్లర్ ఎడిట్ చేసిన ఋగ్వేద భాష్యం రెండవకూర్పును కావలసిన ధనాన్ని పూర్తిగా యిచ్చి ఆయనయే ముద్రింపించారు. కాశీలో "విజయనగరం సంస్కృత సీరీస్" అనే పేరుతో పెద్ద పెద్ద శాస్త్రగ్రంథాలను ప్రకటింపజేశారు. స్వయంగా తెలుగు కవిత్వం చెప్పే యీ ప్రభువు ఎన్నో గ్రంథాలను అంకితం పొంది వాటిని ప్రకటించారు. గురజాడ అప్పారావుగారి "కన్యాశుల్కం" ఈయనకు అంకితమియ్యబడినదే!

ప్రభువు పండిత పక్షపాతి అని గ్రహించి యితర ప్రాంతాల నుంచి విద్వత్కవులు వారి దర్శనానికి వచ్చేవారు. ఆయన వారివారి పాండిత్యాదులను పరీక్షింపజేసి, తగినరీతిని సత్కరించి పంపేవారు. సంస్కారప్రియులైన ఆనంద గజపతి ప్రభువు కన్యాశుల్కాన్ని అరికట్టడానికి గట్టి కృషి చేశారు. బాల్య వివాహాలు ఆ కాలంలో ముమ్మరంగా జరుగుతూ వుండడాన్ని చూచి, వాటిని నిషేధించడానికి ఒక శాసనం ప్రభుత్వంచేత చేయించడానికి తగినప్రయత్నాలు చేశారు. నాటక కళాప్రియులగు ఈ ప్రభువు సంస్కృత నాటక సమాజాన్ని స్థాపించి శాకుంతలం మొదలైన నాటకాలను ఆడించే

వారు. ఏయే శ్లోకాలకు ఏయే రాగాలు అనుకూలమైనవో అప్పటి సంగీతవేత్తలు, నాటక కళాభిజ్ఞులు నిర్ణయించేవారు. వీరి కాలం లోనే కన్యాశుల్క నాటక మూలంగా వ్యావహారిక భాషా వాదానికి అంకురం వెయ్యబడింది.

1850 లో జన్మించిన ఆనందగజపతి ప్రభువు 1897లో దివంగతులైనారు. ఏభయి ఏండ్లయినా జీవించలేదన్న మాట! ఈయన మరికొంతకాలం జీవించి ఉంటే ఎన్నో ఘనకార్యాలు చేసి వుండేవారని చెప్పవచ్చును.

ఆనందగజపతి రాజుగారికి సంతానం లేదు. అప్పటికి వీరి తల్లిగారు జీవించే ఉన్నారు. ఆమె పరిస్థితులను గమనించి తమ ఆప్తబంధువులలోని చిన్నవానిని దత్తత చేసుకున్నారు. ఆయనయే ఇప్పటి పి. వి. జి. రాజుగారి పితామహులైన విజయరామ గజపతి రాజుగారు. ఆయన బాలురుగా ఉన్నప్పుడు ఆనంద గజపతి రాజుగారి సోదరి రేవా సంస్థానపు మహారాణి అప్పల కొండయాంబగారు ప్రభుత్వాధికారి సహాయంతో సంస్థాన వ్యవహారాలను చూస్తూ ఉండేవారు. ఆమె పరిపాలనా కాలంలో ఎన్నదగిన ప్రజాహిత కార్యాలు కొన్ని జరిగాయి. ఆమె కొన్ని లక్షల ధనం వెచ్చించి విజయనగరానికి అయిదు మైళ్ళ దూరంలో ఉన్న చంపావతీ నది నుంచి గొట్టముల ద్వారా నగరానికి మంచినీటి సరఫరా పథకాన్ని ఏర్పాటు చేశారు. స్త్రీలకు ప్రత్యేకంగా ఒక పెద్ద వైద్యశాలను స్థాపించారు. కాశీ క్షేత్రంలో కేదార ఘట్టంలో గంగానదికి సోపానములు కట్టించి, గంగామహల్ నిర్మింపజేశారు.

విజయరామ గజపతి రాజుగారు రాజ్యాధికారానికి వచ్చాక విద్యావిషయంలోను, కళలలోను అభివృద్ధి కార్యాలను నిర్వహించారు. సంస్కృత కళాశాలకు పెద్ద భవనాన్ని నిర్మింపజేశారు. ఆంగ్లకళాశాలకు అనుబంధంగా హాస్టల్ ఏర్పాటు చేశారు. సంస్కృత విద్యార్థులకు, ఇంగ్లీషు చదివే బీద విద్యార్థులకు ఉచితంగా భోజనం పెట్టే బోర్డింగ్ హౌస్ ఏర్పరచారు. సంగీత కళాశాలను స్థాపించారు. హరికథా పితామహులు, నాదబ్రహ్మ ఆదిభట్ల నారాయణదాసు గారిని దానికి ప్రిన్సిపల్‌గా నియమించారు. వాయులీన మహా విద్వాంసులు ద్వారం వెంకటస్వామి నాయుడుగారు ఆ కళాశాలలోని ప్రధానాధ్యాపకులు.

ఆయన కాలంలోనే సంస్కృత కళాశాలలో మద్రాసు విశ్వవిద్యాలయపు పట్ట పరీక్షలు — శిరోమణి, విద్వాన్ పరీక్షలు ఏర్పడినవి. ఆ పరీక్షలు రాక పూర్వం విద్యార్థులు కాశీ పరీక్షలకు, కలకత్తా పరీక్షలకు చదువుతూఉండేవారు. సుప్రసిద్ధ విద్వాంసులు పేరి కాశీనాథశాస్త్రిగారు, వారి జామాతలు మహా మహోపాధ్యాయ తాతా సుబ్బారాయ శాస్త్రిగారు, మహా మహోపాధ్యాయ పేరి లక్ష్మీనారాయణ శాస్త్రిగారు, దండిభట్ల విశ్వనాథశాస్త్రిగారి శిష్యులు కొంపెల్ల విశ్వనాథశాస్త్రిగారు ఆంధ్ర వైయాకరణ సార్వభౌములు వఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారు మున్నగువారు విజయనగర సంస్కృత కళాశాలలోని అధ్యాపకులే! పైవారేకాక వీరి ఆస్థానంలో భగవత్కవి ముదుంబై నరసింహాచార్య స్వామిగారు, విశ్వ విఖ్యాత తార్కిక చక్రవర్తి గుమ్ములూరి సంగమేశ్వరశాస్త్రిగారు మొదలైనవారుండేవారు. ఇంగ్లాండులో తన సర్కస్‌ను ప్రదర్శించి ఐదవ జార్జి చక్రవర్తి ప్రశంసను పొందిన విశ్వ విఖ్యాత శాండో కోడి రామమూర్తి నాయుడుగారు ఈయన పోష్య వర్గంలోనివారే! ఈ ప్రభువు "విజయరామ డ్రమెటిక్ అకాడమీ" స్థాపించి, నటులను నెల జీతాలిచ్చి పోషిస్తూ నాటకాలు ఆడించేవారు. ప్రతి దినం రామాయణం చదివించి వినేవారు.

విజయరామ గజపతిరాజు గారి కుమారులు పి. వి. జి. రాజుగారి జనకులైన అలక నారాయణ గజపతి రాజుగారు. తండ్రిగారి వలెనే ఈయన కూడా విద్యాప్రియులు. స్వతంత్ర భావాలు ఉన్నవారు. ఈయన అజ్మీరులోని రాజకుమారుల కళాశాలలో విద్యను అభ్యసించారు. అనేక గ్రంథాలను అంకితం పొందారు. విజయనగరంలో బుర్రా శేషగిరిరావుగారు నెలకొల్పిన ఆంధ్ర భారతీ తీర్థ పరిశోధక విశ్వవిద్యాలయానికి ఆర్థిక సహాయం చేసేవారు. ఆసంస్థ జరిపే వార్షికోత్సవాలకు ఎంతో సహాయపడేవారు. ఈయన విదేశ పర్యటన చేసినప్పుడు పాశ్చాత్యుల మనస్తత్వాన్ని బాగాగ్రహించారు. భారతీయులను చాలా హీనంగా చూస్తున్న పాశ్చాత్యుల పద్ధతి వీరికి ఎంతో అసంతృప్తిని కలిగించింది. పాశ్చాత్య వేష భాషలు, అలవాట్లు ఆయనకు కిట్టవు. మద్రాసు శాసన సభలో సభ్యత్వానికి పోటీ చేసినపుడు ఎక్కడా, ఎవ్వరూ సంపాదించలేని మెజారిటీతో ఓట్లు సంపాదించి ఆయన ఎన్నిక అయేవారు.

ఇది అప్పటి విజయనగర సంస్థాన వృత్తాంతం.

స్వాతంత్ర్యానంతరం జమీందారీలు రద్దయి సంస్థానాధీశుల అధికారాలు తగ్గిపోయినా వదాన్యులయిన ఆ జమీందారులు వంశ పారం పర్యంగా వచ్చే ఉదారభావాన్ని విడిచిపెట్టలేదు. అలక నారాయణ గజపతి ప్రభువుకుమారులు పి. వి. జి. రాజుగారు కొన్ని విద్యాలయాలను ప్రభుత్వానికి అప్పగించినా మాన్‌సాస్ (Mansas) (మహారాజా అలక నారాయణ గజపతి సొసైటీ ఆఫ్ ఆర్ట్స్ అండ్ సైన్స్) అనే సంస్థను స్థాపించి తన్మూలంగా ఆంగ్ల కళాశాలను తానే నిర్వహిస్తున్నారు. మహిళలకొక కళాశాలను తమ కోటలోనే ఏర్పాటు చేశారు. టీచర్స్ ట్రయినింగ్ కళాశాల వీరి పర్యవేక్షణలోనే నడుస్తున్నది. భారత ప్రభుత్వం వారి సైనిక స్కూలునకు విజయనగరం దగ్గరున్న కోరుకొండలోని తమ భవనాన్ని ఇచ్చారు. ఎ. పైడిరాజుగారి చిత్రకళాశాలకు, డి. వై. సంపత్కుమార్‌గారి నృత్య కళాశాలకు తమ కోటలోనే వసతులు కల్పించారు. వీరుకొంత కాలం ఆంధ్ర ప్రదేశ్ విద్యా శాఖామాత్యులుగా పనిచేశారు. ఇదివరలోనేకాక ఇప్పుడు కూడా లోకసభా సభ్యులుగా ఎన్నిక అయారు.

# ముక్తచ్ఛాయ

## శ్రీ సోమసుందర్

అరరే !
ఇంకా యిక్కడే నిలిచి
నీడకోసం వెదుక్కుంటూనే ఉన్నావా,
వెర్రివాడ !
దిక్కులన్నీ మొగాలు ముడిచి వెలవెలలాడాక,
చుక్కలన్నీ అంతరిక్ష అంతఃపుర గర్భంలో
అంతర్ధానమయ్యాక —
ఇంకా యిక్కడే తచ్చాడుతున్నావా ?
పిచ్చివాడ !

ఏదీ నీ నియోన్ లైటు ?
ధగద్ధగల హాసపుంజాల నేత్రజ్వాలలతో
సౌఖ్యంగా నీకోసం
సామరస్యంగా మండిన జీవనజ్యోతి ?
ఇక్కడే యిక్కడే
ఈ జనాలయ ప్రాంగణంలోనే
జీవనోత్సవ హేలగా —
గతాగతాల రెండుప్రక్కలకీ విస్తరించిన
కోనేటి మునివాకిటనే —
ఇంతవరకూ ఒంటరిగా నిలచిందికదా ?
స్వాగతాంజలితో నిరీక్షిస్తూ
నీ ఆంతర్యాన్ని పరీక్షిస్తూ
ఆగామికోసం ఆశల్ని నియోగిస్తూ
నిరలంకారంగా కరాలందిస్తూ
నిలచిందికదా నియోన్ లైటు !

నీనుంచి నీ నీడలన్నీ
నిష్క్రాచీగా అంతర్ధానమైన ఈ నిశార్ధభాగంలో
నీ నాడులన్నీ
నీ వారధాన్యాల మునిపంట కొరుకుతూ
నిలచిన కర్తవ్యతా విమూఢత్వంలో
నీ ఆశలన్నీ శవాసనాలతో మైమరచిన
శూన్యాటవీ గహ్వరంలో — అరెరే !
ఇంకా ఎక్కడి నీడలురా !

తరుకోటరంలోదూరిన నీ ప్రాణం
వచ్చినదారి మరచి బయల్పడలేక —
తన్నుకుంటూ ప్రాణకోల్పోయిన
నిర్జీవ నిశాంతరంలో
భద్రగీతం పాడలేక —
జారేగుండెల్ని కాపాడలేక —
కట్టుకున్న కలల కన్నీటి మూటల్ని పోల్చుకోలేక —
మిగిలిపోయిన తొగరుపూపల్ని దాచుకోలేక —
ఈ జీవనకాసార తటంలో
ఎంతకాలం తచ్చాడుతావిలా ?
ఉన్మత్త పాంథశాలిలా !
ఒక్కటైనా కుముద్విని నీకోసం
రూపరేఖావిలాసాల బరపదు;
బండరాళ్ళ బ్రతుకు సరళరేఖలపై
ఆశమోసులెత్తదు.

ఆగామి గగనం
అంగవస్త్రం ధరించిన ముసలి ముత్తయిదువ !
మేఘాల తలుపులు ఓరగిలవాల్చి
పెద్దమడికి సంసిద్ధమవుతూన్న అనసూయ...
అయిదు పదుల అంగలు దాటినా
ఉన్నచోటునుంచి కదలజాలని పరకీయ !

అరెరే, అత్రీ !
ఏ విశేషాద్రులకోసం నీ గవేషణం ?
మొక్కుబడుల ముడుపులతో
ఎందుకోసం పెంచావురా దాడీలు ?
ఏ కొండయినాసరే పాపం
గుండె మిగిల్చింది నీకు !
ఎన్ని దిక్కులు తడిమినా

ఈ మంగళగిరి పానకాలస్వామి
దురాశల కిటుకు నీ కందక
సంభ్రమాల్నే గుండెనిండా విదల్చింది !
హే జీవితమా, ఎంతదూరమేగినా
ఒక్కలాగే ఎదురయ్యే సరళరేఖా !

ఏ చతుష్పథంలో నిన్ను
చేరుకుంటాయి నీడలు ?
కనక చేలాంచలాల కొసమెరుపులు !
చేతుల కందకుండా దారులు మళ్ళించే కొరవి దయ్యాలు !
ఎప్పటికీ నీ దప్పి తీర్చని మరీచికలు !

# "ఎండ ప్రదేశ్"లో మే మాసం

## శ్రీ నిఖిలేశ్వర్

కొండలు ఎగదోసిన
మంటల నాల్కల చాపల్యానికి
నిలువలేక మసిబారిన భాస్కరరావుపేట మొండిగోడలు,
గోలీసోడాలు తీరుస్తున్న దాహాలు.

ఖాళీకుండలు
దిసమొలల్తో రోడ్డువార పిల్లలు
గొంతు ఎండిపోతున్న కృష్ణాకాలువల గట్లపై
చిగురిస్తున్న పబ్లిక్ పార్కులు.

కోస్తా రాష్ట్రాల్లో వాచిన పల్లెలు పట్నాల్లో
ఉదయపు పొలిమేరల్లో
రైలుపట్టాల పక్కదారుల్లో
దీర్ఘశంకల నివృత్తిలో
బహిరంగ చర్చల దిగంబరాకారాల స్వాగతాలు.

భూస్వామ్యపు మర్రి ఊడలకింద
భూస్థాపితం సామాన్యుల కనీస సౌకర్యాలు.
నిత్యం సజీవంగా పారే
డ్రైనేజీ కాలువల దేహాలమీంచి
ఆంధ్రదేశపు అన్నపూర్ణ గాలిపీల్చి
ఆరోగ్యాన్ని అమ్ముకుంటోంది నల్లడబ్బుకు !

మృత్యువేగంతో సరసాలాడుతున్న మోటారు వాహనాలు
ఏనుగులా కూచున్న మంగళగిరి కొండకింద
గాలిపీల్చుకునే ప్రయత్నంలో
యాంత్రిక మరణాల వుత్తమామూలు ఘోరఉదంతాలు
ట్రాక్టర్ గుద్దేసిన బస్సు దీనావస్థ
బస్సు ఢీ కొట్టిన ఎద్దులముందు
ఆనాటికీ అప్పుతీరని రైతు కన్నీళ్లు !

గుంటూరు — ఒంగోలు ఎండమావుల
తళతళమనే మెరుపునాల్కల పాదువునా
భూస్వాముల పొగాకుల —
పెట్టుబడుల గుత్తవ్యాపారంలో
క్షయవ్యాధికి జీవంపోస్తున్న విషపునీడలు
మురికి కాల్వలపై తరతరాల కష్టజీవుల సహజీవనం !

ఎండప్రదేశ్‌లోనే 'మే డే' జ్వాలల్లో
ఎరుపెక్కే పోరాటాల్లో జీవనసమరం.

శ్రీమతి ఆర్. వసుంధరాదేవి

# ప్రేమ

భార్యాభర్తలిద్దరూ, ఆరేళ్ల కొడుకూ, లేదనుకోకుండా డబ్బూ —ఇదీ వాళ్ల సంసారం. కాబట్టి వాళ్లు చాల సుఖంగా వుండివుండొచ్చు. కాని లేరు.

వాళ్లిద్దరి దృష్టిలోనూ జీవితం చాల విలువైనది. దాన్ని సఫలం చేసుకోవాలనే యిద్దరి ప్రయత్నమూను.

నిజమైన వివాహం ప్రేమను పండిస్తూ నిత్యనూతనంగా వుండాలని రూప నిశ్చితాభిప్రాయం. ఈ అభిప్రాయం యింత నిశ్చయంగా ఏర్పడటానికి స్త్రీవ్యక్తిత్వంలోని సౌకుమార్యం ఒక కారణం కావచ్చు. పెళ్లికిముందూ, తరువాత కూడా ఆమె చదివిన బోలెడు ఉదాత్త ప్రేమసాహిత్యం కారణంకావచ్చు. కాని ఎనిమిదేళ్ల క్రితం ఆమె పెళ్లిజరుగుతున్న రోజునే తాను జీవితంలో దగాపడిపోయానని తెలుసుకుంది రూప. ఆమె పెద్దక్క మహిత పెళ్లి జరుగుతున్నప్పుడు బావగారి చేష్టల్లో వ్యక్తమైన సున్నితమైన భావం అందరికీ ముచ్చటకలిగించింది అప్పుడు. మహిత చేతికంటిన పసుపు తుడుచుకోవడానికి తన కర్చీప్ అందించారు బావ. బిందెలో నుంచీ ఉంగరం వెలికితీసే పందెంలో పెనగులాడినట్లు నటించి చివరకు మహితకే ఒదిలేశారు. ఇలాంటివే ఎన్నో మురిపాలు చూపారు. తనభర్త ఋషికి అలాంటి సున్నితమైన భావాలు ఏ కోశానాలేవన్న విషయం తనపెళ్లినాడే గ్రహించింది రూప. తరువాత నిజజీవితంలోనూ అదే ఋజువైంది. ఋషి రూప కోసం యీ ఎనిమిదేళ్లలోనూ ఒక్క త్యాగం కూడా చెయ్యలేదు. ఎప్పుడూ యింకోసారి కాఫీ యిమ్మనీ, ఫలానా కూర చెయ్యమనీ, ఉప్మాలో ఉప్పు తక్కువైందనీ, స్నానానికి ఎక్కువగా వేడినీళ్ళు తొందరగా కావాలనీ, యిలాంటి చీకాకులతోనే ఎనిమిదేళ్లు వ్యర్థం చేశాడు. ఇహ అతను మారడనీ, తన ఖర్మయింతేననీ, తన భావనాజగత్తులో విరాగిణిలా అసంతృప్త మనోరథయై జీవించాల్సిందేననీ రూపకి స్పష్టమైంది. ఇప్పుడామె తన కాలాన్ని కొల్లలుగా వస్తున్న ప్రేమసాహిత్యాన్ని చదవటంలో గడిపేస్తున్నది.

ఋషికి వివాహంలో అసంతృప్తిలేదు. జీవితం గురించి అతనికి స్పష్టమైన అభిప్రాయాలున్నవి. ప్రతివిషయం గురించీ ఒక్కో సిద్ధాంతం ఏర్పరచుకుంటూ వుండటం అతని పద్ధతీ; లక్ష్యమూను. ప్రపంచం అతనికి మేధా కసరత్తులు చేసే వ్యాయామశాల. కాని వూరికే వుంటే ఏదో బోలుతనం అతన్ని బాధిస్తుంది. అందుకని ఇంట్లో వున్నప్పుడు రూపని ఏదోవిధంగా కవ్వించి విసిగించి స్థిమితపడుతూ వుంటాడు.

రూప బి. ఏ. పాసైనా ఆమె లోకజ్ఞానం అంత గొప్పదికాదు. మేధాపరంగా ఆమె అభిప్రాయాలు అస్పష్టంగా వుంటాయి. వాటిని ఒక కొలిక్కి తెచ్చుకోవటానికి అతని సహాయం అర్థించటం ఆమెకు తప్పనిసరి. అడిగినప్పుడల్లా అతను తన అతితెలివినీ వక్రబుద్ధినీ ప్రదర్శిస్తాడు తప్ప ఆమె అడిగినదానికి ఆమెకునచ్చే సమాధానం చెప్పడు.

ఇప్పుడు రూప ఒక నవల చదువుతోంది. అందులో రచయిత ప్రేమను గురించి ఒక విచిత్రమైన అభిప్రాయం వెలిబుచ్చారు. అది తనకు నచ్చిందో లేదో తేల్చుకోలేకుండా వుంది రూప.

కొడుకు శ్రీనాథ్‌ను తీసుకెళ్లి అన్నం పెట్టాలన్న ప్రయత్నంలో చేతులో పుస్తకంతోటే ముందుగదిలోకి వచ్చింది. శ్రీనాథ్ ఋషికెదురుగా కొంచెం దూరంలో కుర్చీలో కూర్చుని అంతరిక్ష స్వరూపం గురించి చర్చిస్తున్నాడు. తొందరలో రాకెట్ ఇంజనీర్ అవాలని వాడికి గట్టి సంకల్పం వున్నది. వాడి యీ సంకల్పం విషయంలో రూపకి సానుభూతిలేదు. అందుకే నిర్లక్ష్యంగా వాళ్ల సంభాషణ మధ్యలో జొరబడి "ప్రేమంటే ఏమిటి?" అని ప్రశ్నించింది ఋషిని.

"ఏ ప్రేమా?" అన్నాడు ఋషి తన మామూలు వక్రధోరణిలో.

ప్రేమఅన్న పదం ఎరగనట్లు! దోవనపోయే దానయ్యకీ, మూలనుండే ముసలమ్మకీ కూడా తెలుసు అది! చీకాగ్గలిగినా తన అవసరం గనుక సౌమ్యంగానే చెప్పింది రూప : "ఒక పురుషుడికీ, ఒక స్త్రీకీ మధ్యన వుండే అవినాభావ సంబంధం. ఒకరులేనప్పుడు రెండోవారూ లేని స్థితి. జయదేవుడు—పద్మావతి, రోమియో—జూలియట్‌ల అమరప్రేమ. అలాంటిది ఈ కాలంలో మీరెక్కడన్నా చూశారా?"

ఇహ తన చర్చ జరిగే అవకాశం లేదని గ్రహించి, మెకానోసెట్ తీసుక్కూర్చున్నాడు శ్రీనాథ్.

ఋషి ఆలోచించాడు. "అలాంటి ప్రేమా?... ఈ కాలంలోనా?... అలాటి బంధం యీ హేతుయుగపు మనస్తత్వంలో పుట్టడానికి వీల్లేదు. అది వ్యక్తావ్యక్తాలు ఏకంగా ప్రవహించే స్థితినుంచే పుట్టాలి. ... ఈకాలంలో అలా ఒకరికోసం చచ్చేవారు అమాయకులో, తెలిసీతెలియని వయసు పిల్లలో అయ్యుంటారు తప్ప వ్యక్తులైన వారు అలా చావరని ఖచ్చితంగా చెప్పొచ్చు."

రూపకీ సమాధానం అసలు రుచించలేదు. "నేను చదువుతున్న నవల్లో రచయిత ఏమన్నారంటే ప్రేమ కలిసి జీవించటం నుంచీ పుడుతుందని" అన్నది.

"కలసి జీవించడం నుంచీ సానుభూతి,సహకారంలాంటిసరళమైన అనుబంధాలు పుట్టొచ్చుగాని నీవు చెప్పేటటువంటి సంకీర్ణమైన, గాఢమైన బంధం పుట్టదు." తన అభిప్రాయాన్ని వెల్లడించాడు ఋషి.

"ఆయన మీకంటే ఎక్కువ తెలివిగలవాడేలెండి.... అనుభవపూర్వకంగా సాధికారంగా చెప్తున్నారాయన" రుసరుసలాడింది రూప.

రూప రుసరుసలాడితే తను గెలుస్తున్నట్లు తెలుసుకుంటాడు ఋషి. అందుకని తాపీగా ప్రశ్నించాడు : "ఆ అనుభవజ్ఞుని వయస్సెంత? అతనిభార్య వయస్సెంత? ఆ ప్రేమపక్షుల గురించి తెలుసుకోవాలనుంది" అన్నాడు.

"చాల్లేండి మీ వెటకారం. అతను డెబ్భై ఏళ్ళ ముసలాయన. ఆమె పోయింది."

ఋషి విజయగర్వంతో ప్రక్కనున్న టేబిల్‌ని విరక్కొట్టాలని ప్రయత్నించాడు. "అదీ పాయింటు! మరాయన పోలేదు కదా! ఆయన చెప్పే ప్రేమా నువ్వుచెప్పే ప్రేమా ఒకటికాదు!" అన్నాడు.

ఇందాకట్నుంచి వాళ్ల వాదనని ఆదుర్దాగా గమనిస్తున్నాడు శ్రీనాథ్. ఈ కేకల పర్యవసానంగా కన్నీళ్లు, కోపతాపాలు, చిన్నయుద్ధం రేగుతుందని వాడికి అనుభవపూర్వకంగా తెలుసు. ఋషి టేబిల్‌మీద ధన్‌మని కొట్టగానే శ్రీనాథ్ మెకానోతో రాకెట్ కడుతూనే స్వగతంలా చిన్నగా మొదలెట్టాడు:

"అహం భావం.... ఘోరప్రమాదం....
అహంభావం.... ఘోరప్రమాదం....
అహంభావం.... ఘోరప్రమాదం...."

రానురాను గొంతుస్థాయి హెచ్చిస్తూ వస్తున్నాడు.

బాలల మాసపత్రికలే కాకుండా పదిపైసల లైబ్రరీల్లో విశేషంగా లభించే బాలసాహిత్యం అనబడే శవ, మంత్ర, భూతప్రేత పిశాచ సాహిత్యాల్లోని అద్భుత రసంతోపాటు అర్థం అయ్యీ కాని పదజాలం బోలెడుంది వాడి దగ్గర. సందర్భానికి తగినవీ, కొన్నిసార్లు తగనివీ బరువైన మాటలు ధారాళంగా ప్రయోగిస్తుంటాడు శ్రీనాథ్.

"చత్....నోరుముయ్యరా" అని ఒక కేకపెట్టి రూప ఆలోచనలో పడ్డది. ఋషి చెప్పేదీ ఆలోచించదగ్గదే....

"పోనీ, అది కారణాల కతీతంగా ప్రథమ వీక్షణంలో పుట్టడమే విజమయ్యుండాలి!" అన్నది ఆశగా.

"అసలు ప్రేమ అనేదే ఒక భ్రమ" తేల్చిచెప్పాడు ఋషి.

రూపకి మండుకొచ్చింది. అతని మాటలవలన ఆమె జీవితమే వ్యర్థమైపోతున్నది! "ప్రేమఅన్న భావమే మీకర్థంకాదు.... అపూర్వమైన ఆ ప్రేమ భావం లేనప్పుడు వివాహానికి అర్థం ఏముంటుంది? జీవితాంతం వరకూ అది ఏ ఆధారంతో నిలుస్తుంది? మీలాంటి వాళ్లవలననే పెళ్లి అనేది బలహీనవర్గమైన ఆడవాళ్లని పీడించడంగా మిగుల్తోంది యిప్పుడు" అన్నది.

"అందుకే కదా రానురాను ప్రపంచమంతా డైవోర్సుని ఒప్పుకొంటున్నది!" తాపీగా సెలవిచ్చాడు ఋషి.

"ఒప్పుకుంటే ముందుగా డైవోర్సు యివ్వాల్సింది మీకే!"

"శుభం. హాయిగా బ్రతికిపోతాను" అనేసి 'ఒరేయ్ శ్రీనాథ్.... నోరుమూస్తావా లేదా?' అంటూ గావుకేకపెట్టాడు.

ఈ బండమనిషితో మాట్లాడి ఏమీ ప్రయోజనం లేదనిపించింది రూపకు. "ప్రేమఅన్నది లేనప్పుడు అది ఎట్లాగ్గూ సవ్యమైన పెళ్లికాదు. వివాహంలో దైవాంశ వున్నదనీ, అది విడదీయరాని బంధమనీ మూఢనమ్మకాలు కల్పించుకొని దాన్ని నిలుపుకొంటున్నాం. నిజానికి అలాంటి బంధం ఏమీలేదు!" కచ్చగా, పెద్దగా అరిచింది రూప. రూపకి ఏడుపు కూడావస్తున్నది.

'గాలిదుమారం.... మాయాజాలం....
గాలిదుమారం.... మాయాజాలం....'

శ్రీనాథ్ ఒకరిమాటలు రెండోవారికి వినపడకుండా వుండేట్లు పెద్దగా కేకలేస్తున్నాడు.

ఋషికి వాడిమీద కొంచెం జాలికలిగింది. 'వూరికే గొంతుచించుకొని అరవొద్దు' అని వాడికంటే పెద్దగా అరిచి వాడిని కొంచెం శాంతింపజేశాడు.

"దైవాంశ వున్నదనీ, విడదీయరాని బంధమనీ నమ్మితే అదీ నిజమే అవుతుంది. నమ్మకమే నిజం" అన్నాడు రూపతో, జోరుగా తలకాయవూపుతూ.

"మీదొక వితండవాదం, పోండి. ఎవరేది నమ్మితే అది నిజం అయిపోతుందా? అసలీ హిందూపద్ధతి పెళ్లిళ్లు వుత్త అబద్ధాలు! స్త్రీని బానిసగా వుంచడానికి ఉద్దేశింపబడినవి అన్పిస్తోంది ఆలోచిస్తే."

"మీ రచయిత చెప్పినట్లు దానివలన యిద్దరు మనుషులు జీవితాంతం వరకూ కలిసి జీవించి, ఒకర్నొకరు అర్థం చేసుకోబోయి తననితాను అర్థం చేసుకునే మహత్తరావకాశం కల్పిస్తోంది గదా మన పద్ధతి! ఇందులో గొప్ప సైకాలజీ వుంది.... అదీ ఒకరకం ప్రేమ అనుకోవచ్చు" అన్నాడు ఋషిఉదారంగా.

అతను మొదట చెప్పినదానికి యిప్పుడు చెప్తున్నది పూర్తిగా వ్యతిరేకంగా వున్నట్లు తోచింది రూపకు. అతను నిజంగా చెప్తున్నాడో వ్యంగ్యంగా మాట్లాడుతున్నాడో స్పష్టంకాకుండా వుంది. అతనిప్పుడు చెప్పేప్రేమ ఏకదేశంగా వుంది. దానికి రెండోమనిషి కేవలం నిమిత్తమాత్రంగా కన్పిస్తున్నది. ఈ ప్రేమచాల ఘోరంగా వున్నది! రెండోమనిషి కోసం ఆత్మార్పణ చెయ్యటం కదా నిజమైన ప్రేమ!! రూపకి అంతా పెద్ద గందరగోళంగా అయిపోయింది.

"అసలు ప్రేమంటే ఏమిటీ?" అన్నది అయోమయంగా, మొదటికి వస్తూ.

ఋషికి విసుగుపుట్టింది. "రోకలిపట్టుకురా, తలకి చుడతాను" అన్నాడు. ఇంతవరకూ అతను చెప్పినదంతా బూడిదలో పోసిన పన్నీరైపోయినందుకు అతని బాధ.

ఈపాటికి శ్రీనాథ్ గొంతు తారస్థాయినందుకున్నది.
"ఓం... హ్రీం.. హూం.. మంత్రకాళీ
క్షాం మంత్రకాళీ.... ఫటాఫట్
ఓం హ్రీం హూం.... ఫటాఫట్ మంత్రకాళీ
క్షాం క్షాం క్షాం ఫటాఫట్ మంత్రకాళీ"

చేతిలోని పుస్తకాన్ని ప్రక్కనపడేసి, విసురుగా లేచి వాడిని ఎత్తుకుని నోరుమూసింది రూప. "ఈ అతితెలివి మాటలంటే నాకు మంట.... అన్నీ వుత్తుత్తి మాటలు! పనికిమాలిన వాదనలు... మా బుజ్జి బంగారానికి అన్నం పెట్టాల్సింది ఒదిలి పనిమాలా యీ మనిషితో ఎందుకు మాటలు పెంచుకున్నానో" గొణుక్కుంటూ బయల్దేరింది.

"ఎదుటిమనిషి చెప్పేదాన్ని విని అర్థం చేసుకునే శక్తి నీకెలాగూ లేదుగాని ఆ బుజ్జిబంగారానికి అన్నంపెట్టుకోవాలు" విసుక్కున్నాడు ఋషి. తనుచెప్పిన మహత్తర సత్యాలన్నీ వుత్తుత్తి మాటలా?! ఛీ, ఛీ!

అమ్మానాన్న లిద్దరూ కర్తవ్య నిష్ఠులై తనని బంగారంగా గుర్తించటంలో స్థిమితపడ్డాడు శ్రీనాథ్. అమ్మబుజం మీదినుంచి వెనక్కి చూస్తూ, "మాట్లాడుకోవటం అయిపోయిందిగా, నాన్నా, అన్నం తినిరాగానే అంతరిక్షం సంగతి చెప్తావా?" అని కేకేశాడు యీ అరగంటకాలాన్ని వెనక్కిజరిపి, అదిరేపిన దుమారాన్ని తుడిచేస్తూ.

---

# ఆత్మవిశ్వాసం కల చిత్రకారుడు

కొండపల్లి శేషగిరిరావుగారి ఇంట్లోకి వస్తూ ఉంటేనే అదొక చిత్రకారుడి గృహం అని తెలిసిపోతుంది. అన్ని వయిపులా పటాలు. కొన్ని పూర్తి అయినవీ, కొన్ని కానివి! అయినా ఎక్కడా చెల్లాచెదరనిపించదు. అది శేషగిరిరావుగారి ప్రత్యేకతేమో! ఇక చిత్రకారుడు: మేము వెళ్లేప్పటికి ఆయన పడుకుని లేచినట్లున్నారు కాని మల్లెపువ్వులాంటి తెల్లటి బట్టలలో, చిరునవ్వుతో ఎంతో చురుకుగా కనిపించారు...

ఆయన మహబూబాబాద్ (మానుకోట) దగ్గిరే ఉన్న పెనుగొండలో జన్మించారు. వరంగల్ జిల్లా అన్నమాట. నందలాల్ బోస్ వద్ద చిత్రకళ అభ్యసించారు. ఆ ప్రభావం ఆయన బొమ్మలలో కనిపిస్తూనే ఉంటుంది.



భారతదేశంలో జాతీయోద్యమంతోబాటు వచ్చిన ఎన్నో రకాల సాంస్కృతిక పునరుజ్జీవనం చిత్రలేఖనంమీద కొన్ని ముద్రలు వేసింది. భారతీయ సాహిత్యం, చరిత్ర, పురాణ గాథలు — వీటికి సంబంధించిన వస్తువులు బొమ్మలలో కనిపిస్తూ ఉంటాయి. శ్రీ శేషగిరిరావుగారు పెద్ద కవులు కొందరి బొమ్మలు ఊహించి వేశారు. పౌరాణిక గాథలలోని సన్నివేశాలని చిత్రించారు. కొందరు భారతీయుల బొమ్మలని వేశారు. అన్నిటిలోనూ ఆయనకి భారతీయ సంస్కృతితోకల సన్నిహిత సంబంధం కనబడుతూ ఉంటుంది. ఇటీవలే శ్రీ శేషగిరిరావుగారు కొత్త చిత్రలేఖన పద్ధతులతో ప్రయోగాలు చేస్తున్నారు. ఈ ఆంధ్రపత్రిక ఉగాది సంచికమీదిబొమ్మ ఈ రకానికి చెందినదే. చప్పున చూడగానే ''చీనాదేశపు చిత్రలేఖన'' ప్రభావం ఉంది అనిపిస్తుంది. ఇందులో ఆశ్చర్యం ఏమీలేదు. అసలు ఆయన చిన్నప్పటి అధ్యాపకుల పద్ధతులలోనే ఇటువంటి ప్రభావం గోచరిస్తూ ఉంటుంది. ఎందరో ఆధునిక చిత్రకారులు ఏమి చెయ్యాలో నిర్ణయించుకొనలేక మారిపోతూఉంటారు. శ్రీ కొండపల్లి శేషగిరిరావుగారి చిత్రకళలో వస్తున్న పరిణామాల సంగతి వేరు అనిపిస్తుంది. ఆయన చేసుకునే మార్పులు గట్టి ఆత్మవిశ్వాసంతో చేసుకున్నవే అన్న ఆలోచన ఆయన బొమ్మలు చూసేవారికి రాక తప్పదు.

ఒక విలేఖరి

ఇర్వింగ్ క్రిస్టాల్

# మేధావుల ప్రతికూల సంస్కృతి

లయొనెల్ ట్రిల్లింగ్ "ప్రతికూల సంస్కృతి" అనే మాటను కల్పించిన వెంటనే అది ప్రాచుర్యంలోకి వచ్చింది. దీనికి కారణం స్పష్టంగానో, అస్పష్టంగానో మనందరిచేత ఒక విషయం గుర్తింపబడటమే. మనము నేర్పే విద్యకు ఆధారమైన సంస్కృతి, మన పిల్లలు జీర్ణించుకునే విద్యవలన వారిలో కలిగే దృక్పథము, ఆలోచనా సరణులు, మనం జీవించే వాణిజ్య నాగరికతపట్ల, బూర్జువా నాగరికతపట్ల, మనకు అనిష్టాన్ని కలుగచేస్తాయనే నిజాన్ని కాదనలేము. మన కుమారులు, కుమార్తెలలో, కళాశాలలో చదువుకున్న తర్వాత, మన సామాజిక, ఆర్థిక వ్యవస్థలమీద, అంతకుముందుకంటె చిన్నచూపు కలుగుతుందని మనం ఎదురు చూడవచ్చు. ఈ విషయాన్ని అభిప్రాయ సేకరణలనుబట్టి తెలుసుకోగలము. మన అనుభవము కూడా దీన్ని బలపరుస్తుంది.

ఈ పరిస్థితికి మనము ఎంతగా అలవాటు పడ్డామంటే, దీనిని గురించి ప్రత్యేకంగా ఆలోచించము. ఇది ఎంత అసాధారణ విషయమో మనం గ్రహించలేకపోతున్నాము. ఈవిధంగా ఒక నాగరికతచేత పోషించబడే సంస్కృతికే, ఆ నాగరికతయొక్క విలువలకీ ఆదర్శాలకీ వైరుధ్యం ఉన్న ఘట్టం ప్రపంచ చరిత్రలో ఇంకొకటి ఉన్నదా? ఒక సంస్కృతి తనకు ఆధారంగా ఉన్న నాగరికతను విమర్శించడం, ఆ నాగరికతకు ఉత్తేజకము లనబడే ఆదర్శాలు సంపూర్ణంగా సాధించబడకుండా ఉన్నప్పుడు విమర్శించడం సాధారణమైన విషయంకాదు. ఆ విధమైన విమర్శ బహిర్గతంగానో, అంతర్గతంగానో అరిస్టోఫేనిస్, యూరిపిడిస్, డాంటే, షేక్స్పియర్‌లలో కనబడుతుంది. కాని ఆ ఆదర్శాలతోనే వైరుధ్యం ఉండడం అపూర్వమైన సంగతి. కొద్దిమంది రచయితలు, జిజ్ఞాసువులు—సంస్కృతి ఉపాంతాలలో ఉండేవారు—ఈవిధమైన వైఖరి కలిగి వుండవచ్చు కాని ఒక నాగరికత విలువలనూ, ఆదర్శాలనూ సమర్థించే బాధ్యత ఎప్పుడూ దానిచేత పోషించబడే సంస్కృతికి ఇవ్వబడుతుంది. ఆ బాధ్యతను సంస్కృతి స్వీకరిస్తుంది. సంస్కృతియొక్క ప్రధాన కార్యము ఇదే అనేది ఆధునిక సాంఘిక, మానవ శాస్త్రాల సిద్ధాంతాలలో ఒకటి.

కాని మన సంస్కృతి ఈ పని చేయడంలేదు. మన సమాజంలో ఒక వ్యక్తి ఎంత "సంస్కారవంతుడై"తే అంత అసంతృప్తి, అనిష్టాలకు లోనవుతున్నాడు. ఇంతేకాదు. సమాజంలోని యధార్థ స్థితిని గురించేకాక, మన నాగరికతయొక్క ఆదర్శాల గురించికూడా అతనిలో ఈ సంతృప్తి, అనిష్టము కలుగుతున్నాయి నిజానికి ఆదర్శమే, యాథార్థ్యం కంటె తీవ్రంగా విమర్శించబడుతోంది. ఆస్కార్ వైల్డ్ అనుకుంటాను, నిజమైన అమెరికను అంటే తనకి ఇష్టమేకాని "ఆదర్శ" అమెరికను తనలో తిరస్కార భావాన్ని కలుగచేస్తాడని అన్నాడు. మన సమకాలీన సంస్కృతి, యాథార్థ్యంపట్ల ఆయనకంటె చాలా తక్కువే సహనం చూపుతున్నది కాని ఒకవేళ రెండిటిలోను ఏదో ఒకదానిని ఎన్నుకోవాలంటే యాథార్థ్యంవైపే మొగ్గుచూపుతుంది.

సహజంగానే అంత "సంస్కారం"లేని సగటు అమెరికను, యాథార్థ్యం పట్లగాని, ఆదర్శం పట్లగాని ఎక్కువ అసంతృప్తి చెందడు. విప్లవాత్మకమైన శ్రామికవర్గం, కాపిటలిస్టు సమాజం మీద తిరగబడుతుందనే మార్క్సిస్టు దర్శనం తప్పుకావడానికి కారణం ఇదే. మన కాలంలో విప్లవాత్మక భావాలు, పాఠశాలలవరకు మాత్రమే చదివిన వారిలోకంటె, కళాశాలలో చదివినవారిలోనే ఎక్కువ కనబడుతున్నాయి. దీనికి కారణం ఏదో ఒక విధమైన ప్రతికూల సంస్కృతియొక్క ప్రభావం ఈ రెండో వర్గంవారి మీదనే ఎక్కువగా ఉండడం. మొదటి వర్గంవారికి—కనీసం ఇటీవలి కాలంవరకు—వారి స్వంతదైన "ప్రజాసంస్కృతి" ఉండేది. ఇది పనిచేసి బతికేవారు జీవించే బూర్జువా ప్రపంచంతో సర్దుబాట్లు చేసుకొంది. కాని ఈవిధంగా రెండు విభిన్న సంస్కృతులుండడమే బూర్జువా యుగంలోని అపూర్వం.

ఇది 19వ శతాబ్దంలో ఆవిర్భవించిన అవాంత్—గార్డ్ ఉద్యమానికి—ఇదే ఈనాటి ప్రతికూల సంస్కృతికి పునాది వేసింది—ప్రతి స్పందనగ వచ్చిన పరిణామం.

బూర్జువా సమాజం నిస్సందేహంగా కాల్పనిక వాసనలేని నేలమట్టపు సమాజం. వచనంలో సాధారణ మనుష్యుల జీవితాలలోని అసాధారణ (కొంతవరకుమాత్రమే) సంఘటనలను గురించి వ్రాయబడే నవలే ఈ సమాజానికి ప్రత్యేకమైన, సహజమైన సాహిత్య ప్రక్రియ. ఇది ఇతిహాసాన్ని, లిరిక్ కవిత్వాన్ని, పద్యాత్మకమైన నాటకాన్ని, దైవస్తోత్రాలతో నిండే మత సాహిత్యాన్ని వెనక్కి తోసేసింది. ఈ ప్రక్రియలు సర్వోత్కృష్టత ఆదర్శాలుగా కలవిగాని—ఈ ఆదర్శాలు చాలా కొద్దిమంది అసాధారణ ఉదాత్త ప్రకృతిగల వ్యక్తులకు మాత్రమే ఆచరణసాధ్యాలు—లేక ఇహలోకంలోని మానవజాతి జీవితం సర్వాతిశాయి అయిన విశ్వంలో తాత్కాలిక ప్రాముఖ్యంగల ఒకభాగం మాత్రమేననే దృష్టి కలవి కాని అయిన సమాజాలకి యుక్తమయినవి కాని బూర్జువా సమాజానికి ఈ ఉదాత్తాశయాలలో ఆసక్తి లేదు. వాటిని వ్యక్తిగత విషయంగా, ఏ స్త్రీయైనా, పురుషుడైనా తనకు ఆసక్తివుంటే అనుసరించనివ్వ తగినవి సహిస్తుంది. అంతే. దాని స్వరూపము మాత్రమేకాదు. దాని మూలతత్త్వము కూడా కాల్పనిక వాసన లేనిది. ఇది సామాన్య స్త్రీ, పురుషుల సౌఖ్యము కోసము ఏర్పడింది; కీర్తివంతులను, ధీరోదాత్తులను తయారుచేయడానికి కాదు. ఈ సమాజం మన కెదురుగా ఉన్న ఈ ప్రపంచాన్ని

సాధ్యమైనంతవరకు జీవించడానికి అనువుగాచేయాలని చూస్తుంది. అంతేకాని ధార్మికత్వము ద్వారానో, దుఃఖాంతం చేయడం చేతో ఈ ప్రపంచంలో గొప్ప పరివర్తన తేవాలని చూడదు.

సామాన్యుల మేలుకోసం నిర్మించబడిన ఈ సమాజం అతి సామాన్యము, లౌకికము అయిన ''స్వప్రయోజన'' మనే ప్రేరణ భావం మూలస్కంధంగా ఏర్పడింది. చాలా కొద్దిమందే ఉత్తమత్వాన్ని, ఉదాత్తతను సాధించడానికి ప్రయత్నించినా, అందరూ స్వప్రయోజనం సాధించడానికి పాటుపడగలరు అనే నమ్మకం మీద ఈ సమాజం ఏర్పడింది. ఈ పరిమిత విషయంలో మానవులందరిలో ఉండే సమానత్వంలో కల 'ప్రజాస్వామిక' విశ్వాసం మార్కెట్ ఎకానమీకి దారి తీస్తుంది. ఈ ఆర్థిక వ్యవస్థలో ప్రతివ్యక్తి తన స్వప్రయోజనాన్ని తనే నిర్ధరించుకుంటాడు. దీనివలన అంతకు పూర్వపు యుగాలలోని ఉన్నత వర్గాలవారి వాత్సల్యంతోనే అధికారాన్ని సమర్థించే ఆర్థిక సిద్ధాంతాలు అన్నీ అసమర్థనీయాలు అయాయి. కాని ఈ సమాజం ఉత్తమత్వాన్ని–మతవిషయంలోగాని, నీతి విషయంలోగాని, విజ్ఞాన విషయంలోగాని–సాధించడానికి ప్రయత్నించిన వారిని అడ్డుపెట్టదు. అణిచిపెట్టదు. ఈ ప్రయత్నము ఒక ప్రత్యేకమైన స్వప్రయోజన సాధనమనీ, దానికి ఏ విధమైన అధికారస్థాయి లేదని మాత్రము అర్థము చేసుకోవాలి. బూర్జువా సమాజం ఇతర మానవ అనుభూతులైన సంఘంలో జీవించాలనే కోరిక, తోటి మానవులతో సానుభూతి, అంతరాత్మ ప్రబోధించే నీతి మొదలైన వాటిని అనుసరించడం స్వప్రయోజన సాధనలో భాగాలే అని గుర్తించగలిగే మనోవైశాల్యం — అంటే దూరదృష్టి. జాగ్రత్త వ్యక్తికి ఉంటుందని గుర్తిస్తుంది. కాని వాటిని అతను తనంత తానుగా స్వేచ్ఛగా చేస్తాడని నమ్ముతుంది.

సాహిత్యంలో సుఖాంతాలు సగౌరవంగా చూడ పిలవడం బూర్జువా సంస్కృతికీ, బూర్జువా సిద్ధాంతాలతో సమన్వయం కలిగినపుడు ఉండే సహజ లక్షణం ప్రాచీన గ్రీకు, లాటిన్ సాహిత్యాలలో గాని, రినెయ్‌జాన్స్ సాహిత్యంలో గాని సుఖాంతాలు — ఐహికమైన సుఖాంతాలు-కామెడీల క్రింద తోసివేయబడ్డాయి. యుద్ధ రంగంలో వీరోచితమైన మరణము, ప్రేమలో గాఢత్వము, రాజకీయాలలో ఔన్నత్యకాంక్ష. మత విషయాలతో ధర్మశీలత — వీటిని గురించి వ్రాయబడిన వాటినే గణనీయమైన, గంభీరమైన సాహిత్యంగా పరిగణించేవారు. ఈ విధమైన గాంభీర్యం బూర్జువా సమాజపు తత్త్వానికి విరుద్ధమైనది. మానవునికి పరిపూర్ణత సిద్ధించడం—మానవ ప్రకృతి నైజం—పౌరుడుగా, భర్తగా, పోషించేవాడుగా ఉండడం ద్వారానే కలుగుతుంది అనేది ఈ సమాజపు తత్త్వం. ఇది బూర్జువా పూర్వపు సమాజము, బూర్జువా అనంతర సమాజాల, మానవస్థితిని గురించి, విశ్వములో అతని స్థానము గురించిన అవగాహనకు విభిన్నంగా ఉన్నది. ఇది మానవుడిని ఒక గృహస్థు, సంసారి అనే దృష్టితో చూస్తుంది.

ఈ బూర్జువా ఆదర్శము బైబిల్‌లోని న్యూటెస్టమెంట్ కంటె ఓల్డ్‌టెస్టమెంట్ దర్శనానికి దగ్గరగా వుంటుంది. ఈ కారణంచేతే కావచ్చు యూదులు తక్కిన వారి కంటె బూర్జువా సమాజంలో బాగ ఇమడగ గారు. భగవంతుడు ఈ ప్రపంచాన్ని సృష్టించాడు; దాని సార్థకతను ప్రవచించాడు; మానవులు ప్రత్యయరెతో తమ జాతిని వృద్ధి చేసుకోవాలి; పని చేయడం (వాణిజ్యం అని పిలువబడేది ఒక రకమైన పనే) గౌరవం కలిగించేదే కాని కించపరిచేది కాదు; (ఆడమ్ స్మిత్ ఉపయోగించిన ప్రసిద్ధమైన మాటలలో)''తన స్థితిని మెరుగుపరుచు''కోవాలనే మానవ ప్రవృత్తి సహజమైనది కనుక మంచిది అనే భావం - ఈ అభిప్రాయాలన్నీ ప్రవాసానంతర యూదుమతతత్త్వంతో పూర్తిగా సమన్వయిస్తాయి. ''ప్రతి మనిషి'' అనేది ఇక్కడ కేవల ప్రతీకకాదు. నిజంగా ప్రతీ మానవుడు అనే అర్థం.

సామాన్య స్త్రీ పురుషుల అవసరాలను, కోరికలను కేంద్రస్థం చేసిన ఈ బూర్జువా దృక్పథము సామాన్య ప్రజల సమ్మతిని పొందడంలో ఆశ్చర్యంలేదు. ఇది ఈ విషయంలోని జటిలతను స్పృశించడం లేదు. జాతీయ సాంప్రదాయాలు, మతభేదాలు (ఉదా కేథలిక్కులు ప్రొటెస్టెంటులు) మూలాన భావాలలో ఎన్నో భేదాలు వస్తాయి. కాని ఇది మొత్తంమీద నిజమే. కాని దాదాపు ప్రారంభంనుంచి ఈ దృక్పథం ఒక అల్పసంఖ్యాక వర్గంలో అవజ్ఞను, తక్కినవారికంటె తమ స్థితిని కొంత మెరుగుపరచుకొని కొంత విరామ సమయాన్ని సాధించిన కొంతమందిలో జీవితంలో వీటికి అతీతమైన విలువలు, అర్థాలు ఏవైనా ఉన్నాయేమోననే సందేహంతో కూడిన అలజడినీ రేకెత్తించాయి.

18వ శ॥లోని కాల్పనికోద్యమము, బూర్జువా సమాజంలోని మధ్యతరగతిలోనే, బూర్జువాతత్త్వానికి భిన్నమైన ఒకేవిధమైన ఆధ్యాత్మిక ప్రవృత్తి మొలకెత్తుతోందనే హెచ్చరిక వంటిది. ఇది బూర్జువా తత్త్వానికి ప్రతికూలమైనది కాదు. అప్పటికింకా అది మొదలు కాలేదు. కాల్పనికత్వం — ఆదిమానవునికి ఉదాత్తతను ప్రశంసించడము, గాఢమైన ప్రేమ, అభిజాత్యులైన ధీరపురుషులు, ధీరవనితలు, భయంకరాలు, బీభత్సాలు అయిన అపాయాలను ధైర్యసాహసాలతో సగర్వంగా ఎదుర్కోవటము — బూర్జువాతత్త్వంమీద తిరుగుబాటు కాదు. దానినుంచి తప్పించుకోవడానికి అనుసరించిన సౌందర్యాశ్రితమైన ఒక మార్గం ఇది. బూర్జువా యాథార్థ్యం నుంచి పూర్తిగా వేరుచేయబడిన నిరపాయమైన ఒకరకమైన ప్రతిసంస్కృతి. అందుచేతనే బూర్జువా సంస్కృతి (కొంత భయ సందేహాలతోనే) జీవించడమనే ముఖ్య వ్యాపారంనుంచి కొంత విశ్రాంతినిచ్చే ప్రశమనంగా దీనిని సహించకలిగింది. ఈ కాల్పనిక ప్రవృత్తి ఉత్పత్తికి, వినియోగానికికూడా ఒక వర్గంమీదే అధికంగా ఆధారపడడం అది స్వయంపరిమితం చేసుకోవడాన్ని సూచిస్తోంది. ఆ వర్గం స్త్రీలు.

గత రెండు దశాబ్దాలుగా సాగుతున్న ఉద్యమంలో అంతగా హర్షించదగని విషయాలలో కాపిటలిస్టు వ్యవస్థలో స్త్రీ స్థానం గురించి అది ప్రచారంలోకితెచ్చిన వక్రభాష్యం ఒకటి.దీనిలో స్త్రీలు కాపిటలిస్ట్ వ్యవస్థలో అణిచివేయబడ్డారు. ముఖ్యంగా సెక్స్ విషయంలో అని చెప్తుంది. స్త్రీలు అణచివేయబడడం యథార్థమే. కాని ఇది కేవలం పురుషుల లోభంవల్ల, అసహిష్ణుతవల్ల మాత్రమే

జరిగినదనడం హాస్యాస్పదం. సెక్స్ విషయంలో ఈ అణచివేతను— ఇదేకాక విక్టోరియన్ అని మనము పిలిచే నీతి నియమాలు అన్నీ — స్త్రీలు తమమీద తామే విధించుకున్నారు. (స్త్రీలందరూ నిగ్రహ పరులైతే పురుషులకంత ప్రయోజనం ఉండదు.) స్త్రీలు ఈ నైతిక నియమాల్ని అనతిక్రమణీయంగా పరిగణిస్తారు. ఎందుచేత నంటే సెక్స్‌విషయంగా అణిచిపెట్టేదిగా ఉన్నా ఇతరంగా అనేక విధాల ఇది స్త్రీలకు విమోచన కలిగించింది. ముఖ్యంగా ఇది స్త్రీలు, యాధార్థ్యంలో కాకపోయినా, ఆదర్శంలో కేవలం కామతృప్తి కలిగించేవారుగా, పనిచేసి పెట్టేవారుగా ఉండే పరిస్థితిని తొలగిం చింది. ఇంకోవిధంగా చెప్పాలంటే ఇప్పుడు స్త్రీలందరు గౌరవనీయ మైన స్థానాన్ని పొందారు. వారితో గౌరవ మర్యాదలతో వ్యవహ రించవలసి వచ్చింది. (ఇప్పుడుకూడా ఈ అలవాట్లు కొన్ని, కొంత మిగిలిఉన్నాయి. స్త్రీలఎదుట టోపీ తీసివెయ్యడం, ఎవరైనా స్త్రీ గదిలోకి రాగానే లేచి నుంచోవడము మొ॥) షేక్స్పియర్ నాటకా లలో చిత్రించబడిన "wench" సమాజంలోంచి తొలగిపోలేదు. శ్రామిక వర్గంలోనూ, ఇతర వర్గాలలోనూ కనబడుతూనే ఉండేది. కాని ఆమె స్థితి మార్పురానిది కాదు. ఆమెకూడా వివాహంద్వారా గాని, విద్యద్వారాగాని, లేక కేవలం తన ఇచ్ఛాబలం మూలానగాని సంఘంలో గౌరవనీయురాలైన స్త్రీగా మారవచ్చు.

స్త్రీస్థాయిలో ఈ ఔన్నత్యం రావడానికి ఆమె చెల్లించినవెల ఆత్మనిగ్రహము, స్వార్థత్యాగము. ఈ సంయమనం ఆమెను ఆ మూల్యమైన "ఆస్తి"కి—అది అగోచరమైనదే—స్వంతదారుగా చేసింది. సెక్స్‌కి సంబంధించిన నీతీ, నడవడికలలో వచ్చిన ఈ మార్పుకు కాల్పనికత్వ వికాసంతో కొంత సంబంధమున్నది. అను కోవడం అహేతుకం కాదు. కాల్పనిక సాహిత్యంలో కామప్రవృత్తి ఒక ముఖ్యభాగం—దీనినే తరువాతి కాలంలో ఫ్రాయిడ్ అణచివేయ బడినది తిరిగి పైకిరావడం అన్నాడు. ఎందుచేతనంటే కాల్పనిక ప్రేమ ఇతివృత్తంగాకల నవలలను కొనేవారు, అప్పటికి కొత్తగా పెట్టబడిన సర్క్యులేషన్ లైబ్రరీలనుంచి సొమ్మిచ్చి అద్దెకు తీసుకొనేవారు ఎక్కువగా స్త్రీలే. ఇప్పుడుకూడా రెండు శతాబ్దాల తరువాత కూడా ఈవిధమైన నవలలను (ఇవి ఇప్పుడు గణనీయ మైన సాహిత్యంగా తలచబడటంలేదు).కొనేవారు, చదివేవారుస్త్రీలే.

అకాల్పనికమైన ఈ సాహిత్య ప్రక్రియలో — జేన్ ఆస్టిన్ రచనలలో ఈ సాంప్రదాయం పరాకాష్ఠ నందుకుంది — అసాధార ణమూ, నైజవిరుద్ధమూ అయిన ఈ మార్పు బూర్జువావర్గం సాధించిందే. మధ్యతరగతుల ప్రజల సంపద పెరగడంచేత, వారికి కొనుగోలు శక్తేకాక, చదవడానికి విరామ సమయమూ, ఏకాంతము (తనకు ప్రత్యేకమైన గది) కూడా లభించడంద్వారా ఈ పరిణామం సాధ్యమయింది. చివర చెప్పిన ఈ "ఏకాంతం" ముఖ్యంగా గమ నించదగింది.

పదిమందితో కలిసేకంటే ఏకాంతంగా చదివితే ఎక్కువ రసానుభూతీ, సంతృప్తీ కలగడం నవలకు పూర్వ సాహిత్య ప్రక్రి యలనుంచి వేరైన ప్రత్యేక లక్షణం. కాల్పనిక యుగంలో నవలలు సకృత్తుగా చదివి వినిపించబడేవి. కాని క్రమంగా ఈ పద్ధతి ఆగి పోయింది. షేక్స్పియర్, రేసిన్‌లు మనను వారి రచనలను నలుగు రితో కలిసి అనుభవించినప్పుడే (పగటిపూట, రంగంమీద) ఎక్కువ "సమ్మోహితుల"నుగా చేయగలరు. కాని నవలలు నిశ్శబ్ద నిశీథంలో, ఏకాంతంగా చదివినప్పుడే ఎక్కువ శక్తివంతంగా ఉంటాయి. నవ లను చదవటం ఒక చిక్కటి పగటి కలలోకి జారిపోవడంవంటి అను భవం. అకాల్పనిక యాధార్థ్యం మూలంగాగల బూర్జువా నీతి ఈ విధమైన పగటికలలు కనడాన్ని గర్హిస్తుంది. ఈనాటికి కూడా వాణిజ్యరంగంలో వారు చాలామంది తమకు నవలలంటే ఇష్టమని ఇతరులు భావించడం ఇష్టపడకపోవడానికి కారణం ఇదే. వీరిలో చాలామంది నిజంగా ఇష్టపడరు కూడా. కాని బూర్జువా స్త్రీలు ఒకేకాలంలో రెండు ప్రపంచాలలో—బూర్జువా కానిదైన "కాల్పనిక" ప్రపంచంలోనూ, బూర్జువా "యధార్థ" ప్రపంచంలోను—జీవించ డంలో, ఆ రెండింటిలో ఏ ఒక్కదానిలోనో మాత్రమే జీవించడం కన్న గల ఆధిక్యాన్ని త్వరలోనే గుర్తించారు.

ఈ విధమైన నవలలు (పద్యాలు—ఈ సందర్భంలో బైరన్ జ్ఞాపకానికి వస్తారు) వ్రాసిన రచయితలు, రచయిత్రులు కేవలం లాభదృష్టితో రచనలు చేయలేదు. మొదట్లో బూర్జువా సమాజం ఇచ్చే పుష్కలమైన వ్యక్తి స్వాతంత్ర్యాలవల్ల వారు దానికి సుము ఖంగా ఉండి వుండవచ్చు. ప్రగతి, ఆర్థికాభివృద్ధి, సనాతన సాంప్ర దాయాలనుంచి విమోచనలకు ప్రాధాన్యమిచ్చే కాపిటలిస్టు వ్యవస్థ వలన సమాజంలో కలిగిన చైతన్యము, జీవశక్తీ రచయితలలో ఉత్సాహాన్ని రేకెత్తించాయి. కాని అతి త్వరలోనే వారిలో దీనిమీద భ్రాంతి తొలగిపోయి, వైమనస్యమేర్పడి, దీనినుంచి తప్పించుకొని పోవాలనే కోరిక బలపడింది:

కళాకారుల, ఇప్పుడు మేధావులని పిలవబడుతున్నవారి— ఈ వర్గంవారు ఆ బూర్జువా సమాజంచేత సృష్టించబడినవారే. ఈ సమాజం జిజ్ఞాసువులను జ్ఞానబోధకులుగా, సవిమర్శకమైన విజ్ఞానాన్నిచ్చే వారినిగా మార్చింది దృష్టిలో ఈ కొత్త వ్యవస్థలో మూడు లోపాలున్నాయి.

అన్నింటిలో మొదటిదీ, ముఖ్యమైనదీ ఈ వ్యవస్థ "విసుగు" కలుగచేస్తుందనే భయం. సాహిత్యంలో "గ్లాని"వస్తువుగా ఉండడం 19వ శ॥లోనే ప్రాముఖ్యంలోకి వచ్చినా అది అనుభవానికి రావడం అంతకు చాలాముందరే అయివుంటుందనడంలో సందేహంలేదు. గతంలో అంతా కళాకారులు, రచయితలు, ఇద్దరు వయస్కులైన వ్యక్తులమధ్య వాణిజ్య సంబంధాలపట్ల ఏ దాపరికము లేకుండా బాహాటంగా తిరస్కారభావాన్ని వ్యక్తపరిచారు. వాణిజ్యంవలన మానవ వుడి ప్రకృతి సున్నితత్త్వం కోల్పోయి, పలుచబడుతుందని వీరి అభిప్రాయం. బూర్జువా సమాజం ప్రధానంగా వాణిజ్య సమాజం కావడంచేత-మనకు తెలిసిన చరిత్రలో వాణిజ్యనీతికి ప్రథమస్థానం ఇచ్చిన మొదటి సమాజం ఇదే—వీరి కోపం మరింత ఎక్కువగా ఉంటుంది. తరువాతి కాలంలో వీరి ఈ భావాన్ని వ్యక్తం చేయడానికి ఫిలిస్టినిజమ్ అనేమాట పుట్టింది.

రెండవది, బూర్జువా సమాజం వీరికి కావలసినవి ఎన్నో - వీటిలో ముఖ్యమైనవి ప్రథమంగా అభిప్రాయ వ్యక్తీకరణలో స్వాతం

త్వము, ప్రజాదరణ, సత్కృత్తుగా సంపదా—ఇచ్చినా, రచయితలు, కళాకారులు తమ హక్కుగా భావించే ఉన్నత స్థాయిని ఇది తొలగించి వేసింది. ఈనాడు కూడా పరిస్థితి ఆ విధంగానే ఉన్నది. కళాకారులు, రచయితలు, జిజ్ఞాసువులు ఎప్పుడూ తమను చాలా ముఖ్యమైన వ్యక్తులుగా పరిగణించుకుంటారు. ఎంత ఉదారంగా తమ పట్ల వ్యవహరించినా తమ ప్రాధాన్యం తగ్గి కేవలం సహించబడడం వారికి దారుణంగా కనబడుతుంది. బెర్టోల్ట్ బ్రెక్ట్ నాటకాలను రష్యాలో అమ్మడానికిగాని, ప్రదర్శించడానికి గాని వీలులేదు. పాశ్చాత్య దేశాలలో తన రచనల ప్రదర్శనలవలన, విక్రయాలవలన ఆయన సంపన్నుడైనారు. ఈ పరిస్థితిలో తన కమ్యూనిస్టు విశ్వాసాల్ని ఏవిధంగా సమర్థించగలరని ఆయనను ప్రశ్నించగా ఆయన వెంటనే "రష్యాలో కనీసం నన్ను సీరియస్‌గా తీసుకుంటారు" అన్నారు. రచయితలు, మేధావులు, తమ రచనలనూ అభిప్రాయాలను లెక్క పెట్టే ప్రభుత్వాలపట్ల గౌరవం చూపిస్తారు. సాంఘిక, రాజకీయ అధికారాలకు దూరంగా ఉండవలసి రావటం వీరికి నిజంగా శిక్షే.

మూడవది, వాణిజ్య ప్రధానమైన సమాజంలో, బజారు వ్యాపారాలచేత రూపొందించబడిన నాగరికతగల సమాజంలో సామాన్య స్త్రీ పురుషుల ఇష్టాలకు, అవసరాలకు ప్రాధాన్యం ఉండడం సహజం. వీరిలో ఏ ఒక్కరికి ఎక్కువధనం లేకపోవచ్చును. కాని వారి సంఖ్యాబలంచేత వారి అభిరుచులే చివరికి సమాజాన్ని పాలిస్తాయి. కళాకారులు, మేధావులు ఈ పరిస్థితిని సహజంగా ఉండవలసిన తీరుకు విపరీతంగా ఉన్నట్లు భావిస్తారు. ఇది "వల్గారిటీ"కి సర్వవిధాల అధికారమివ్వడమని వారి నమ్మకం. తమ నైజంచేతే శిష్టవర్గాధిపత్యాన్ని గుర్తించే వీరు, ఒక శిష్టవర్గంచేత నాగరికత రూపొందింపబడాలనీ, తాము ఆ వర్గానికి—ఎంత సందిగ్ధంగానైనా—అనుబంధించబడిన వారమనీ నమ్ముతారు. ఇప్పటి వినియోగదారుల, పరిసరాల పరిశుభ్రతల గురించిన ఉద్యమాలు ఈ శిష్టవర్గ ప్రవృత్తినే, కొంత విరూపం చెంది, ప్రతిబింబిస్తున్నాయి. మన కాలంలో ప్రజాస్వామిక ఆశయం ఒక్కటే అంగీకరించబడుతోంది కనుక, మార్కెట్టు ప్రజల నిజమైన ఇష్టాలను ప్రతిబింబించదనీ, ప్రచార సాధనాల శక్తి వాటిని వికృతం చేస్తుందనీ వీరు అంటారు. కాని ఈ శక్తికి లొంగకుండా ఉండడానికి కావలసిన విద్య,ఇచ్ఛాశక్తీ ఉన్న ఒక అల్పసంఖ్యాక వర్గం ఉంటుందనీ, వీరే ప్రజల ప్రతినిధులుగా వ్యవహరించడానికి నిజమైన అధికారం కలవారనీ వీరి అభిప్రాయం.ఈ వర్గంవారే ప్రతి ఒక్కరికీ కార్లు ఉండే అమెరికన్ "ఆటోమొబైల్" నాగరికతను చూచి అసహ్యించుకుంటారు. కాని అధికారంలోవున్న కొద్దిమందికి మాత్రమే కార్లు ఉన్న సోవియట్ సమాజం వీరిలో అసహనం కలిగించదు.

మొత్తంమీద మేధావులు, కళాకారులు బూర్జువా సమాజంలో అశాంతితో ఉంటారు (ఆ విధంగానే ఉన్నారు.) 1750 తరువాతి శతాబ్దంలో కాల్పనికత్వానికి లభించిన ఆదరం ఈ విషయాన్నే బుజువు చేస్తుంది. ఈ కాలంలో కళాకారులు ఆధ్యాత్మిక "ప్రవాసం" బయలుదేర తీసారు. ఐతే దీనివలన బయటి ప్రపంచం ఏమాత్రము మారలేదు. కాని ఈ అశాంతి కేవలం పలాయన మార్గాన్ని మాత్రమే అనుసరించినదనలేము. ఒక భాగం "తిరుగుబాటు"ను కూడా ఆశ్రయించింది. 19వ శతాబ్దంలో ఆవిర్భవించిన వివిధ రకాలయిన సామ్యవాద తత్త్వాలు, ఉద్యమాలు ఈ విషయాన్నే తెలియచేస్తున్నాయి.

సామ్యవాదం (అది ఏ రకానిదైనా) హేతువాదపు చట్రంలో వర్తించే కాల్పనిక అనుభూతి. ప్రతిపౌరుడు తన ఒక్కడి బాగుకంటె, అందరి బాగుకు—ఇది ఏమిటో సహజంగా మేధావులు, తత్త్వజ్ఞులతో కూడిన శిష్టవర్గం నిర్ణయిస్తుంది — ప్రాధాన్యం ఇచ్చే సమాజాన్ని సృష్టించడం దాని లక్ష్యం. ఈ ఉద్దేశ్యం కొత్తది కాదు. దీనిని బోధించని మతం ప్రపంచంలోలేదు. దీనిలోని కొత్త అంశం, మనుష్యుల ఆత్మనిగ్రహం (రూసో సోషల్ కాంట్రాక్ట్‌లో చెప్పినట్లు) ద్వారా కాక, నిత్యం పెరుగుతున్న వారి అవసరాలను, నిరంతరం పెరిగే సంపదమూలంగా తీర్చడంద్వారానే ఈ లక్ష్యాన్ని సాధించవచ్చుననే నమ్మకం మార్క్సుచేత "యుటోపియన్" అని పిలువబడిన సామ్యవాదపు ముఖ్యలక్షణం, మానవుల కోరికలకు అంతువుండదనీ, వాటిని నిగ్రహించుకోవడం సమ సమాజపు నిర్మాణానికి ముఖ్యమైన ఆవశ్యకత అనే విశ్వాసం రాజకీయంగా చూస్తే దీనిలో ఉన్న చిక్కు ఇది చాలా కొద్దిమందికే నచ్చడం. మార్క్సిస్టు, "శాస్త్రీయ" సామ్యవాదం, మానవ ప్రకృతికీ, ఆదర్శానికి మధ్య కలిగే ఈ వైరుధ్యాన్ని, అపరిమితమైన సంపదను ఉత్పన్నం చేయటంద్వారా నిర్మూలించగలమని చెప్తుంది. మానవుల కోరికలను పూర్తిగా తీర్చగల ఆర్థిక వ్యవస్థను నిర్మించడంవల్ల, అవి సమాజాన్ని ప్రభావితం చేసే శక్తులుగా పని చేయడం మానివేస్తాయి.

ఈ నమ్మకానికి మూలం, ఆధునిక విజ్ఞాన శాస్త్రాలు—సాంఘిక శాస్త్రాలు, ముఖ్యంగా ఆర్థిక శాస్త్ర సహాయంతో—ప్రకృతిమీద (మానవ ప్రకృతిమీద కూడా) క్రమంగా కాని నిశ్చయంగా నియంత్రను సాధింపచేస్తాయనే గాఢ విశ్వాసం. ఈ నియంత్రణ మూలంగా పూర్వం మానవ స్థితికి సహజం అనుకున్న పరిమితులను అధిగమించగలమనే నమ్మకం. దీనిని ఆచరణలో పెట్టడానికి ఉండే ప్రతిబంధకం సమాజంలో అధిక సంఖ్యాకులైన స్త్రీ పురుషులు స్వయం నిగ్రహం అమలు చేయలేనట్లే, సమాజ శాస్త్రాన్ని అర్థం చేసుకోవడంగాని, దానికి అనుగుణమైన చైతన్యాన్ని తమలో పెంపొందించుకోవడం చేయలేకపోవడం. కనుక సామాన్య ప్రజలలో ఈ ఆత్మపరివర్తన తీసుకురావడానికి వీరుపయోగించే పద్ధతులు శాస్త్రీయంగా—వీటినే నీతిలోనమ్మకమున్నవారు మేరీ విల్లియన్ అంటారు—ఉండవలసి వుంటాయి. ఇవి ప్రజలను మార్పు తీసుకురావలసిన వస్తువుగా పరిగణిస్తాయి. వీటిద్వారా ప్రజలు క్రమంగా తమ చరిత్రను తామే సృష్టించుకునే స్థితికి రాగలుగుతారు.

మైకేల్ పోలాన్యి కాల్పనికతత్త్వంలో నీతిమీద అభినివేశంతో, మానవుని స్థితిగురించి, అతని చరిత్ర గురించిన "శాస్త్రీయ" దృక్పథం జోడించబడడాన్ని "విపరీత నీతి" అని వర్ణించారు. నీతియందుండే ఈ అభినివేశం "శాస్త్రీయ" సామ్య

వాదంయొక్క నిజాయితీని ధృఢపరచగా, ఆ శాస్త్రీయత దానిని అమలు పరచడంలో ఉపయోగించబడే ప్రతి అవినీతిని సమర్థిస్తుంది. ఈ విధమైన జతపరచడం పూర్వం మతోద్యమాలలోనే ఉండేది. 19, 20 శతాబ్దాలలో ఇది ''ఇక్కడే, ఇప్పుడే'' మానవ స్థితిలో మార్పు రావాలనే రాజకీయ, సాంఘిక ఉద్యమాలకు సంక్రమించింది.

ఇటువంటి ఉద్యమాలు మేధావులకు నచ్చుతాయనడం స్పష్టం. మేధావులుగా వీరు వీటికి నాయకత్వం వహించే శిష్టవర్గంలో సభ్యులుగా ఉండడానికి తగినవారు. ఈవిధంగా తమలోని అధికారం, శక్తి, కావాలనే సహజ ప్రవృత్తికి రూపం ఇవ్వగలరు. ఇంతేకాకుండా, ఒక ఆదర్శాన్ని అమలుపరిచే సందర్భంలో ఈ విధంగా ప్రవర్తించడం వల్ల, అందుకు వ్యతిరేకంగా ఉన్నట్లు కనిపించినా, తాము ప్రజల ''నిజమైన'' క్షేమంకోసం నిరపేక్షంగా పాటుపడుతున్నామనుకోవచ్చు.

కాని చివరికి యుటోపియన్ ఆదర్శాలకంటె ఎప్పుడు యాధార్థ్యానిదే పైచెయ్యి అవుతుంది. సామ్యవాద వ్యవస్థలో మేధావులకు నైరాశ్యము, భేదాభిప్రాయము, ప్రవాసము, నిశ్శబ్దము తప్పవు. రాజకీయాల్లో లక్ష్యాలు, వాటిని సాధించడానికి ఉపయోగించే విధానాల్ని నిర్ణయిస్తాయి. సామ్యవాద వ్యవస్థలో ఇవి ఎప్పుడు బలాత్కారాన్ని ఉపయోగించే పాలనాయంత్రాంగం రూపంలోఉంటాయి. ఇది సామ్యవాద ఆదర్శాలను తన మూలధర్మంగా చూపించినా ఆచరణలో వాటిని నిర్లక్ష్యంగా తోసివేస్తుంది. ప్రస్తుత కాలంలో మనం ముఖ్యంగా గమనించే విషయం ''సామ్యవాద'' రాజ్యాలు సామ్యవాద మేధావులను సృష్టించలేక పోవడమేకాక, అటువంటి వారిని సహించలేకపోవడం. సామ్యవాద మేధావుల్ని మనం ఆక్స్‌ఫర్డ్‌లోనో, బెర్లిన్‌లోనో, పారిస్‌లోనో, రోమ్‌లోనో కలుసుకోగలం. కాని మాస్కోకో, బుకారెస్టుకో, బెల్గ్రేడ్‌కో, హవానాకో వెళ్తే ప్రయోజనం ఉండదు. ఆధునిక ప్రపంచాన్ని సోషలిజంవైపుకి మళ్లించడంలో ముఖ్యపాత్ర వహించిన మేధావులకు అది ఊసరక్షేత్రం అయింది.

మనం సామ్యవాదం అని పిలిచే కాల్పనికత్వ హేతువాదాలతో కూడిన తిరుగుబాటుకాక ఇంకొకరకమైన తిరుగుబాటు కూడా ఉన్నది. అది హేతువాదానికి ఎదురుతిరిగే కాల్పనికత్వము. చివరికి రెండిటిలో ఇదే ముఖ్యమైన తిరుగుబాటుగా పరిణమించవచ్చు. ఇది రాజకీయంగాకంటె సాంస్కృతిక రూపంలో ఎక్కువగా కనబడుతుంది. లయొనల్ ట్రిల్లింగ్ ప్రతికూల సంస్కృతి గురించి ప్రస్తావించినప్పుడు ఆయన మనస్సులో ఇదే ఉన్నది.

కాల్పనిక సాహిత్యంచేత ప్రేరణపొందిన ఈ తిరుగుబాటు ''బొహిమియా'' రూపంలో ఒక కొత్తరకమైన ''అంతఃప్రవాసానికి'' దారి తీసింది. పారిస్‌లో 19వ శతాబ్దపు 2వ, 3వ దశాబ్దాలలో, కొందరు యువతీయువకులు కొన్ని సమాజాలు ఏర్పరచుకున్నారు. 1960 లలో పుట్టిన ''ప్రతిసంస్కృతి''లో లక్షణాలన్నీ మాదక ద్రవ్యాలు, సెక్స్‌లో విశృంఖలత్వం. మగవారికి పొడుగు జుట్టు, ఆడవారికి పొట్టిజుట్టు, పనిచేసుకు బతికేవారి బట్టలు, ఆత్మహత్యలు—బూర్జువా వ్యవస్థనుంచి వేరుచేసేవి ఏవైనా ఇవి ప్రదర్శించేవి. ఒక శతాబ్దంపైగా అంతరమున్న ఈ రెండిటి మధ్యా మనకు వెంటనే తట్టే భేదము, ''బొహిమియా''లో సభ్యులవాలంటే ''కళ''ను సృష్టించాలి, కాని 1960 లలో వాటిని ''వినియోగిం''చేవారుగా ఉంటే చాలు. ఈ మార్పు రావడానికి ముందు బొహిమియా విలువలు,భావాలు బూర్జువా సమాజమంతా వ్యాపించవలసి వుంటుంది. ఈ మార్పును తీసుకువచ్చిన ''ఇంజను'' వాహనము వివిధ కళలలో వచ్చిన ''మోడర్నిస్ట్'' ఉద్యమం. ఇది 1850 తరువాతి శతాబ్దంలో అంతకు పూర్వం ప్రమాణంగా, ''అధికారం''లో ఉన్న కళల స్థానాన్ని క్రమంగా ఆక్రమించుకొంది.

ఈ ఉద్యమం చరిత్ర, అర్థము డేనియల్ బెల్‌చేత ''ది కల్చరల్ కాన్ట్రడిక్షన్స్ ఆఫ్ కాపిటలిజమ్'' (1976) అనే గ్రంథంలో విపులంగా వర్ణించబడ్డాయి. అద్భుతంగా విశ్లేషించబడ్డాయి. ప్రస్తుతానికి, ఈ ఉద్యమాలు కేవలం కళారంగంలో కొత్త పద్ధతులు తీసుకువచ్చినవికాక, బూర్జువా సమాజంమీద తిరుగుబాటు చేసే ఒకవిధమైన మతోద్యమాల వంటివని అర్థం చేసుకుంటే చాలు. ఈ ఉద్యమపు నిర్మాణంలోనే యూదు, క్రైస్తవ మతాలలోని gnostic - radical మతశాఖల పోలికలు కనబడతాయి. వీటిలోలాగే దీనిలోకూడా అలౌకికము, ముక్తినిచ్చేది అయిన జ్ఞానము (gnosis) కల శిష్టవర్గము (మేధావులే) ఉంటుంది. అదేవిధంగా ఈ జ్ఞానాన్ని ఉపయోగించి బయటివారిని ఈ ''మతం'' లోకి మార్చే విమర్శకులు ఉంటారు. ఈ పరిధికి అవతల ఈ విశ్వాసాలమీద సానుభూతి కలవారు (Fellow-Travellers) ఉంటారు. వీరు ముఖ్యంగా మోడర్నిస్ట్ కళలను వినియోగించేవారు. వీరే ఈ ఉద్యమాన్ని బయటి సమాజంలో ప్రచారానికి తెచ్చి, సమర్థించి, ప్రజాదరం పొందేటట్లు చేస్తారు.

ఈ సామ్యాన్ని మనం ఇంకా ముందుకు తీసుకుపోవచ్చు. దీని లక్షణాల్లో మనకు వెంటనే తట్టేది: ఈ మోడర్నిస్ట్ కళలు సౌందర్యాన్ని సృష్టిస్తున్నామని చెప్పవు; ఇప్పటి మానవ స్థితిని గురించి నిజం చెప్తామని అంటాయి. సౌందర్యం ప్రజల అభిరుచిద్వారా వ్యక్తపరచబడే కళాసాంప్రదాయంచేత నిర్వచించబడుతుంది. కాని మోడర్నిస్ట్ కళాకారుడు, సత్యం అభిరుచికి అనుగుణంగా ఉండదు కనుక, ప్రజల అభిరుచికిగల ఆధిపత్యాన్ని తోసిపుచ్చుతాడు. సత్యం ఎప్పుడూ ఇప్పటి పరిస్థితిని అభిశంసిస్తుంది. కాని నిజమైన ''జ్ఞానం''చేత పరివర్తన చెందినవారి ఆత్మ(ఇది ఇప్పుడు వ్యక్తిత్వమని పిలవబడుతోంది) కు ముక్తి లభిస్తుంది. ఇంతేకాక యిప్పటి కళాకారుడు తన కళాసృష్టిలో తనే కేంద్ర వస్తువుగా ఉంటాడు. తన ''రచన''కు తనే నాయకుడు, ఆత్మ బలిదానంచేత మనందరికీ ''విమోచన'' కలిగించేవాడు. తన అతీతత్వంతో మన జీవితాలకు ముక్తినిచ్చి సార్థకం చెయ్యగలవాడు. వార్ధక్యంలో, సంపదలతో, సుఖ సంతోషాలతో జీవించే కళాకారుడు— కవి, శిల్పి, చిత్రకారుడు, సంగీతకారుడు — ఇప్పుడు మనకు తన కళాధర్మానికి ద్రోహం చేసినవాడుగా కనబడుతాడు. మనకు కళాకారుడు చిన్నతనంలోనే బాధలకు గురియై, చనిపోవడం యుక్తమనిపిస్తుంది. ఈ కాలపు కళా

కారులలోని అసంఖ్యాకమైన ఆత్మహత్యలు మన పూర్వులకు ఆశ్చర్యాన్ని కలిగించి వుండేవి. వారు, కళాకారులు కూడా తక్కిన లౌకిక జనులలాగే సంపదను, కీర్తిని కోరుకుంటారని అనుకునేవారు.

ఆధునిక సంస్కృతిలో విమర్శకు, విమర్శకులకు ఉండే అసాధారణ ప్రాముఖ్యంకూడా మన పూర్వులకు అర్థమయి వుండేదికాదు. ప్రామాణికమైన విమర్శ గ్రంథాలను తీసుకుంటే, 1800 కు పూర్వం వ్రాయబడిన సాహిత్య విమర్శలు కనబడవు. తాత్త్విక చింతతో వ్రాయబడిన సాహిత్య వ్యాసాలు మాత్రం కనబడతాయి. షేక్స్పియర్‌కు అర్థంచెప్పడానికి ఆయన సమకాలికు డెవ్వడూలేడు. గ్రీకు నాటక కర్తలకూ, డాంటే, రేసిన్‌లకూ లేరు. కాని మనం మన కాలపు కళాకారులను అర్థం చేసుకొనడానికి విమర్శకుల సహాయం కోరుకోవడమే కాకుండా, పూర్వకాలపు వారిని అర్థం చేసుకోవడానికి కూడా వీరి సహాయాన్ని అర్థిస్తున్నాము. ఈ పరిస్థితికి కారణం మనం ఇప్పుడు కళలలో, కళాకారులలో మనను గురించి, మానవ స్థితిని గురించిన విమోచన నిచ్చే జ్ఞానం కోసం చూస్తున్నాము. పూర్వం ఈ జ్ఞానం మతం ద్వారా లభిస్తుందని ఎదురుచూసేవారు.

కళారంగంలో ''మోడర్నిస్ట్'' ఉద్యమం క్రమంగా బలం పుంజుకుంది. ఇది జయం సాధించిందనడానికి మొదటి గుర్తు. బూర్జువా సమాజం క్రమంగా తనలో రెండు సంస్కృతు లుండటాన్ని అంగీకరించడము—మోడర్నిస్ట్ అవాంత్–గార్డ్ సంస్కృతీ, అధిక సంఖ్యాకుల ప్రజా సంస్కృతి. మోడర్నిజమ్ తనకు తానే ''అవాంత్–గార్డ్'' అని పిలుచుకోవడం, దాని స్వభావాన్ని విశదపరుస్తుంది. ఇది సైన్యానికీ, యుద్ధానికి సంబంధించిన మాట. అవాంత్–గార్డ్ అంటే తక్కిన సైన్యం కంటె ముందు వెళ్లి శత్రు సైన్యంమీద దాడిచేసే సైనిక దళం అని అర్థం. సెయింట్–సైమన్ తన యుటోపియన్ –సామ్యవాద ఉద్యమాన్ని, బూర్జువా సమాజంమీద దాడి జరిపే దానినిగా వర్ణించడానికి ఈ మాటను ఉపయోగించాడు. తరువాత మోడర్నిస్టులు ఈ మాటను స్వంతం చేసుకున్నారు. అవాంత్–గార్డ్ ఉద్యమం మొదటి నుంచి బూర్జువా సమాజంపట్ల తనకు శత్రుభావం ఉన్నదనే విషయం స్పష్టంగా తెలుసుకునే ఉన్నది. 1914 వరకు ఈ శత్రుత్వం మేధావులను, కళాకారులను కాల్పనిక తత్త్వంతో కూడిన వామ పక్షానికే కాదు, దక్షిణ పక్షానికి కూడా నడిపించగలిగేది. కాని ఈ శత్రుభావం మాత్రం స్థిరమైనది. ఇది, ముందు గమనించినట్లు, చరిత్రలో అపూర్వమైనది.

బూర్జువా సమాజంలోని ''ప్రజా సంస్కృతి'' కూడా అపూర్వమైనదే. కాని ఈ విషయంలోని అపూర్వతనికూడా మనం సాన్నిహిత్యం మూలాన గుర్తించలేకపోతున్నాము. చరిత్రలో ఈ విధంగా పరస్పర ప్రతిబద్ధంగా ఉన్న ''ఉన్నతసంస్కృతి'', ''హీన సంస్కృతి'' అనే రెండు సంస్కృతులున్న ఘట్టం ఇంకొకటిలేదు. ఏ సంస్కృతికైనా నిశితంగా ఉండేది, సామాన్యంగా ఉండేది అనే రెండు తలాలు వుండటం మనకు పరిచయమైన విషయమే కాని ఈ రెండిటిలోని మౌలికమైన విలువలు ఒకటే వీటి రెండిటి మధ్య విద్యా ప్రమాణంలో భేదం మాత్రమే ఉంది. నిశితంగా వ్యక్తం చేయబడినవి సామాన్యులకు అఘాతంగా ఉండేవి కాదు. అదే విధంగా సామాన్యతలంలో చెప్పబడినవి విద్యాధికులలో జుగుప్స కలిగించేది కాదు. నిజమైన కళాకారుడు గాని, రచయిత గాని తన సృష్టిలో ఈ రెండూ వ్యక్తం చేయడమే అతని గొప్పతనానికి గుర్తుగా ఉండేది. గ్రీకు దుఃఖాంత నాటకాలను ఏథెన్స్‌లో ప్రజలందరిముందు ప్రదర్శించేవారు. డాంటే డివైన్ కామెడీని ఫ్లారెన్‌లో వీధులలో అన్ని రకాల ప్రజలు కలిసి వినేవారు. షేక్స్పియర్ నాటకాలను ఇటువంటి అన్ని వర్గాల ప్రజల ముందర ప్రదర్శించేవారు.

1870 ప్రాంతం తరువాత బూర్జువా సమాజపు ప్రజా సంస్కృతి విద్యావంతులచేత హేయమైనదిగా తిరస్కార భావంతో కేవలం సహించదగినదిగా చూడబడింది. మేధావులను, సామాన్యులను సమానంగా ఆకర్షించిన రిచర్డ్‌సన్, జాన్ ఆస్టిన్, వాల్టర్ స్కాట్, డికెన్స్‌ల యుగం ముగిసిపోయింది. ఆ కాలంలో హైబ్రో, లోబ్రో అనే విభాగం ఉండేది కాదు. ఉదాత్తమైన కళలను సృష్టించడానికి కావలసిన శక్తిని హైబ్రో మోడర్నిస్ట్ ఉద్యమం లీనం చేసుకుంది. కాగా ప్రజా సంస్కృతి దాదాపు పూర్తిగా ధనార్జనకోసం బూర్జువా ఇతివృత్తాలను యాంత్రికంగా పునశ్చరణ చేసే స్థితికి దిగజారిపోయింది.

ప్రేమలు, సాహసాలు ఇతివృత్తంగా గల ఈ సాహిత్యంలో ''సుఖాంతము''నిలిచి వుండడమే కాకుండా ప్రామాణికమైనదికూడా అయింది. ఒకవేళ ఎప్పుడైనా ఒకసారి దుఃఖాంతం ప్రవేశపెట్టినా అది ఏదో ''పాపం''చేయడానికి (ఉ॥ వ్యభిచారం) ఫలంగా చిత్రింపబడి పశ్చాత్తాపంతో ముగుస్తుంది. పరిగణనీయమైన సాహిత్యంలో సుఖాంతం 20వ శతాబ్దంలో దాదాపు పూర్తిగా నిషిద్ధమైనది. ఈ సందర్భంలో ఈ మొదటిరకం సాహిత్యం ఎక్కువగా స్త్రీలచేత ఉపయోగించబడుతోందనే విషయం గుర్తుంచుకోవాలి. బూర్జువా సమాజపు వ్యవస్థను (గృహస్థుకు ప్రాధాన్యం ఇచ్చేదని జ్ఞాపకం ఉంచుకోవాలి) బూర్జువా సమాజపు వ్యవస్థను (గృహస్థుకు ప్రాధాన్యం ఇచ్చేదని గుర్తుంచుకోవాలి) స్త్రీలే పురుషుల కంటె ఎక్కువ బలపరుస్తారని గుర్తుంచుకోవాలి. అందుచేతే గత రెండు దశాబ్దాలుగా స్త్రీల భావాలను బూర్జువా విలువలకు వ్యతిరేకంగా మారుస్తున్న ''విమన్స్ లిబ్'' ఉద్యమం ఎంతో ప్రాముఖ్యం గల సంఘటన.

నూరేళ్లబట్టీ కళలలో మోడర్నిస్టు ఉద్యమం ప్రజా సంస్కృతి స్థాయిని తగ్గించివేసి అభివృద్ధిని సాధించింది. జీవితానికి అర్థం (లేకపోతే ఈ ప్రపంచం గురించిన జ్ఞానం) తెలుసుకోవాలనుకునే యువతీ యువకులకు ఉపయోగంలో ఉన్న కళలు ఈ ఉద్యమానికి చెందినవే కదా! మన కాలంలో ప్రాచుర్యంలోకి వచ్చిన లిబరల్ కాపిటలిజమ్ కూడా మోడర్నిస్ట్ ఉద్యమం నైతిక, ఆధ్యాత్మిక ఆధిపత్యం కోసం చేసే పోరాటంలో సహాయపడింది. ఈ సహాయం మూడు విధాలుగా ఉన్నది.

ఒకటి, కాపిటలిస్టు వ్యవస్థ మూలంగా పుష్కలంగా ధనం సంపాదించకలగడంచేత కొందరు (ఇంకా తరచుగా వారి పిల్లలు)

ధన సంపాదనలో తమ శక్తిని వ్యయం చెయ్యడం మాని. జీవితం లోని ''ఉన్నత'' విషయాలను గురించి ఆలోచించడానికి వీలు కలిగింది. బూర్జువాకు ప్రతికూలంగా ఉన్న కళలు, కల్లోలితమైన, అస్పష్టమైన ఆసంతృప్తితో అలజడి చెందిన బూర్జువా వర్గాల ధనంచేత పోషించబడడం 20వ శ॥లో సాధారణ విషయమైనది.

రెండవది, వాణిజ్య సమాజానికి, దాని వ్యాపార నాగరికతకు నైజమైన లౌకిక హేతువాదం (వీటిని మార్స్ వెబర్, జోసఫ్ షూమ్ పీటర్ చక్కగా విశదీకరించారు) కేవలం సాంప్రదాయంవల్ల వచ్చిన నమ్మకాలను, కర్తవ్యాలను, అభిప్రాయాలను అసమర్థనీయాలుగా చేసింది. ఉద్దేశ్యపూర్వకంగా తయారయినవయినా, తాత్కాలిక ఇష్టాలనుబట్టి వచ్చినవైనా ''కొత్తవి'' ఎప్పుడూ ''పాత'' వాటి కంటె మేలయినవే అనే భావం ప్రబలింది. ఈపాత సాంప్రదాయాలు, అభిప్రాయాలు తరాల పరస్పర ప్రభావంవల్ల ''నిర్హేతుకం''గా వచ్చాయని అభిప్రాయం కలిగింది. ఈ విధమైన ఆలోచన సామ్యవాదుల ''యోచనాబద్ధమైన''సమాజపు ఆదర్శాన్ని న్యాయసమ్మతం చేసింది. కాని ఈ అభిప్రాయమే సాంస్కృతిక, ఆధ్యాత్మిక విషయాలలో, అరాజకమైన, నీతికి ప్రాధాన్యంలేని ఎక్స్ప్రెషనిస్టు ప్రవృత్తులను కూడా సమర్థించింది.

మూడవది కళాశాల విద్యకు — ముఖ్యంగా 2వ ప్రపంచ యుద్ధం తరవాత — వచ్చిన అఖండ వ్యాప్తి. దీనివలన మోడర్నిస్ట్ అభిరుచులకీ, అభిప్రాయాలకీ విద్యార్థులలోనూ, ఉపాధ్యాయుల లోనూ కూడా వ్యవస్థా రూపమైన ఆశ్రయం లభించింది. లయొనల్ ట్రిల్లింగ్ **Beyond Culture** లో ప్రారంభంలో ఉపాధ్యాయులలో తమకు నచ్చిన, తమను ఎక్కువగా కదిలించిన పుస్తకాలను బోధించే స్వేచ్ఛ వచ్చిందనే ఉత్సాహాన్ని క్రమంగా విద్యార్థులలో ఏ విధంగా ఒక రకమైన చవక చేయబడిన మోడర్నిజమ్ మూక ఉమ్మడి ''ప్రతి సంస్కృతి'' రూపంలో వ్యాపించి, వారిని నకిలీ ''బొహీమియన్'' జీవన సరళికి మార్చిందీ, ఉద్వేగంతో వర్ణించారు.

దీనితో సమకాలీనంగానే, ఇంకా బాహాటంగానే సాంఘిక శాస్త్రాలు బూర్జువా ప్రతికూలమైన సామ్యవాద సాంప్రదాయాలను జీర్ణించుకున్నాయి. వీటిలో సమాజ అనుశీలన అంటే క్రమంగా సమాజ నిర్మాణం గురించిన నిజాలు తెలిసిన శిష్టవర్గంచేత సమాజంలో మార్పు ఏవిధంగా తీసుకురావడము అనే అర్థం స్థిరపడింది· ఆర్థికశాస్త్రం—కష్టాలు తప్పని ఈ ప్రపంచంలో ఉన్న సంపదను సాధ్యమైనంత మెరుగుగా పంచే విధాలను ఆలోచించేది—ఈ పరిణామాన్ని చాలాకాలం ప్రతిఘటించింది. కాని ద్రవ్యవిధానము, పన్నుల పంపకం విధానాలలో ప్రభుత్వ అజమాయిషీద్వారా శాశ్వతమైన సమృద్ధిని సాధించవచ్చుననే కెయినీసియన్ విప్లవం క్రమేణా దీనిని కూడా ఇతర సాంఘిక శాస్త్రాలతో చేర్చింది.

ఈవిధంగా యుటోపియన్ —, హేతువాదము, యుటోపియన్ - కాల్పనికత్వము ప్రతికూల సంస్కృతులుగా, ఆధునిక మానవుడి చైతన్యంమీద, స్పృహమీద ఆధిపత్యం నెలకొల్పుకున్నాయి.

కాని ఇటువంటి విజయాలకుతోడుగా ఎప్పుడూ వైఫల్యాలు, నిరాశలు తప్పనిసరిగా ఉంటాయి. సామ్యవాద యాథార్థ్యం నైరాశ్యం కలిగించినకొద్దీ, సామ్యవాద తత్త్వము, ఆలోచనలు శకలాలయిపోయి, ఎన్నో శాఖలు ఏర్పడ్డాయి. వీటిలో ప్రతి ఒక్కటీ కూడా యుటోపియన్ ఆదర్శాన్ని నిలబెట్టడానికీ, సామ్యవాద యాథార్థ్యపు వైఫల్యానికి కారణాన్ని చెప్పడానికి ప్రయత్నిస్తుంది. ఇది మనకు మొదటి రెండు శతాబ్దాలలో క్రైస్తవమత పరిస్థితిని జ్ఞాపకం చేస్తుంది కాని ఒక భేదమున్నది. క్రైస్తవమతం, పారలౌకికమైన ఆశమీద, వర్ణాతీతమైన విశ్వాసంమీద ఆధారపడుతుంది. కనుక అది నిజంగా యుటోపియన్ తత్త్వంకాదు. అందుచేత అప్పటి చర్చి నాయకులు ప్రజలు సమకాలీన ప్రపంచంమీద చేసిన తిరుగుబాటును సజీవమైన ధర్మకాండగా మార్పగలిగారు. ఇది దానిని నమ్మినవారికి, ధర్మబద్ధంగా జీవించడం నేర్పింది. అంటే దీనికంటె మేలైన ఇంకొక లోకానికి వెళ్లడానికి నిరీక్షిస్తూనే, ఈ లోకంలో సార్థకంగా జీవించడం నేర్పుతుంది. సామ్యవాద తత్త్వంలో ఈ పారలౌకిక విశ్వాసం లేకపోవడంవల్ల ఈ లోకంలోని యాథార్థ్యాలు సామ్యవాదులకు నిరంతరం, నిరాశలను కలిగిస్తూనే ఉంటాయి. సామ్యవాదం అధికారంలో ఉన్న ఏ దేశంలోనూ—ఇప్పుడు ఇవి ఎన్నో వున్నాయి—అందులో వ్యక్తులు అనుసరించతగిన సామ్యవాదసుగుణాలు ఏమిటో నిర్వచించబడలేకపోవడం మార్క్సిస్టులు చెప్పేటట్లు ''కాకతాళీయం కాదు''. పారలౌకిక మతాలే ఇప్పటి లౌకిక మతాలకంటె, ఈ లోకంలో జీవించడానికి సాధికారంగా మార్గం చూపించేవి అనేది నిజం..

కళారంగాలలోని మోడర్నిజమ్‌కు ఆధారమైన యుటోపియన్—కాల్పనికత్వం ఇటువంటి స్థితిలోనే ఉన్నది. కాని ఒక భేదం ఉన్నది. ఇది లౌకిక పరిధిలోనే అతీతత్వాన్ని కోరుతోంది. 20వ శ॥ కళ అంతా ఈ ప్రయత్నము మన బూర్జువా యుగపు బూర్జువా ప్రతికూల సంస్కృతిలోని గాఢమైన ఆధ్యాత్మికతను పుట్టిస్తుంది. కాని చివరికి తనలోని విప్రతి పత్తిని మార్చుకోలేదు.

ఆత్మను గురించి లోతుగా శోధించినకొద్దీ, ఐహికాతీతమయిన ప్రమాణాలు ఏవీ లేకుండావుంటే, అసలు ఏమీలేదు అని స్పష్టమవుతుంది. అప్పుడు శూన్యమే మానవస్థితియొక్క సత్యం అనే తత్త్వాన్ని ప్రతిపాదించవచ్చు. కాని ఇది కూడ స్వయం—వ్యతిరేకంగా వుంటుంది. శూన్యమే చరమ సత్యమైతే, పుస్తకాలు, పద్యాలు, చిత్రాలు, సంగీతము అన్నీ సత్యాన్ని వ్యక్తపరచేవి కాక తప్పించుకునేవి అవుతాయి. యాథార్థ్యాన్ని గురించిన ఈ దర్శనానికి ఆత్మహత్య ఒక్కటే సరియైన సమాధానం. (దీనిని డాస్టోవిస్కీ చాలాకాలం కిందటే గుర్తించారు.) 20వ శ॥లో ఎంతో మంది కళాకారులకు ఇదే గతి అయింది. వారు నిరాశాపూరితమైన తమ దర్శనానికి తమనే బలిచేసుకున్న వీరులు. ఈ చివరి అడుగు వేయనివారు ఇంతకుముందు చెప్పిన ''గ్లాని'' పొందుతారు. కనీసం బొదలియన్ కాలంనుంచి ''మానవజీవితంలో విసుగుదల'' అనేది వస్తువుగా అన్ని కళల్లోను కనపడుతుంది.

ఆధునిక యుగంలోని సంస్కృతికీ, సంస్కృతి వాయకులకు ఆత్మనిర్మూలనంతోను, గ్లానితోను ఉన్న అనుబంధంవంటిది చరిత్రలో ఎప్పుడు, ఎక్కడా కనపడదు. మనం ఈ స్థితికి అలవాటు పడిపోవడంచేత, మనలో చాలామంది ఇది సహజమైనదే అను కుంటాము. కాని ఇది నిజానికి అసహజమైనది. ఎక్కువకాలం నిలువలేనిది. తత్త్వశాస్త్రం మరణించడానికి ఆయత్తమవడమని చెప్పడంలో కొంత సబబుంది. ప్లేటో ఈవిధంగా చెప్పినప్పుడు ఏ కాలంలోనైనా చాలా కొద్దిమందే తత్వజ్ఞులుంటారనే భావించారు. కాని కళలన్నీ ఎప్పుడూ—మరణం వస్తువుగా ఉన్నప్పుడు కూడా—జీవించడమే సారభూతమైన విషయంగా ఉంటాయి. అర్థం లేనిదనిపించే మన జీవితానికి లోకాతీత దృక్పథంతో అర్థం కల్పించే మతం స్థానాన్ని ఈ దృక్పథంలేని కళలు ఆక్రమించినప్పుడే ఈ అసంగతమైన స్థితి కలుగుతుంది.

ఇంతేకాకుండా, దీర్ఘకాలికంగా చూస్తే, యుటోపియన్ హేతువాదము, యుటోపియన్ కాల్పనికత్వము, రెండూ బూర్జువా సమాజానికి ప్రతికూలంగా ఉండటమే కాకుండా ఆ రెండింటి మధ్య కూడా వైరుధ్యముంటుంది.

సామ్యవాద దేశాలన్నిటిలోను—అవి ఏ రకానివైనా—కళలలో మోడర్నిజమ్ అణిచివేయబడుతుంది. ఎందుచేతనంటే, మనం అనుకున్నట్లు, మోడర్నిజమ్ శూన్యత్వాన్ని, నీతి రహితమైన ప్రవాసం కోసమైన ప్రయత్నాన్ని పుట్టిస్తుంది. ఇవి ఏ విధమైన వ్యవస్థ నయినా కూలదోయడానికే పనిచేస్తాయి. సామ్యవాదానికి మానవుని ఆత్మ జిజ్ఞాసను సంతృప్తిపరిచే దర్శనం ఇవ్వగలిగేశక్తి లేకపోవడం చేత, ఈ అణిచివేత ఎప్పుడూ పూర్తిగా జయప్రదమవదు.

ఫ్రాంజ్‌కాఫ్కాను చదివితే బూర్జువా యాధార్థ్యంమీద విరక్తి కలిగినట్లే సామ్యవాద యాథార్థ్యంమీద కూడా కలుగుతుందని తేలిపోయింది. కాని దీనికి ప్రతిగా సామ్యవాద సమాజపు రిచర్డ్‌సన్, జేన్‌ఆస్టిన్, డికెన్స్‌లు ఎవరూలేరు. సామ్యవాద సమాజానికి చెందిన ''క్లాసికల్'' రచయితలు, కళాకారులు ఎవరు? ఎవరూలేరు. కనుకనే సామ్యవాద సమాజంలోని యువత, 20వ శ॥పు మోడర్నిజంనో ప్రతి—సంస్కృతి రూపంలోవున్న దాని చవకబారు అనుకరణనో ఆశ్రయిస్తుంది. కాఫ్కా, పికాసో, జీన్సు, రాక్ అండ్ రోల్, మేధావులను, యువతను అధికారవ్యవస్థకు వ్యతిరేకంగా ఏకంచేసే అంతఃశత్రువులుగా పరిణమించవచ్చు. మోడర్నిజమ్, సామ్యవాదము, రెండూ చివరికి జిజ్ఞాసకు తోడుపడలేని మార్గాలే కాకుండా, పరస్పర వ్యతిరేకమైనవికూడా.

ఇదే కాలంలో లిబరల్ కాపిటలిజమ్ సజీవంగా ఉన్నది, కుంటివడకతోనన్నా ముందుకు సాగుతోంది. ఇందుకు కారణం మార్కెట్ ఎకానమీ పనిచెయ్యడమే. కాపిటలిజమ్ ఆర్థికాభివృద్ధిని ప్రోత్సహిస్తుంది. ఇందులో ఇంతకుపూర్వ మెప్పుడూలేనంత వ్యక్తి స్వాతంత్ర్యము ననుభవిస్తూ ఏ వ్యక్తైనా తన స్థితిని మెరుగు పరచుకోవచ్చు. కాని ఈ జీవితం ఆనందరహితమైనది.

ఓల్డ్ టెస్టామెంట్, కాపిటలిస్ట్ వ్యవస్థలో వ్యక్తికి,మానవ జీవితానికి ఐహికాతీతమైన అర్థం చెప్పడంద్వారా జీవితంలోని సమస్యలను సంతోషంతోనో, విచారంతోనో ఎదుర్కోవడానికి సహాయపడే నీతి నియమావళిని అందిస్తుంది. క్రైస్తవమతం ఓల్డ్‌టెస్టామెంట్‌ను దానిలో వుండే టెన్ కమెండ్‌మెంట్స్ కోసము, అందులో భగవంతుడు ఈ ప్రపంచమును సృష్టించాడనీ, దాని సార్థకతను ధ్రువపరిచాడనీ వుండడంచేత, మానవుడు తన జాతిని వృద్ధిపరచుకోవడంలో అర్థంవున్నదని చెప్పడంచేత తన ధర్మసంహితలో చేర్చుకోవలసి వచ్చింది. అదేవిధంగా లిబరల్ కాపిటలిజమ్‌లో, వ్యక్తికి కొత్తగా సంపాదించుకొన్న స్వాతంత్ర్యాలను ఉపయోగించుకోవడంలోని నీతి, అవినీతులను నిర్ణయించుకోవడానికి, జూడో—క్రిస్టియన్ సాంప్రదాయాలు అవసరమయ్యాయి. కాని యుటోపియన్—హేతువాదం, యుటోపియన్ కాల్పనికత్వం రూపాలలో ఉన్న ''ప్రతికూల సంస్కృతి'' ఈ జూడో—క్రిస్టియన్ సాంప్రదాయాన్ని ఈ కాలానికి అన్వయించనివిగా చేసింది. ఇప్పుడు చర్చిలు — అవి కూడా ఒక రకమైన ప్రైవేట్ సంస్థలుగా ఉన్నాయి—ప్రజల ఆదరాన్ని, సమ్మతిని పూర్తిగా కోల్పోయి తమ విరోధులతో పోరాడే శక్తిని పోగొట్టుకున్నాయి.

బూర్జువా సమాజపు మూలతత్త్వాన్ని కొంతవరకైనా ఆరోగ్యవంతం చేయడానికి వీలువుందా?

లేదు. చరిత్రగతిని వెనకకి తిప్పలేమనే జవాబు వెంటనే తట్టుతుంది. కాని ఈ సమాధానమే, సెయింట్‌సైమన్, హెగెల్, మార్క్సులు రూపొందించిన కాల్పనిక హేతువాదాలతో కూడిన చారిత్రకావగాహనమంచి వచ్చినది. కాని నిజానికి మానవచరిత్ర, ఒక దృష్టితో చదివితే,సందిగ్ధ దశలలో మానవులు ఉద్దేశ్యపూర్వకంగా వెనుకకు మళ్ళిన ఘట్టాలతో నిండివున్నట్లు కనబడుతుంది. రిఫార్మేషన్ ఉద్యమం, సరిగ్గ అర్థం చేసుకుంటే, ఇటువంటిదే అని తెలుస్తుంది. ప్రవాసం తరువాత టాల్‌కుడ్ క్రోడీకరణ యూదుల చరిత్రలో ఇటువంటిదే. మనం తాత్త్విక, ఆధ్యాత్మిక చరిత్రలో కొత్తది అనుకునేది, తరచుగా కొత్తపద్ధతిలో వెనకకు తిరగడమే. విజ్ఞానశాస్త్ర చరిత్ర రాసీభూతమైనది. దీనిలో పాత ''చూచే'' ''చేసే'' పద్ధతుల స్థానంలో కొత్తవి వస్తూవుంటాయి. కాని మత, సాంస్కృతిక చరిత్రలు ఈ విధంగా రాశీభూతంగా వుండవు. అందుచేతే మతాన్ని, సంస్కృతిని అనుశీలించాలంటే, వాటి పూర్వ చరిత్రనంతా అనుశీలించాలి. కాని శాస్త్రజ్ఞులు, విజ్ఞానం చెప్పేదానిని అర్థం చేసుకోవడానికి దాని చరిత్ర చదవ నవసరంలేదు.

కనుక, మనకా అవకాశం ఉన్నది· కాని మంచికో, చెడుకో ఆ ఒక్క అవకాశమేకాదు. మనం ఇప్పుడు కొంత నిశ్చయంగా చెప్ప గలిగింది లిబరల్ కేపిటలిజమ్ భవిష్యత్తు, జాతీయోత్పత్తి లెక్కల చేతకంటె, ఇప్పుడు ఏ విశ్వవిద్యాలయంలోనో చదువుతున్న తాత్త్వికుడి లేక జిజ్ఞాసువు అభిప్రాయాలు, ఆశయాలచేత రూపొందించబడుతుంది అని మాత్రమే. ఈ లెక్కలు అప్రధాన మైనవి కావు. కాని ఇవే అన్నింటికంటె అతి ముఖ్యమైనవి అనుకోవడం కేపిటలిజమ్‌మీద కేపిటలిజమ్ నాశనానికి దారితీసే వెఱ్ఱి వ్యామోహాన్ని వ్యక్తం చేస్తుంది. కేపిటలిజమ్‌కి ఆధారంగా వున్న నైతిక విలువలు ఇప్పుడు ప్రమాదంలో ఉన్నాయి. దాని ఆర్థిక వ్యవస్థ కాదు. ఇదే దీనికి ఉన్న సుగుణం. కాని దీనిని ఉద్ధరించడానికి ఇది ఒక్కటే చాలదు.

[''ఎన్‌కౌంటర్'' సౌజన్యంతో]

---

# స్వాగతము

## శ్రీ బులుసు వేంకటేశ్వరులు

శ్రీ రౌద్రీ! నవవర్షరాజ! కృప వి
చ్చేయంగదే నీ కిదే
శ్రీరమ్యంబగు స్వాగతంబు నిరత
క్షేమంబు మా కిమ్మయా!
దూరంబౌనటు చూచి యుద్ధభయమున్
దుర్మార్గ సందోహ దు
ర్భారంబున్ దొలఁగించి ప్రోవఁగదవే
వందింతు మెల్లప్పుడున్.

ప్రాతసంవత్సరంబుతోపాటు నిష్క్ర
మించుఁగావుత! దుర్భావ సంచయంబు
నూతనాబ్దంబుతోపాటు నూత్నభావ
సంచయంబున కగుత! సుస్వాగతంబు.

నవ జవ జీవంబులు ప్రజ
కవుఁగావుత! స్వార్థపరుల కవుఁగావుత భూ
ర్యవ మానపరంపర; శుభ
మవుఁగావుత తెలుఁగుతల్లి కత్యంతంబున్.

నిత్యనూతన మహోన్నత భావ వి
భాసుర నవవర్ష! స్వాగతంబు
దుర్మద దుర్భావ దురిత దూరీకృత
భాసుర నవవర్ష! స్వాగతంబు
అజ్ఞాన నాశక విజ్ఞాన సద్వ్యాప్తి
భాసుర నవవర్ష! స్వాగతంబు
బహు విధైశ్వర్య శుభ ప్రతిపాదక
భాసుర నవవర్ష! స్వాగతంబు

స్వాగతము నూత్నయుగకర్త! స్వాగతంబు
స్వాగతము నిత్య చైతన్య! స్వాగతంబు
స్వాగతము కాల సద్రూప! స్వాగతంబు
స్వాగతము రౌద్రి వర్ష! సుస్వాగతంబు.






# Pick PERNAD for packaging

When it comes to packaging, pick PERNAD. For all the reasons that'll make your decision the right one.

PERNAD has proven quality. Tough, all-weather-proof containers. No wonder, some of the top companies have come to rely on us to solve their packaging problems.

Our PACKAGING ADVISORY CELL gives you sound advice on all aspects of packaging. That means saving on cost. With an assurance that your goods will withstand the roughest road to any destination.

At PERNAD there's always a ready stock of raw materials like kraft paper, etc. So that you get prompt, no-delay deliveries.

All this, and more. At competitive prices, too! Now, isn't that reason enough to pick PERNAD?




Call us, or drop in at:

**Pernad Packaging & Agencies Pvt. Ltd.**

8/IV, CENTRAL BANK BUILDING
FORT, BOMBAY-400 001.
Tel. 274061/273819

**Pernad Packaging & Agencies (P.) Ltd.**

H.O.: Taj Mahal Building,
Hyderabad-500 029,

**PERNAD is packaging**

Time & Space 832

# దేశమంటే మట్టి

## సాంధ్యశ్రీ

సప్త మండలాల సుప్త చేతన ఏ అగాధంలో అంతర్లీనమై యుందో
ఏ ధ్యానం సర్వ దశలను దాటి నిశ్శబ్దాన్ని భరిస్తుందో
అక్కడ ఉదయించిన నా ఆత్మ ఈ భూగోళాన్ని ఆవరించి ... ...
సూర్యుడు – చంద్రుడు – తారలు కలసిపోయిన
ఒక కాంతి పయస్సును తమి తీరే దాకా త్రాగి
నవీన యుగ సంకేతార్థంగా శబ్దాన్ని విసిరివేస్తోంది ...

ఒక్కొక్క శబ్దం శతాబ్దాల పర్వతాల గుండెల్లో దాగిన జీవనాళిక
త్రవ్వుకొంటే తరగని ధనం ...
యుద్ధాలు, తుఫానులు త్రాగిన నేల
జీవ రహస్యాన్ని వినిపిస్తుంటే
బ్రతుకు కేవలం ఊపిరికోసమైన ఒక ముడిపదార్థమనుకునే
మనిషికేం తెలుస్తుంది మరణం విలువ బ్రతుకు చర్చలో ...

పుడమి వసంతాన్ని వరించడమే కాదు
శిశిరాన్ని శిరోమకుటంగా ధరిస్తుంది ...
క్షమ – ఔదార్యం – అనార్త వసూమాలుగా ధమ్మిల్లంలో ధరించిన
మట్టి
దేశం కాదన్నవాడి అడుగు జాడల్లో బడి; అధోగతికి పోతున్న
జాతి
దేశమైతే
ఆ జాతిని మోస్తున్నందుకు కించిత్తు కూడా బాధ పడని
మట్టే
దేశం ...

ఎంత అహింస ?
ఎడద సుస్వరాన్ని మీటే శిరంస ...
గునపాలు గుండెల్లో దిగబడినా
దింపిన చేతులు భస్మాసుర హస్తాలై
సర్వం దగ్ధం చేసినా
గుప్పెడు గింజలు చల్లితే
మొక్కకు
మొదట వచ్చే రెండాకులతో నమస్కరించడం నేర్పుతుంది ...
నేల (మట్టి) ... !
ఇన్ని చరిత్రల సారాన్ని, ఇన్ని త్యాగాల ఔదార్యాన్ని
ఇన్ని జాతి జ్ఞాపకాలను కుక్షిలో భరిస్తూ
అంతర్మథనాన్ని అనుభవిస్తూ కూడా

పచ్చగా పూస్తూ – కేదారమై హసిస్తూ
ఆకలి కష్టాలను అక్కున చేర్చుకునే స్వరంలోని నిరతి
తెల్లటి
ఆత్మను
అపరిపక్వ అనుభూతులతో హత్య చేసుకునే అర్భకులకేం తెలుసు ?
తెరలు తెరలుగా పొరలే గాలి శిఖలు సందేశాన్ని మోసుకొస్తాయి తప్ప
సమస్తాన్ని యిముడ్చుకోలేవు ...
పొరలు పొరలుగా పరచుకొన్న మట్టినేల శతాబ్దాల సంస్కృతిని
వెలార్చుతుంది ...
ధర – వసుంధర – మహోంజధర
వెదురు వేణువు కావటానికి
చెట్టుగా భూమిలోకి పాతుకుపోయిన దశలోనే
త్యాగం విలువ తెలుసుకొన్నదనటానికి దాఖలా;
కర్రు కాల్చి వాత పెడితే కల్యాణి రాగం పల్లవిస్తుంది ...
మట్టి నేర్పే తొలిపాఠం
మానవతా పీఠం
మట్టి దేశమనటమే మహస్సు
మట్టి దేశమని తెలిసుకోవటమే తపస్సు
భూగోళం ఆత్మ ప్రదక్షిణం చేస్తున్న అద్వైతి ...
దేశం మనుషులైన దేశానికేం తెలుసు
మహోన్నతమైన మట్టి ఎదలోయల లోతులు ... ?
నేల వేల నాదుల్లో వాడని ఎన్ని సంస్కృతుల గుంపులు పెనవేసుకున్నాయో
వాతావరణ కాలుష్యానికి వీసమెత్తు అవకాశం కూడా ఈయని
మట్టికడుపులో
ఎన్ని మతాల ఐక్యతా సంగీతాలు ... ?
అంతరాళాలలో అంతర్నిహితమైన ఎన్ని నాగరికతారోచిస్సులు ... ?
మానవుడా ... !
ఈ మట్టి నిన్నటి నీ సౌధం క్రింది పునాదిరాయిని మోస్తోందని
మర్చిపోయి
నేటి
విషయ చర్చలో మునిగిపోయావు కుర్చీలో కూర్చొని
నీ కుర్చీని మోసేది మోస్తున్నది కూడా మట్టే ... !
మనిషీ ... ?
ఈ నేల నిశ్శబ్దంగా గుండ్రంగా తిరుగుతోంది
మహావేగంగా; తనచుట్టు తానై ...
ఈ వలయ ప్రవాహ వర్తనలో ధ్వని ఆత్మ నంటిపెట్టుకుంటుంది ...
నీకు కనపడే కొండలు, అడవులు, జలపాతాలు అన్నీ
నేల నిట్టూర్పుకు మట్టికొట్టుకు పోతాయి ...
భూమి నన్నావరించిన మరుక్షణం నుండీ

నేనంతా ఒక గుప్పెడు మట్టినే
అయితే వసంత వనజ్వాల నా నుండి పుడుతుంది ...
నా
అభివ్యక్తి ఈ భూగోళ పరిణామ పరాకాష్ఠ ...
శిశిరంలో ఋతుఘోషను భరించలేని దిక్కులు
దీన వృద్ధమూర్తులై నేలను ఆశ్రయిస్తాయి — మౌనంగా
అప్పుడే చెట్లతో త్యాగ చర్చను ప్రారంభిస్తుంది నేల !
ఒరే ...
స్వార్థం కరుడు కట్టుకొన్న మనిషీ ... !
ఏ కోణంలోంచి చూసి నిన్ను దేశంగా పిలవమంటావన్న
శిశిర ఘోషని ఋతుగళంగా
చెట్ల కొమ్మల్లోంచి మోడై — కోడై కూస్తోంది నేల ...
మట్టిని నాగళ్లతో పొడిచినందుకు
రక్తాన్ని కాదు, ముత్యాల్ని చిమ్ముతుంది
ఈ తిరుగుబాటులో ఎంత అహింస హరితంగా విప్లవిస్తుందో
అది నా ఊపిరి ...
మట్టి ఆత్మ ఊపిరితిత్తులు
పీల్చేది కాదు ప్రాణవాయువు; విడిచిపెట్టేది ...
మట్టి జీవధాతువు ...
గుప్పెడు మట్టిని సృష్టించలేని మానవ మేధకు
మనిషి తప్ప మట్టి యిచ్చిన ప్రత్యేక బహుమతి ఏదీ లేదు ...
ఈ బాధల నగరం దేహం
అవస్థల ఋతు రుచులకోసం పెరుగుతున్న నాగరికత మట్టిపాలే కదా ...
పుడమి కడుపులోని సువర్ణాగ్నిలో బడి
తప్తమైన సంస్కృతీ మహాశిఖరాలను
తలక్రిందులుగా పెంచుతుంది ! త్రవ్వకొని శిఖరం చేరమని, ఈ మట్టి !
చేతకాని మనిషి ఇప్పుడే తిరుగుముఖం పట్టి
ఉద్యమం లేవదీస్తాడు; ఉపాధికోసం !
ఈ అవ్యక్త అరుపుల్లోని అసందర్భ ధ్వనుల్ని ఆకలిచేస్తాడు ...
తపస్సు ఫలించని వాడికి తిలోత్తమ నృత్యంలా ... !
ఎక్కడ భూమి గగనం కలుస్తాయో
ఆ రేఖమీద నిలబడి నేల అంచుల్ని కళ్లతో స్పృశిస్తున్న
నిశ్శబ్ద స్పృహలో
మానవ వైషమ్యాల ఆర్కెస్ట్రా; కార్పణ్యపు నెగళ్ల జార్గాన్ ...
మట్టిలో కలిసేటందు, పుస్తకాల బందీలివన్నీ ...
ఏ భేదంలేని మట్టికన్నా సమతావాది ఎవరట ... ?
ఈ మట్టి ఇంకా తన గర్భంలో ఏదో దాచుకుంది
రేపటి తన తరం ఆహారం దొరకని నిర్భాగ్యానికి గురికాకుండా
ఇవాల్టి ఈ జలపాతం ఇంకిపోవచ్చు కాల పరిణామంలో

ఈ అడవి అసెంబ్లీ ఐ – తరువాత రాజకీయ ఎడారి కావచ్చు
ఈ కొండలు నాగరికత బలసి ద్రాక్ష తోటలు కావచ్చు
కానీ
నిరంత రంతర్వాహినిగా ప్రవహించే మహాగంగతో
చూచుకాలు నల్లబరుచుకొనే నిత్య బాలింత – మట్టి
ఎప్పటికప్పుడు రేపటి తరంవాళ్ళు అర్థం చేసుకోవల్సిన గ్రంథం ...
ఈ భూగోళ శరీరాన్ని స్పృశించే
నా లాలనామయ కోమల చేతన మట్టి వాసనతో మత్తెక్కి
విహరిస్తోంది ...
ప్రతి చైతన్యపుటణువు భూ పరిష్వంగ జీవంతో
మొలకెత్తి
శిరమెత్తి
దేశమంటే మనిషి కాదు మట్టియనే మాననీయ సూక్తి రత్నాన్ని
ఫలంగా
పంచిపెట్టింది ... ... !

శ్రీ వసంతరావు వేంకటరావు

# శాంతి సాధన

సాయంసమయం. అరుణకిరణుడు కొండవెనక్కు జారుకొంటున్నాడు. ఎండ వేడిమి తగ్గి చల్లగాలి వీయ ప్రారంభిస్తూంది. వాతావరణంలో ఆనంద దాయకమైన మార్పులు వచ్చే సూచనలున్నాయి. పూజామందిరంలో ప్రవేశింప బోతూంది లావణ్య. మామూలుగా ఉండే ఉత్సాహం అప్పుడెందుకోలేదు. దేనికో బాధపడుతూన్నట్లుంది, కారణం స్పష్టంకాలేదు. నేరుగా నాదగ్గరకు వచ్చి :

''ఏమండీ! నాకు శాంతి ఎందుకు చిక్కడంలేదండీ? మనస్సును లొంగ తీసుకొందామని ప్రయత్నించిన కొద్దీ దాని నిరోధం ఎక్కువవుతూంది. ఏం చెయ్యాలో చెప్పండి?''

''ఔను. ఏదోచెయ్యాలి. ఆ చెయ్యవలసింది నీవేకాని మరెవ్వరూ కారు. నీ హృదయంలో శాంతి నెలకొల్పుకోనాలంటే నీవే ప్రయత్నించాలి. అది కేవలం వ్యక్తిగతమైన సమస్య.''

''కాని, నా ప్రయత్నమంతా విఫలమవుతోందండీ!''

''ఈ సమస్యను పరిష్కరించే ముందు లక్ష్యాన్ని నిర్వచించుకోవాలి. తరువాత దానిని చేరుకొనే మార్గం అన్వేషించాలి.''

''శాంతి సాధనే లక్ష్యం.''

''నిజమే. 'శాంతి' అంటే ఏమిటో ముందు తెలుసుకోవాలి. ప్రతిఒక్కరికి శాంతి కావాలి. కాని 'శాంతి' అనేది ఒకవిధమైన మనస్థితి అని గమనించరు. నిజానికి శాంతి అందుబాటులోనే ఉంది. కాని, అందుకొనే విధానం తెలియకబాధ పడతారు.''

''అదంత సులభంగా చిక్కేటట్లు లేదండీ!''

''నీకెందుకు శాంతిలేదో తెలుసుకోడానికి ప్రయత్నించు. నీవు శాంత చిత్తంతో ఉండకుండా అడ్డుపడుతున్న వారెవరు? నీవా? ఇతరులా? ఈ నాటకంలో ప్రధాన పాత్ర వహించేది 'కాలము' అనినాకు తోస్తుంది.''

''కాలమా? ఏం కాలం?''

''గంటలు, రోజులు, నెలలు, సంవత్సరాలలో మనం కొలిచేకాలం, సమాన వేగంతో గమనించే కాలం, మనతో నిమిత్తంలేకుండా సాగిపోయే కాలం, మనం ఏ మాత్రమూ జోక్యం చేసుకోలేని కాలం.''

''మీ మాటలు వెంటనే అర్థంకావు. మనం చర్చిస్తూన్న విషయంలోకి కాలం ఎలా ప్రవేశిస్తుందో ఊహ కందడం లేదు.''

''సూటిగానే, పెరటి గుమ్మంలోంచి కాదు. కాల భావాన్ని సరిగ్గా అర్థంచేసుకోలేని మన అసమర్థతే, అప్పుడప్పుడు బాధ కలిగిస్తుంది. దాని విషయం గమనిద్దాము. ప్రతిరోజు సూర్యోదయమై సూర్యాస్తమయ మవుతుంది. మళ్లీ తెల్లారుతుంది. రోజులు మాసాలై సంవత్సరాలుగ ధ్రూపొం దుతాయి. అభివ్యక్త సూర్యగమనంతో ఋతువులు మారతాయి. శిశిరంలో ఆకురాల్చే చెట్లు వసంతాగమనంతో చిగిర్చి పుష్పిస్తాయి. ఇది ఏటేటా జరుగుతుంది. అయినా, కాల బాణం ఒకే దిశలో సాగిపోతూన్నట్లుంటుంది. ఆ బాణం దిశను మనం మళ్లించలేము. విజ్ఞానం చెప్పే సత్యమిది.''

''అట్టి కాలాన్ని అర్థవంతంగా వూహించుకోడానికై దానిని మూడు విభాగాలుగా భావిస్తారు. అవి భూతకాలం, వర్తమానకాలం, భవిష్యత్కాలం. కడచిపోయినది భూతకాలం. దానిని తిరిగి పట్టుకోలేము. గతం గతమే. అదెన్నడూ అనుభవానికి రాదు, స్మృతిపథంలో తప్ప. రాబోయేది భవిష్యత్తు. దానిపైన మన కెట్టి అధికారమున్నట్లు తోచదు. భూతభవిష్యత్తుల మధ్యనున్నది వర్తమానం. అదే నిత్యం అనుభూతమవుతూ ఉంటుంది. చూస్తూండగా, యోచిస్తూండగా, మాట్లాడుతూండగా భూతకాలంలోకి వర్తమానం జారుకొంటూనే ఉంటుంది భవిష్యత్తు ప్రవేశిస్తూనే ఉంటుంది. ఇది అంతంలేని అవిచ్ఛిన్న ప్రక్రియ. కల్పనకంటే విచిత్రంగా ఉన్నప్పటికీ, నిజానికి, మనం క్షణికమైన వర్తమానంలోనే జీవిస్తున్నాము. ఆ క్షణిక వర్తమానాన్ని సుఖమయం చేసుకోగలిగితే, శాంతి మనదే అవుతుంది.''

''కాలం అవిచ్ఛిన్నమని అనుభవం చెబుతూండగా క్షణాన్ని ఎట్లా గుర్తిస్తామండీ?''

''అదంత అసాధ్యంకాదు. సినిమా రీలు విషయం యోచించు. ఆ రీలులో బొమ్మలుగల చత్రాలు ఎన్నో ఉంటాయి. చత్రంలోనున్న బొమ్మలు స్థిరంగా ప్రింట్ అయి ఉంటాయి. వాటికి కదలికలేదు. కాని, ఆ రీలును అనుకూలమైన వేగంతో త్రిప్పినప్పుడు దానికి మరో పరిమాణం సిద్ధిస్తుంది. బొమ్మలు తెరమీద కదలడం మొదలుపెడతాయి. రెండు పరిమాణాల తెరమీద సహజమైన గమనంతో కదిలే బొమ్మలకు చూపరులు ఉత్సాహపూరితులవుతారు.

''నియత వేగంతో రీలు తిరగగానే దాని ధర్మాలు మారిపోతాయి. చత్రంలో నిజంగా బొమ్మకు లేని కదలిక ఆరోపిత మవుతుంది. ఇట్టి సినిమారీలులాగే 'కాలంరీలు' కూడా తమాషా చేస్తూన్నట్లుంది. మనకు అనుభవమయ్యేది వర్తమానం మాత్రమే కదా! అది విచ్ఛిన్నకాలభాగం, అయినప్పటికీ అవిచ్ఛిన్న భావం కలిగిస్తూంది. సినిమారీలులో ఎప్పుడూ మారుతూన్న దృశ్యంలో క్షణంపాటు నిలకడగా ఉండే స్థిరమైన బొమ్మను పట్టుకొనేటట్లు, తెలిసిన క్షణిక వర్తమానంలో ఆనందాన్ని అనుభవించగల నేర్పు సంపాదించ కలిగినప్పుడు, శాంతి నిధిగా మనకు చిక్కుతుంది. చిత్తం ప్రశాంతంగా ఉంటుంది.''

''సినిమాలో నిలకడగా ఉన్న బొమ్మ కనిపించదే!''

''సామాన్యంగా కనిపించదు. కాని, మెషిన్ ఆగిపోయినప్పుడు రీలు తిరగకుండా ఉండిపోతుంది. లైటు ఉంటుంది. అట్టి సమయంలో తెరమీద కనపడే బొమ్మలన్నీ స్థిరంగా ఉంటాయి. వాటిలో కదలికలేదు. యంత్రం పని

( మిగతా 72వ పేజీలో )

శ్రీ సోమసుందర్

# కృష్ణశాస్త్రి కవితాలహరి
# అజ్ఞాత భావికాలాలకు
# పయనించే స్వేచ్ఛాగాన ఝరి

క్రౌర్య కౌటిల్య కల్పిత కఠిన దాస్య
శృంఖలములు తమంతనె చెదరిపోవ
గగన తలము మార్మోగగ కంఠమెత్తి
జగము నిండ స్వేచ్ఛాగాన ఝరుల నింతు!

అనే ఆగర్వ ప్రతిజ్ఞతో, దృఢ సంకల్పంతో అవతరించింది కృష్ణశాస్త్రి కవిత్వం. ఆ స్వేచ్ఛాగానానికి సంకెళ్ళు తెగిపోవడమొకటే సద్యఃస్ఫూర్తి కాదు; ఈ మోడు మోక చివురులెత్తి మురువు చూపాలి. చిత్తము లానందమయ్యు మరీచికల్లో సోలిపోవాలి. సర్వం ఆనందమయంగా భాసించాలి. యుగయుగాలుగా ఈశ్వరయోధులై నిలచిన స్వాతంత్ర్య సమరయోధుల తపఃఫలం ధన్యత పొందాలి. మనిషి నిర్భయంగా బ్రతకాలి. కష్టాతపాలు, వంతలచీకట్లు వైదొలగిపోవాలి. అలాంటి స్వేచ్ఛకోసం తన కవిత్వం గానం చేస్తుంది. కృష్ణశాస్త్రి స్వేచ్ఛాగానం మౌలికంగా పంచశీలాన్వితం.

ఆ గానం ఉత్త గానమేనా? కాదు; అది ఎంత పరువమైనది? ఎంత పరిమళభరితమైనది? — 'ప్రతి పదమ్మమృత జీవ ప్రతిభ'తో పులకిస్తుంది. 'కొత్త బలంతో చలంతో పలక' రిస్తుంది. పవలురేయి అనే తేడా ఎరుగక పడి నడచిపోతుంది. 'అజ్ఞాత భావికాల యుగా'లకు పయనిస్తుంది. ఈ మాట వట్టినే కవితావేశంతో అన్నది కాదు; అలా పయనించి పయనించి ఒక ఆవృత్తాన్ని ముగించుకొంది. భారతీయ కాలమానంలో అరవై ఏళ్ళు ఒక ఆవృత్తం.

'మలయ సమీరణోర్మికల మాలికలన్ ప్రణయార్ద్ర గీతికల్' మలచుతూ కృష్ణశాస్త్రి గీతం అనంతంగా సాగింది. నన్నయ్యగారి నుంచి నా వరకూ ప్రతి కవీ వృత్తాలు రాసినవాడే! 'నానన నానన ననననా' అనుకుంటూపోతే ఉత్పలమాల వృత్తమై తీరుతుంది. గణబద్ధ ఛందంలో సంగీతం స్వయం సమృద్ధంగా చిప్పిలుతుంది. ఆ ధారణుంటేనే చాలు — కవిత్వమై పోతుందని అందరూ భ్రమపడ్డవాళ్ళే. కాని పద్య నిర్మాణ శిల్పం ఎందరికి తెలుసు? పద్యంలో ప్రతి పదాంతర్గత భావనా సౌందర్యం ఆవిష్కృతమవుతూ – గణతంత్ర ఛందం మళ్ళించే డొంక తిరుగుళ్ళను ఆకట్టుకుంటూ శిల్పనిష్ఠంగా సాగించడం గొప్పసిద్ధి. అలాంటి కవితా సౌందర్యసిద్ధుడు కృష్ణశాస్త్రి. దీనికి ఉదాహరణగా కృష్ణపక్షంలోని తేటివలపు అనే శీర్షికగల పద్యాలన్నీ ఉటంకించుకోవాలి. ఈ ఖండకావ్యం కృష్ణశాస్త్రి తన ఇరవయ్యవ జన్మదినంనాడు రచించానని నాతో చెప్పారు. అలాగే పద్య కవితా శిల్పానికి పరాకాష్ఠ అన్వేషణ; ఉదయినిలో మాత్రం ప్రచురితమై ఎక్కడా గ్రంథస్థంగాని మధూదయం అనే ఖండకావ్యం కూడా ఈ కోవకు చెందినదే! ధనుర్దాసు శ్రవ్య నాటికలోని పద్యాలున్నూ యిట్టివే!

పొదఃపుమలపై బంగరు ముగ్గులుంచడమూ, సంజ మబ్బులకు ఉంగరాలు పొదగడమూ, వేయేళ్ళ తెలుగు కవిత్వ చరిత్రలో ఆయన కొక్కరికే తెలుసు. ఐనా ఆ కవితా గంధర్వ కుమారుడు— 'క్రౌర్య కౌటిల్య పంకంబువలన మలినమైన హృదయ ధామంలో నివశించవలసి వచ్చింది. నవసుమ మృదులమైన ఆ కవి హృదయం విరహ బాధతోనే వేగిపోవలసి వచ్చింది. 'ఏడ జనిన మనోహారి జాడల రసి' కలగిపోవలసి వచ్చింది. కనులు మూసినా తెరచినా లోకమోహన మనోజ్ఞమూర్తి చిరునవ్వు చిలుకుతూ మ్రోల నిలచేది. ఆ విరహాగ్ని చుటల క్రాగి హృదయనాళం తెగింది. తనహృదయ ధనం తొలగిపోయింది జీవిత ఫలం ప్రుక్కినేల పడింది. 'శ్రావణ శ్యామల క్రూర జలద పటలిలో సౌదామనీ ప్రియ' మాయమై పోయింది.

అలా వేగిపోయే కవికి–లోకమంతా ఏకోన్ముఖంగా 'హృదయ దళన దారుణ మహోగ్ర కార్యం' తలపెట్టినట్లు కనిపించడంలో అబ్బురం లేదు. అది కేవలం సంకుచిత స్వాత్మక భావన కాదు. ఆ మధుర విషాద నైరాశ్యం నుంచి బయటపడే మార్గం కవికి కనిపించలేదు.

''పూత గోదావరీ స్రవంతీ తరంగ మాలికా డోలికల మూగు మలయ పవనాన్ని'' గొంతెత్తి పిలచి తన్నెటకో కొని పొమ్మని ప్రార్థించాడు కవి. 'ఓయి సంధ్యా సమీరణా! నిత్య తేజోమయా

వంద నిలయమునకు నెత్తికొని పోవరాదె!' అని ప్రాధేయపడ్డాడు. అది ఉత్తగాలి. వినిపించుకోలేదు. తానూ తన దుఃఖం తోడు నీడగా మిగిలారు తాను అనంత శోక భీకర తిమిర లోకైక పతిగా మారిపోయాడు.

పదం ప్రక్క పదాన్ని పోహళించడంలో నేర్పు కృష్ణశాస్త్రికే తెలుసు. ఒక పద్య వాక్యంలోని పదాలన్నీ కలిసి సమశ్రుతిలో మేళవించిన సంగీత వాద్య పరికరాలవలె మ్రోగించే గాంధర్వ విద్య ఆయనకి పుట్టుకతోనే వచ్చినదా అనిపిస్తుంది. ఆశాబ్దిక సమాహార మంతా కలసి రసికుని గుండెలలో సజీవస్వరూపాలుగా కదలాడుతాయి. వన వితానంవలె సురభిళాల వెదజల్లుతాయి. చల్లని గాలులుగా సోకి ఒడళ్లపై పులకలెత్తిస్తాయి. కృష్ణశాస్త్రి కవిత్వం ఒకే సమయంలో ఐంద్రియకానుభవ పరంపరనీ ఆవిష్కరిస్తాయి, ఆంతరికా వేదనలనీ మేలుకొల్పుతాయి.

'కంటక కిరీటధారినై కాళరాత్రి మధ్యవేళల, జీమూత మంది రంపు గొలువు కూటాల నేకాంతగోష్ఠిదీర్చి దారుణదివాంధ రోదన ధ్వనుల శ్రుతుల పొంగి, ఉప్పొంగి విలాప నిబిడ గీతికావళిని నింపాడు, అర్ధరాత్రి గర్భం నిండా! అలాంటి ఏకాంత సమయంలో కూడ తన్నెవరో క్రీగంట చూస్తున్నారు. నోళ్ళు చప్పరిస్తున్నారు. శుష్కమైన జాలి ప్రదర్శిస్తున్నారు. కవి అహం దెబ్బతింది. 'నన్ను గని యేరు జాలి చెందంగ వలదు! నాకు నిశ్వాస తాళవృతాలూ, కన్నీటి సరుల దొంతరలూ కలవు!' అని గొంతెత్తి ప్రకటిస్తాడు. ఏదో ఒక ఆత్మవిశ్వాసం పొడమింది. నిబ్బరంగా చెప్పుకొన్నాడు. అలా ఏకాంత యవనికా భ్యంతరాన వెక్కి వెక్కి రోదించాడు!

## తొందర పనికిరాదు

పాతికేళ్ల క్రిందటి మాట. ఒకసారి కృష్ణశాస్త్రిగారూ నేనూ ఒక సభలో పాల్గొనడానికి నిశ్చయమైంది. కారు వచ్చి గుమ్మంలో నిలచింది. నేను వారిని తొందర చేస్తున్నాను, త్వరగా తెములమని. ఆయన నింపాదిగా గడ్డం సాపు చేసుకుంటున్నారు. నేను తొందర పెట్టడంచూసి విసుక్కున్నారు. ''అబ్బ! ఏమిటది. మృత్యువువచ్చి వీధి వాకిలి బాదుతున్నా—గెడ్డంచేసుకు వస్తానుండు. అవి గదమాయిస్తాను. నాకు తొందర పనికిరాదు సుమీ!'' అన్నారు. ఆయన జీవితంలో యిది అక్షరాలా నిజమైంది. 'ఆయన జీవితాంతమూ ముసలితనాన్ని ద్వేషించారు. కల్మషాన్ని ద్వేషించారు. దుర్గంధాన్ని ద్వేషించారు. నిర్లక్ష్యంగా మృత్యువునీ ద్వేషించారు. అందుకే ఆయన అలా అన్నారు: ''నాకు మరణమ్ము వలదనినాను'' అని. దానికి కారణం చెప్పుకున్నారు. మరణమంటే భయంవల్ల కాదు. దాని పేరెత్తితేనే ఒణుకు పుట్టీకాదు. మరి? 'అసువులే తొలగి పోవ నా దుఃఖమ్ము వీడిపోవునేమో యను వెరపువలన నాకు మరణమ్ము వలదనినాను!' అని పూర్తి చేశారు!

కృష్ణపక్షం ఒక సంకీర్ణ సమాహారకావ్యం. అనేకాంశాలపై ప్రారంభ యౌవనుని కవితాహృదయం కేంద్రీకృతమైంది. తత్కాలీనమైన వెడగు తలపులూ ఉన్నాయి. వింత ఉద్రేకాలూ చోటు చేసుకున్నాయి. సంస్కార బలంవల్ల ప్రౌఢ నిర్భర వాక్య విన్యాసం అపారంగా దర్శన మిచ్చింది. అపూర్వ భావనామయలోకం అడుగడుగునా ఆవిష్కృతమూ అయింది. అందుకే కృష్ణపక్షపు కవిగా కృష్ణశాస్త్రిని శుక్లపక్షాల కాకాసురులు వెక్కిరింపులకు గురి చేశారు. అక్కిరాజు కొక్కిరాయిళ్ళు నేటికాలపు కవిత్వమంటూ కొక్కిరించారు. ఈ ప్రతికూల రుతుపవనాలు పరోక్షంగా కవిని శాశ్వతీకరించడానికే దోహదం చేశాయి. విమర్శల వెర్రిగాలి వచ్చి నట్లే వెళ్ళిపోయింది. కృష్ణశాస్త్రి కవితా కంఠం నిర్నిద్రంగా మ్రోగుతూనిలచింది. తెలుగు పలుకుబడి ఉన్నంతకాలమూ, తెలుగువాడి రసజ్ఞత జీవించినంతకాలమూ అజరామరంగా నిలచేవుంటుంది!

ప్రవాసమూ, ఊర్వశి—ఈ రెండూ మహత్తర కవితా సుమ నికుంజాలు. విరివోయెరలు; ప్రతి పద్యమూ అనుభవ సారళ్యంతో నిశితమయ్యాయి. అనుభూతి సాంద్రతతో పరిమళభరితమయ్యాయి. శుష్క చమత్కారం కోసమో, పొడిపొడిగా నానుడులు పేర్చడం కోసమో కృష్ణశాస్త్రి ఎక్కడా మాటల పోగులు నింపరు. కవి ప్రేయసి సుధామయూఖరేఖ! ఆమె అడుగుల సందడులు అఖాతాల ఏకాంతాలలో మ్రోసి, మెల్లగా మాయమయ్యాయి. అవి కవి ఎడద త్రోవనే పడి నడచినట్లు భ్రమ కొల్పాయి. పోనీ అక్కడా ఆగవు. 'పడిలేవి నడిరేయి పడిపోయినట్టి' ఆమె కడియాల రవళులూ, చిరుగాజు మ్రోతలూ తనకు వ్రేలెత్తిచూపు జీవితపథాలుగా మారిపోయాయి. ఆ శూన్యం దుఃఖకారకమైపోయింది కవికి! అప్పుడు గొంతెత్తి ఏడ్చాడు! ఎవడు మాత్రం అంతకన్న ఏం చేస్తాడు?

కవి దుఃఖాన్ని కాంచగా వోపలేని తారకలు కన్నులట్టెట్టె ఆర్పుకున్నాయి. మొయిళ్ళు నల్లని నిట్టూర్పు భరాలైపోయాయి. ఇంకా ప్రకృతి పరిసరాలలో ఎలా సాక్షాత్కరించింది. ''అపుడు కుంచుకొని, కుంచుకొని కుహూకుహూర వాటి వను తొలగి, దవ్వు దవ్వులచని శిరాలు వాల్చుకొనినవి తిమిరాలు భయవశాన!...గాలి పసి పాప రిచ్చపడిపోయింది అప్పుడి విశ్వమే నిత్యయాత్ర నాగి శ్రవణములు మూసికొన్నది...రాకరాక తన గళ తమః పథమ్ముల రేగి రేగి రోదనోచ్చలిత ఉచ్చ గీతా దురంత దుస్సహోర్పులు వెడలి రానారంభించాయి...'' అప్పుడు గొంతెత్తి ఏడ్చాడు కవి. ఆ సమయంలో సర్వమూ శూన్యంగా కవికి కనిపించడం అసహజం కాదు. ''ఇపుడు ప్రళయమ్ము క్రమ్మినదేమొ కాక దొరకదో నిల్వ నీడ నా చిరుత పాటకు?'' అనేటంత నైరాశ్యం ఆవహించింది. అలముకున్న చీకటులతో యిరుకైపోయింది, మహానంత విశ్వం! ఎటు చూసినా సంకుల విషాద జలధరచ్ఛాయలే దర్శనమిస్తున్నాయి. పొంచివున్న బాష్పాంబు విధులు ఘోషిస్తున్నాయి. తన పాటకా రెక్కలు తెగి

పోయాయి. లోకేశుని ఎడదనిండా ఏడుపుసందడులు ఎగఊర్పులు, ఏర్చు పొగలూ బయల్వెడలుతున్నాయి.

క్షమాజననీ పురాణ గర్భకుహరం—ఎరుపు మంటల మూలు గులను విదళిస్తున్నది. బ్రతుకు పాడిల్లుగా మారిపోయింది! నిజాని కానాడు కృష్ణశాస్త్రి ఆత్మస్థితిమాత్రమే కాదిది, దేశమాత హృదయమే పాడిల్లుగా కుమిలిపోతోంది! ఆ విభావరీ వేలాశాలలో ఊర్వశి మృదు వసనాంచలాల గుసగుసలు వినరాకపోయినా — ఆకడ లేని రాత్రిలో ఆ మహాకవి అనంతయాత్ర సాగించాడు. పగలెరుగని ప్రవాసంలో వేకువ రేకులు విరుస్తాయేమోనని ఎక్కడో ఒక సన్నని ఆశ! నిజమేమరి, తాను గంధర్వ లోకంనుంచి జారిపడినవాడు. ఈ దరిద్ర హేమంతంలో చైత్ర శుభోత్సవ విభాత కళ్యాణం చిగురి స్తుందేమోనని కవి ఎద లోపలి ఎదలో ఒక సన్నని ఆశ! కిన్నరీ రమ్య కంఠసీమలో శ్రావణాంబుదా శ్లేషపాళిలో విరహగీతి పగిది విహ రించాడు. శిరసులెత్తిన పూలు కవిని చూస్తూనే ఉన్నాయి. పోల్చు కుంటున్నాయి. పిలుస్తున్నాయి. బ్రతుకు పొడుగునా వినిపించిన అలాంటి పిలుపుల కోసమో, ఏ అదృశ్య హస్త చాలనం కోసమో — ఆనాటి వెన్నెల రాత్రివేళ యిల్లు విడచి కానలి కారడవి దారులబడి వెళ్లిపోయారు కృష్ణశాస్త్రి!

కృష్ణశాస్త్రి, దివ్య సౌందర్య స్వరూపమింక కనిపించదా అనుకుంటూంటే గుండెల్లో గుబులు పేరుకుంటోంది. గొంతు పిడచకడుతోంది. తమంత తాముగా కన్ను లజస్రంగా కురుస్తు న్నాయి. ఐనా కృష్ణశాస్త్రి ఎక్కడికి వెళ్లిపోయారు? ఎనభై మూడేళ్లపాటు ఈ మట్టిని చైతన్య రేఖగా మలచిన మహాశక్తి ఎలా మటుమాయ మవుతుంది? నిరంతరాయంగా మన ఎద లోపలి యెదగా కృష్ణశాస్త్రి గీతం మార్మ్రోగుతూనే వుంటుంది. మన రసజ్ఞతను మేలుకొల్పుతూనే వుంటుంది. మన రసనలకు సుధాంశు రేఖలందిస్తూనే వుంటుంది. నిజం! కృష్ణశాస్త్రికి మరణంలేదు; ముసలితనం లేదు; రోగం దరికేరాదు! అది లవలీ మృదు లతాంత పరిమళం!

---

# శాంతి సాధన

(68వ పేజీ తరువాయి)

చేయగానే బొమ్మలలో కదలిక ప్రత్యక్షమవుతుంది. యంత్రం ఆగినట్లు మనస్సును స్థిరం చేసుకోకలగాలి. అట్టి నిశ్చల స్థితిలో శాంతి తప్పక సిద్ధి స్తుంది.''

"మీరు చెప్పింది చాలా సబబుగా ఉంది కాని, దాని సాధనకు అవలంబించ వలసిన మార్గం అంత సులభం కాదేమో?''

"నిజమే. ఈ సమస్యే అటువంటిది.లక్ష్యాన్ని చేరుకోడానికి దగ్గరత్రోవలు లేవు, రాజమార్గ మొక్కటే. నిశ్చయమైన బుద్ధితో నిరంతర కృషిచేస్తూంటే తప్ప శాంతి లభించదు, లభించినా నిలవదు, చేజారిపోతుంది. అయితే భూతకాల సంఘటనల గురించి యోచించరాదని కాని, భవిష్యత్తును వివేకంతో ప్లాన్ చేయరాదని కాని అనుకోకూడదు. మధురమైన స్మృతులను మాత్రమే స్ఫురణకు తెచ్చుకో, దృఢచిత్తంతో ఆత్మవిశ్వాసంతో బుద్ధిపూర్వకంగా భవిష్యత్ ప్రణాళి కలను రూపొందించు. ఈ సందర్భంలో గుర్తించవలసిన ముఖ్యవిషయముంది అశాంతి కలిగించే భావాలను నిర్దాక్షిణ్యంగా తరిమివేయాలి. మనకు వర్తమానమే అనుభవమవుతూ ఉంటుందనీ, భూతభవిష్యత్తులపై ఎట్టి అధికారం లేదనీ గ్రహించినప్పుడు క్షణికవర్తమాన విషయం జాగ్రత్త వహిస్తూ ఎల్లప్పుడూ ప్రశాంతంగా ఆనందంగా ఉండవచ్చు.''

"ఈ క్లిష్టసమస్య పరిష్కరించే ప్రయత్నం ప్రారంభిస్తానండీ!'' అంటూ లావణ్య వెళ్లింది.



74

కుమారి గొల్లమూడి లలిత

# సత్రములు - తొలి దశలో

"ఆయురారోగ్య వర్ధనంబన్న మరయ, నన్నమునబుట్టు లోకంబు అన్నముననె, ప్రాణములు నిల్చు గావున బరమ పుణ్య మన్న దానంబు కన్న లేదధిక మొకటి"[1] ప్రాచీన హైందవ సాంప్రదాయ ప్రకారము అన్నదానంబు చేత నిహ పర సౌఖ్యములు కరతలామల కంబులు, యశంబు సిద్ధించును. అన్నదాత సర్వోత్కృష్టుండు.

అన్నము పర బహ్మ స్వరూపము. పురాణములలో నిదియే చెప్పబడియున్నది. స్వాధ్యాయపరులకు, వృద్ధులకు, బ్రహ్మచారులకు బహు కుటుంబీకులకు పౌరాణికులకు సోమయాజులకు పుణ్యక్షేత్రం బున చంద్ర, సూర్య గ్రహణ, సంక్రాంతి వ్యతీపాత మహాలయంబుల అన్నదాన గోదాన మొదలగు వాటిని చేయువారికి పుణ్యలోక ప్రాప్తి కలుగునందురు. బాల వృద్ధ అంధ అవిటి వ్యాధిగ్రస్తులకును, లేమితో బాధపడువారికి ఎవరు అన్నదానముచేసి సంతోషపెట్టెదరో వారు స్వర్గ సౌఖ్యము లందగలరని చెప్పబడియున్నది.[2]

బ్రహ్మపురాణము[3] పద్మపురాణము[4] అగ్నిపురాణా[5] దులు బ్రాహ్మణులను అన్నముతో ప్రీతులను చేయుటను ప్రశంసించినవి. అన్నదానము చేయు వ్యక్తి ఆ ఆహారమును నీతితో న్యాయముగా సంపాదించి తగు వ్యక్తులకు పంచవలె నన్నదియు ముఖ్యముగా నాచ రించవలసిన విషయము.

అతిథి మర్యాదలు పాటించని వానిని గూర్చి ఇంతకు మించిన కఠినోక్తులు వున్నవి. ఎవరైతే కలిమి కలిగియు దానము చేయడో వాని కంఠమున బరువుకట్టి నీట ముంచవలెనందురు.[6]

'అతిథి దేవోభవ' అన్నారు మన పెద్దలు. ఈ నుడిని అక్షరాలా పాటించినవారే మన పూర్వులు. అతిథి అభ్యాగతులను దేవతలవలె పూజించి వారిని తృప్తిపరచుటే వారి విధి. ఈ సేవలో పూజలో అర్పించిన భోజనము నైవేద్యముగా పరిగణింపబడెడిదే కాని దానముగా మాత్రము కాదు. అందులకే శ్రీ కృష్ణుడు "విప్రుడనై భుజింతును విప్రుడనై పూజగొందు వివిధార్థంబుల్ విప్రుడనై నమకూర్తును, విప్రులకు నాకు భేదము లేదు వేయిం తైనన్"[7] అని అనినాడు. కేవలము దానధర్మములే సర్వస్వమన్నను వాటికి సహితము నియమములను పెట్టినారు. మనము దానము చేయునెడ ధర్మబద్ధముగా నీతి నియమముల ననుసరించియే చేయ వలెనన్నది ఒకటి. ప్రతి గృహస్థు తనపై నాధారపడిన వారిని దుఃఖితులను చేసి వారి అవసరములను అణగద్రోసి వారిని బాధాకర మైన జీవితముల పాల్పరచి దాన ధర్మములు చేయుట అవివేకము, అజ్ఞానము. దీనివలన గృహస్థు ఇహపర సౌఖ్యములకు దూరుడగును. కనుక గృహస్థు ఆయిదింట మూడుపాళ్లు తనకు తనవారి అవసర ములకు కేటాయించి మిగిలిన రెండు పాళ్లను దాన ధర్మములకు వుపయోగించవలయును.[8]

తనతోబాటు ఎవరకూ ఇంత భోజనము నొసగలేక లోభితన ముతో వంటరిగా భుజించువాడు వ్యర్థుడు. మరియు యే గృహస్థు తన ఇంటనున్న బ్రాహ్మణుని అభోజనముగా వుండనిచ్చునో ఆఇంట ఇష్టాపూర్తాలు[9] నసించు నందురు.

వర్ణాశ్రమ వ్యవస్థ వ్యాప్తిలోనున్న ప్రాచీన కాలమున సహి తము జీవరాసులలో సహితము వ్యత్యాసమును చూపకయే అన్నదానము చేయవలెనని మన ప్రాచీన గ్రంథములు చెప్పుచున్నవి. వీటి ప్రకా రము కులభ్రష్టులకు, అంటువ్యాధివారలకు, చండాలురకు, కుక్క లకు, కాకులకు, క్రిమి, కీటకాదులకు గృహస్థు ఆహారము నేలపై దూరముగా పెట్టవలెనని[10] యున్నది.

అన్నదానమునకు పాత్రాపాత్ర, కుల, మత విచక్షణ వుండ రాదని అందురు. దానము స్వీకరించు వ్యక్తి అన్నార్తుడా కాదా అనునది ఒక్కటియే గమనించతగ్గ విషయము.

దానములు పలు విధములు. దశ, మేరు, షోడశ దానములు మహాదానములని[11] అందురు. కాని వాడుకలో దశ దానములే ప్రవా రములో నున్నవి. "దశ దానములకు తోటకూర కట్ట" అన్న వ్యంగ్యోక్తి దీనినే చెప్పుచున్నది. దేనినైనను దానము చేయవచ్చును. భూ, కనక, వస్త్ర, దంతి, తురగ, అన్న, అభయ, గో, హిరణ్య, కన్య, గృహ, ధన, వస్తు, వాహన, జల మొదలైనవి ఎన్నో కలవు. కాని అన్నిటా అన్నదాన జలదానములే పరమోత్కృష్టమైనవిగా పరిగణించబడినవి. దశ దానములు [12] :—స్వర్ణ, అశ్వ, తిల, హస్తి, కన్య, రథ, భూ, గృహ, వధు. కపిలధేనువులు.

మహాదానములు[13] :—హిరణ్యగర్భ, తులాపురుష, బ్రహ్మాండ, కల్పవృక్ష, గో సహస్ర, హిరణ్యధేను, హిరణ్యాశ్వ, అశ్వరథ, హస్తి రథ పంచ లాంగల, ధరదాన, విశ్వచక్ర, కల్పలత, సప్తసాగర, మహాభూత ఘట, రత్నధేనువులు.

మేరు దానములు[14] :—ధాన్య, లవణ, గుడ హేమ, తిల, ఘృత, రత్న, రజత, శర్కర, కర్పశములు.

ప్రాచీన కాలము నుండి ఆంధ్రావనిలో అన్న సత్రములు విరి విగా నుండెడివి. బాటసారులు, సన్యాసులు, పేదలు, భక్తులు, విద్యార్థులు, గురువులు, బ్రాహ్మణులు, ఒకరనేల అర్తు లందరకు ఈ సత్రములు ఆశ్రయమొసగు చుండెడివి. సత్రములింత విస్తార ముగా వృద్ధి చెందుటకు హైందవ సాంప్రదాయమే కాక అప్పటి రాజకీయ, ఆర్థిక, దేశపరిస్థితులు చాలవరకు కారణముగా నుండెడివి.

రాజులు తమకు తమ పితురులకు పుణ్యలోక ప్రాప్తి కొరకు, ప్రజానురంజకత్వము కొరకు, పాప ప్రక్షాళన కొరకు, యుద్ధములో కలిగిన జన జంతు క్షయ పాప పరిహారార్థము విరివిగా సత్రములు నెలకొల్పెడివారు. ఈ అన్న సత్రములు ఆ చంద్ర తారార్కముగా నడుపుటకుగాను, దాని నిర్వహణకుగాను పన్నులు లేకయే భూ, ధన, ధాన్య దానములుచేసి వీనిని సక్రమముగా నిర్వహించుటకు అధికారులను నియమించెడివారు. ''యధారాజా తధాప్రజా'' అని శ్రీమంతులైన పౌరులు రాజుల ననుసరించి, వారి శక్తి సామర్థ్యములను బట్టి కొంత చిన్న పరిమాణములలో అన్నదానములకు ఏర్పాట్లు కావించెడివారు.

అంతియేకాదు. సప్త సంతానములలో సత్రము లొకటిగా నుండెడివి.[15] అందుచే శక్తిగలవారు హిరణ్య, భూ, గో, కన్య, విద్యా దానంబులుచేసి అగ్రహారములను స్థాపించెడివారు. ఆలయములను కట్టించెడివారు. తటాకములను త్రవ్వించెడివారు. వీటిని సప్త సంతానములని కీర్తి తెచ్చునని భావించి ఆచరించెడివారు.

సత్రముల పుట్టుపూర్వోత్తరముల గురించి ఇంతకు మించి స్పష్టముగా చెప్పుట కష్టము. క్రీ. శ. 1000 సంవత్సరముల పూర్వము సత్ర వివరములు తెల్పు శాసనాధారములు ఏమియు లేక పోవుటయే దీనికి కారణము. తదుపరి కాలపు శాసనములు కొన్ని లభ్యమగుటచే ఈ కొంత పరిజ్ఞానమైనను లభించినది. వాటి నిర్వహణ గురించి ఆధిపత్యము గురించి కొంత తెలుసుకో కలిగితిమి.

సత్రములు పలు విధములుగా నుండెడివి. కొన్ని వర్ణములకే కేటాయించబడి కొన్ని సత్రము లుండెడివి. అందు అందరికి ప్రవేశ ముండెడిది కాదు. ఆ వ్యవస్థాపకుల నిర్ణయము ననుసరించి యుండెడివి. కొన్ని సత్రములలో అందరకు ప్రవేశ ముండెడిది.[16] బ్రాహ్మణులకు[17] మాత్రమే ప్రత్యేకించబడి కొన్ని సత్రములుండెడివి. మరి కొన్ని తాపసులకు మాత్రమే ప్రవేశము కలవి.[18] పరదేశి సంచార తపసులకు, చరించు బ్రాహ్మణ తపసులకు ప్రవేశము కలవి,[19] మఠములలో పని చేయువారలకు[20] కేటాయించబడినవి కొన్ని, వేదాధ్యయనముచేయు బ్రహ్మచారులకు [21] ప్రవేశము కలవి, వారలకు వస్త్రదానము కొరకు ఏర్పడినవి కొన్ని విద్యా సత్రములు,[22] మరియు దేవరల భోగ సత్రములు,[23] పాల సత్రములు[24] వుండెడివి. శుద్ధ శైవులకు,[25] నానాజాతి వర్ణములవారికి,[26] జంగమ సత్రములు,[27] బీద, అంధ, యాచక[28] దర్వేషులకు,[29] విద్యాగ్రాస[30] వాసులకొరకు శివ యోగులకు[31] స్థాపించబడిన సత్రములు కొన్ని యుండెడివి. ఇవియేకాక మనుజులకు ఉదక సత్రములు,[32] పశు పక్షులకు[33] ఉదక సత్రములు వేరుగా నుండెడివి.

ఇవియేకాక మరికొన్ని చిత్ర విచిత్రములైన సత్రముల గురించి వినికిడి గలదు. ఇది యెంతవరకు యదార్థమో చెప్పనలవి కాదు. చాటుపద్య మణిమంజరి మొదటి సంపుటములో రాయని భాస్కరుని గురించి కొంత చెప్పబడినది. దాని ప్రకారము రాయన మంత్రి విరతాన్న, జల సత్రములు అంబలి సత్రములు, శిరస్నాన మానె సత్రము, బాలకులకు పాల సత్రములు, విట గ్రామీణులకు కామ సత్రములు, జలకమాడ జలసృష్టి సత్రములు, తాంబూల సత్రములు మొదలగు సత్రములు ఏర్పాటు చేసెనని చెప్పబడినది.

పాల సత్రములలో యాత్రికులకు, విద్యార్థులకు ఒక నిర్ణీత కాలమున పాలు పంచబడెడివేమో. దీనికి నిదర్శనము అల్లాడ నాయకుడు[34] తిరు అర్ధజామున పాలు ఆరగించుటకు పెట్టిన ఐదు గోవులపాలు అర్ధరాత్రమున స్థానిక పరదేశీయులకు వినియోగించునట్లు ఏర్పరచెను. అట్లే వినుకొండ రాయన భాస్కరుడు బాలకులకు పాలసత్రము నెలకొల్పెనని(చాటుపద్య మంజరిద్వారా)తెలియుచున్నది.

విద్యా సత్రములలో వేదాధ్యయనము చేయు విద్యార్థులకు అన్నదానము, వస్త్రదానము చేయుట జరిగెడిది. ఒక శాసన పాఠమున అర్గురు ఉపాధ్యాయులను, ముగ్గురు వేదాంతోపన్యాసకులను నొక గ్రంథాలయాధికారిని నియమించి పోషించినట్లు తెల్లమగుచున్నది.[35] వేదాధ్యయనము చేయించెడి ఉపాధ్యాయులు యజుర్వేదమును అధ్యయనము చేయింపగలరు.[36]

చాళుక్య జగదేకమల్లుని కాలమున కందూరు అన్నెమరసు అగస్త్యేశ్వరము నందలి జగదిందు పండితునకు విద్యా దానమునకై చిమిలి గ్రామము నందలి అన్న సత్రమునకై చిదీశ్వర పండితునకు మరొక గ్రామము దానము చేసెను.[37] ఎఱుకసానమ్మ[38] ఎఱుక సముద్రమున సత్రముపెట్టి విద్యార్థులకు భోక్తలకు వృత్తులు పెట్టి చలి వెందలి పెట్టెను. త్రైలోక్యమల్ల చందలదేవి[39] అగస్త్యేశ్వరమునందలి సత్రమునకై చిదీశ్వర పండితునకు అన్నన్ పల్లెను దానమిచ్చెను.

సత్రముల నిర్వహణలో సహితము కొన్ని పద్ధతులు, కట్టుబాట్లు, నియమములు వుండెడివి. భోక్తల సంఖ్యతో నిమిత్తము లేకుండ నడచునవి కొన్ని యుండెడివి.[40] అట్లుగాక ఇరువది మంది[41] మాత్రము భుజించుటకుగాను, ఐదుగురు తపసులకు[42] తొమ్మిదిమంది శివయోగులకు,[43] ముప్పదిమంది బ్రాహ్మణ ప్రయాణీక తపస్సులకు,[44] పదిమంది బ్రాహ్మణులు, శైవయోగులు[45] రెండువందలమంది విద్యార్థులు భుజించుటకు,[46] పదిహేనుమంది బ్రాహ్మణులకు [47] నిర్దేశించబడినవి కొన్ని — ఇట్లు పరిమితమై యుండెడివి సత్రములలో కొన్ని నిత్యము నడచు సత్రములుండెడివి.[48] కొన్ని వుత్సవ వేళలందు మాత్రమే నడచునవి యుండెడివి. శివరాత్రి, మహర్నవమి, దీపావళి మొదలగు పర్వదినముల నడచునవి వుండెడివి. ఒదయదేవి[49] అమ్మంగారు శివరాత్రి భోజనమునకై వేయి బ్రాహ్మణులకు పెట్టిన క్షేత్రము కలదు. ఇటులనే కల్యాణోత్సవము[50] మొదలైన ప్రత్యేక దినములలో వుత్సవ సమయములలో భక్త యాత్రిక సౌకర్యార్థము నడిపెడు సత్రములు వుండెడివి.

మాఘమాసము మొదలుగా పానీయశాల గట్టించి మంచి నీరు, చల్ల పోయువారి పుణ్యము బోల్ప నరుదు. ఉభయ లోకంబులందును శుభము బడసెదరు. చతుష్పథంబులందు ద్రోవల చలి పందిరి పెట్టించి అంబలి శీతోదకంబులు బోయువారలకు బుణ్యలోకంబులు ప్రాప్తించును. సకల ప్రాణుల ప్రాణంబులు జలంబులందు నిలుచు గావున జలదాన శీలుండు ప్రాణదాత యనంబడు.[51]

ఇవియేకాక ఉదక సత్రములు అనగా చలివేంద్రలు పెట్టించెడివారు. ఇవి మనుజులకే[52] కాక పశువులకు[53] పక్షులకు[54] సహితము వుండెడివి. వేసవి కాలమందు చలివేంద్రలు పెట్టి ఉదకదానము సల్పి, శీతాకాలమున ఆగుష్టిలను[55] నెలకొల్పెడివారు.

ఇంక సత్రముల నిర్వహణ, వానియందు పనులు చేసెడివారి వివరములు, వారి జీత భత్యములు, సత్ర నిర్వహణకొరకు ఇచ్చెడి నిధి నిక్షేపముల గురించి కొంత తెలియవచ్చినది. ఆ కాలమున (అనగా పదకొండో శతాబ్దము) కులోత్తుంగచోళ సత్రము ప్రసిద్ధికెక్కినది. మూడు శాసనములలో పేర్కొనబడినది.[56]

మనకు సత్రముల గూర్చి ప్రథమముగా తెలుపు శాసనము శకసంవత్సరము 1006నకు (క్రీ. శ. 1084) చెందినది.[57] ఈ శాసనములోని ఒక ప్రత్యేకత ఏమన విష్ణువర్ధముని పదిహేనవ విజయరాజ్య సంవత్సరమున సమరమొదవి జేతి నాయకుని కుమార్తె జయమ అనునామె కులోత్తుంగచోడ సత్రమును స్థాపించి దానికై శాసనము నెలకొల్పెనే. అదియే మనకు సత్రముల పరముగా లభ్యమైన ప్రథమ శాసనము. అంతవరకును శతవిధముల పెక్కు సత్రములుండి యుండవచ్చును కాని ఈ శాసనము నాటినుండియే సత్ర నిర్వహణ వివరములు తెలిసినవి.

సత్ర నిర్వహణమునకు ఆ కాలమున స్థిరాస్తులో, మూలధనమో, పశుగణములో నొసగెడివారు. అటులనే[58] ఈమె జయమ సంవత్సరమునకు ముప్పది పుట్ల ధాన్యము పండెడు భూమిని ఏ పన్నులు లేకనే ఇచ్చినది. ఆ సత్రము నెందరికి నడుపవలెనో, దానికి తగు వెచ్చములు, నిర్వహణకు కావలసిన పరివారము, వారి జీతభత్యములు అన్నియు వివరముగా ఏర్పరచినది. అచ్చట భుజించు బ్రాహ్మణులకు నెయ్యిని సమకూర్చుటకు మూడువందల ఎడ్ల నొసగినది. దీనిని గూర్చిన వివరములు వేరుచోట నుదహరించితిని. [ఎడ్లు అన్న పదము ఆవులు గొఱ్ఱెలు మొదలగు వాటికి వాడబడెడిదని శాసన శబ్దకోశమున (ఆం. ప్ర. సా. అ.) తెలుపబడినది.]

అనేకులు సత్రములకు భూదానము[59] లిచ్చిన శాసనములు పెక్కు కలవు. వేయి పోకమొక్కలతోపు,[60] ఆవులు,[61] మాడలు[62] మొదలైన నాణెములిచ్చుట, తోటలు — పూదోటలు[63] కూరగాయలు[64] తోటలు, ఫలదోటలు—శుంకములు[65] ఇచ్చిన సందర్భములు కలవు. వీరిచే నొసగబడిన ఈ స్థిరాదాయములలో సత్రముల నిర్ణయము ప్రకారము నియమిత జనుల సౌకర్యము కొరకు నడుపబడెడివి కొన్ని యెడల రాజులు సత్రముల నెలకొల్పి సత్రనిర్వహణకు కావలసిన పదార్థములు మొదలైనవాటిని సమకూర్చుట పుర ప్రముఖులపై పెట్టెడివారు. రాష్ట్రకూట శాసనము[66] లోముప్పది మంది భోజనమునకు కావలసిన బియ్యము, నేయి మొదలైనవి పుర ప్రముఖులు, గాండ్లవారు నూనె, మాలాకారులు పువ్వులు ఇచ్చునట్లు కట్టడి చేసినట్లు చెప్పబడియున్నది.

సత్రముల నిర్వహణలో పెద్దను సత్రాధిపతి[67] యనెడివారు. సర్వసాధారణముగా సత్రములు మఠములకు అనుబంధముగా[68] యుండెడివి. కనుకనే సత్రమఠాధిపతు[69] లనుట వాడుకలో యుండెడిది సత్రములు సక్రమముగా నడచుచున్నవో లేదో చూచుటకు సత్రపరిక్షాధికారు[70] లుండెడివారు. సత్రాధిపతులకు[71] వాటి నిర్వహణకుగాను జీతభత్యము లొసగబడెడివి. వాటి బాధ్యతంతయు వారిదే. కొన్ని యెడల ఈ సత్ర నిర్వహణ ఘటికాస్థానముల[72] కొసగబడెడిది. (ఘటికాస్థానమనగా వేదశాస్త్రాది విద్యలు నేర్పు విద్యాసంస్థ. ఇవి రాజులచే బ్రాహ్మణుల కొరకు నిర్మింపబడినవి)

సత్ర నిర్వహణకు అనేక శాఖలుండెడివి. వేరు వేరు పనులకు వేరు జీతములతో నియమించెడివారు.[73] మంత్రకార్యములు నిర్వహించుటకు యాజ్ఞికుడు, పురోహితుడు ముఖ్యులు. వంట శాఖయందు బ్రాహ్మణులు వండెడు వారుండెడివారు. వారికి కావలసిన వస్తు సామగ్రిని సమకూర్చుటకు మరికొంతమంది యుండెడివారు. వంట చెరకు సమకూర్చువారు, కఱ్ఱలవాడు (కట్టెలు కొట్టి అందించువాడు), వడ్లు దంచి బియ్యము, పిండి మొదలైనవి సమకూర్చువారు, నీళ్ల (కావళ్ల) మోయువారు — సత్రమున వాడుకకు, వంటకు కావలసిన నీరు సమకూర్చుటయే వారి పని. అటులే పూడ్చుటకు వేరు మనుషులు, ఎంగిండ్లెత్తుటకు మరికొంతమంది యుండెడివారు. బోయలు (వీరేమి చేసెడివారో తెలియలేదు) కొంత మంది సత్ర నిర్వహణకు నియమితులై వుండెడివారు. సత్రమునకు కావలసిన కుండలు మొదలైనవి సమకూర్చుటకు కుమ్మరులను జీతముపై నియమించెడివారు. పాత్రలు తోమెడువారు సహితము నియమితులై యుండెడివారు. మరికొన్నిచోట్ల తిరువారాధనసేయుటకో బ్రాహ్మణుడు, దివ్వె నెత్తుటకు మరియొకరు, తిరువాముడి విన్నపము చేయువారలను జీత భత్యములపై నియమించెడివారు. ఆకులు సరఫరా చేయుటకు కొంతమంది వుండెడివారు. సత్ర నిర్వహణకు కావలయు పదార్థము లన్నియు సమకూర్చి వాటిని సక్రమముగా నిత్యవాడుకకు అందజేయుటకుగాను వొక గ్రాసాధికారియుండి యుండవలయును.

వంట పాత్రలు[74] మొదలైనవి కొనుటకు వేరు భత్యములుండెడివి. సత్రశాలలో వంటండ్లకు కావలయు శాకములు, ఫలములను సమకూర్చుటకు కొన్ని తోటలు దత్తము చేయబడెడివి. ఈ తోట నిర్వహణకుగాను మాలీలు, అధికారులు వుండెడి వారనవచ్చును. భోక్తలకు వలయు పాలు, పెరుగు, నేయి మొదలైన వాటి కొరకు ఆలమందలను ఇచ్చెడివారు. వీటి పాలనకు పశుల కాపర్లు మరికొంత సిబ్బంది యుండక తప్పదు. ఈ సిబ్బంది అంతయు సత్రాధిపతి పర్యవేక్షణ క్రింద పనిచేసెడివారు.

సత్ర నిర్వహణ సక్రమముగా జరుగుచున్నదో లేదో చూచుటకు పరీక్షాధికారు లుండెడివారు. క్రీస్తుశకము 1084 సంవత్సరము నాటికి వీరి జీతము లిట్లుండెడివి :

పురోహితునకు[75] :— జీవితమాడలు మూడు, దినము ఒకటికి మూడు ప్రాల కుంచముల ధాన్యము.

వండెడువానికి :— ఎనిమిది జీవిత చిన్నాలు, మూడు ప్రాల కుంచముల ధాన్యము.

కట్టెపనివానికి:—ఒక జీవితమాడ, దినమునకు మూడు ప్రాల కుంచముల ధాన్యము.

దంచెడు స్త్రీలకు :—
ఎంగిళ్లెత్తు వారికి :— } ఒక జీవితమాడ, మూడు చిన్నములు.

బోయి[76] :— 5 చిన్నాలు, రెండు ఖండిగల భూమి.
కట్టెలవానికి :— ఒక జీవితమాడ, ఖండిగల 13 భూమి.
కుమ్మరి :— 5 జీవిత చిన్నాలు, ఖండిగల 3 భూమి.
వడ్లు దంచువాండ్రకు[77] :— (32) ఒక మాడ, 13 ఖ. భూమి.
కట్టెలు వెట్టువానికి : ఒక మాడ, 13 ఖండిగల భూమి.
వండువానికి :— 5 చిన్నాలు, 1 ఖండిగల భూమి.
ఆకులు పెట్టువానికి :— 3 చిన్నాలు.
కుమ్మరికి :— 5 చిన్నాలు, 9 ఖండిగల భూమి.
వండెడువారికి[78] :— ఒక మర్తుల నేల.
చలివెందరి నీళ్లు పెట్టువానికి :— 1/2 మర్తుల నేల.
విద్యార్థులకు, గ్రాసవాసస్సులకు :— 3 మర్తుల నేల
కుమ్మరులకు[79] :— 1 మాడ.
కరలవారికి :— 1 మాడ.
వండువానికి : 2 వృత్తుల నేల.
కావడివారికి :— 1 వృత్తుల నేల.

వీటి సరియగు నేటి విలువ ఎంతయో చెప్పట కష్టము. మాడ యనగా ప్రస్తుతపు 80–100 రూప్యముల మధ్య యుండ వచ్చును.

ఇదే తీరున సత్రములలో నిత్యవాడుకకు నొసగబడిన వెచ్చంబుల పట్టికలు సహితము లభ్యమైనవి. జయమ[80] శాసనములో నాటి కొలత లిట్లున్నవి :

దినమునకు ఇరువదిమంది భోజన సౌకర్యార్థము ఇవ్వబడెడి వెచ్చముల వివరములు :

ముమ్మడి భీమకుంచమున అడ్డెడు డంగుబ్రాల కుంచములు రెండుమార్లు (పొద్దుటి భోజనమునకు, రాత్రి భోజనమునకు).

ఎనుబదిమంది జనుల భోజన సౌకర్యార్థమై ఇచ్చెడివి :

50 డంగుబ్రాల కుంచములు.

పదునెనిమిది భోక్తల అవసరార్థము ఇచ్చెడివి :

40 డంగుబ్రాల కుంచములు, మూడు కుంచముల పప్పు, నేయి 1 కుంచము, మిరియాలు 1/2 సోల, నక్కుపల (పేలపిండి అవవచ్చునేమో) 3 కుంచము, ఉప్పు 1 కుంచము, బెల్లం 30 కుంచము, నాలుగు నంజాండ్లు.

వేరొక శాసనమున మరికొన్ని వివరములు ఇట్లున్నవి.[81] నిత్యము పదిమంది శివయోగులకుగాను 9 డంగుబ్రాల కుంచముల ధాన్యము, పప్పు— 1 బ్రాల కుంచము, నేయి — మానెడు, చల్ల—3 మానికలు, నంజాండ్లు—3.

పదిమంది శివయోగులకు : బ్రాలకుంచము—1, మానికెలు—2, పడ్లు పదింటికి బ్రా. కుం. 15.

వేరొక శాసనము[82] ప్రకారము పదిమంది బ్రాహ్మణులకై ఇచ్చినవి:— బియ్యం—15 బ్రా. కుం., చల్ల—4 బ్రా. కుం., ఉప్పు—3 మానికలు, పెసలు—1 కుంచము, నెయ్యి—1 మానెడు, పదిహేను నంజాండ్లు.

పై నొసగిన జాబితాలను పట్టి ఆ కాలమున భోజనములకు వాడెడు పదార్థములు తెలియుచున్నవి. అన్నము, పప్పు, నేయి, చల్ల, శాకములు 4 మొదలు 15 వరకు వుండెడివి. మరియు బెల్లము, మిరియాలు, పిండి మాత్రమే చెప్పబడినవి. తదితర దినుసులు వాడియుందురేమో కాని ఎచ్చటను చెప్పబడలేదు.

భుజించుటకు ఆకులు వాడెడువారని తెలియుచున్నది కాని ఒక శాసనమున[83] ఐదుగురి భోజనమునకై ఐదు పళ్యములను, పళ్లెరములను ఇచ్చినట్లు యున్నది. కనుక ఆకులు, కంచములు వాడుచుండిరని అనవచ్చును. రాయని భాస్కరుడు[84] భోజనములలో నేయి, రాజాన్నము, పదహారు రకములైన కూరలు మొదలగు వాటితో, తెల్లని పెరుగుతో అన్నసత్రములు నడిపినట్లు చెప్పబడియుండెను. ఇది అతిశయోక్తియే కావచ్చును.

ఆ కాలమున ఆహార ధాన్యములు, వస్తుసామగ్రి కొల్లలుగా నుండెడివి కాని ఇప్పటివలె ఒకచోటునుండి వేరొక చోటుకి ఇంత సులభముగా చేరవేయు వీలుండెడిదికాదు. వస్తువుల మార్పిడియే ఎక్కువగా నుండెడిది. ప్రయాణము అరణ్య పర్వత మార్గముల గుండా బహు ప్రయాసతో కూడియున్నది. మార్గమధ్యమున చోరుల భయము. బాటసారులు ఏమైన వెంట గొనిపోయిన అది చోరుల పాలయ్యెడిది. ఆ కారణముగనే ఈ అన్నదానములు, అన్న సత్రములు; ప్రతి గృహస్థు అతిథి అభ్యాగతుల నాదరించవలెనన్న నియమము వాడుకలోకి వచ్చినది. లేదన రాదన్న నమ్మకము, అతిథులు దేవతలను భావము, అతిథులు తుష్టిచెంది ఇచ్చు ఆశీర్వాదములకు విలువ, బాటసారులకు ఆశ్రయమిచ్చుటకు దోహదము చేసినవి.

బ్రాహ్మణులకు వేదాధ్యయనమే కాని మరియొక వృత్తిలేదు. కేవలము ఎవరివల్లనో ఇవ్వబడిన తృణమో పణమో ఆధారముగా జీవితములుగడుపువారు, గురుకులములలో జీవితములు గడిపెడువారు. వారికి బిక్షాటనమే ఆధారము. ఈ తీరు జీవనము గడిపెడువారు అగ్రకులజులే. అందులకే సత్రములు వీరికే ఎక్కువగా నుండెడివి. వీరిని అందరు ఆదరించి అభిమానించెడివారు.

మత ప్రాబల్య మెక్కువగా నుండెడిది. తపశ్చర్యతో జీవించు తాపసులకు సన్యాసులకు మతజీవులకు ప్రయాణీకులకు ఏవిధమైన జీవనోపాధి వుండగలదు? వారలకు బిక్షాటనమే ఆశ్రయము. సత్రములే శరణ్యములు. గృహస్థులే ప్రాపు.

పైన చెప్పిన ఈ సాంఘిక ఆర్థిక రాజకీయ మత పరిస్థితుల ప్రాబల్యమువలన ఏర్పడినవే సత్రములు. ప్రజల ఉపయోగార్థము నెలకొల్పబడినవే ఈ సత్రములు. వీటిని "శాల" 85 అని కూడా పిలిచెడువారు. సత్రములన్నియు దాదాపు ఏ ఆలయమునకో, మఠమునకో అనుబంధముగా నుండెడివి. యాత్రికులకు భక్తులకు, సన్యాసులకు ఆశ్రయము కలిగించెడివి. దాతలు ఏ దేవుని పేరిటో ఒక గుడి కట్టించుట, దానికి అనుబంధ సత్రము పెట్టుట వాడుకలోనున్నది.

"అన్నదాత సుఖీభవ!"

## ఈ వ్యాసమునకు ఉపకరించిన గ్రంథములు


1 ధర్మశాస్త్రము సం. 2. కాణే, వామన్‌రావ్.

2 శేషధర్మములు—తామరపల్లి తిమ్మయ ప్రధాని.

3 దక్షిణ హిందూదేశపు శాసన సంపుటము - 4

4 " " 5

5 " " 6

6 " " 10

7 తెలంగాణా శాసనములు సంపుటము 1

8 " " 2

9 చాటుపద్య మణిమంజరి " 1

10 ఆంధ్రప్రదేశ్ ఆర్కెలాజికల్ సీరీస్ 3

11 మహాభారత సభాపర్వము

12 శాసన శబ్దకోశము—ఈశ్వరదత్తు.

13 బ్రహ్మపురాణము

14 పద్మపురాణము

15 అగ్నిపురాణము

16 శాసన పదకోశము

17 ధర్మశాస్త్రము సం. 5. కాణే, వామన్‌రావ్.


## అధోజ్ఞాపికలు

1 2-1: 234

2 17–Chap 24

3 13–218. 10–32

4 14–సం. 19, 289-307

5 15–211. 44.46

6 3–chap 25.

7 2–2 : 135

8 1–chap 25

9 1–chap 25

10 17–chap 24

11 16–Introduction 1–chap II

12, 13, 14 2 chap 25

15 5 సం. 123

16 6 సం. 395

17 3 సం. 1015

18 3 సం. 1054

19 3 సం. 1102, 1104, 1248

20 3 సం. 1281

21 10 సం. 2

22 10 సం. 2

23 5 సం. 698

24 5 సం. 719

25 6 సం. 388

26 6 సం. 395

27 6 నం. 728
28 6 నం. 743
29 6 నం. 743
30 7 నం. 11
31 3 నం. 1288
32 4 నం. 128
33 6 నం. 488
34 5 నం. 719
35 10 నం. 3
36 5 నం. 1177
37 8 నం. 38 క. చా
38 7 నం. 11
39 8 నం. 40 క. చా.
40 3 నం. 1102
41 3 నం. 1015
42 3 నం. 1054
43 3 నం. 1237
44 3 నం. 1248
45 4 నం. 66
46 3 నం. 2
47 6 నం. 227
48 3 నం. 1015
49 4 నం. 125
50 3 నం. 1098
51 2. 1 అ.
52 4 నం. 128
53 6 నం. 488
54 6 నం. 488
55 4 నం. 1342
56 3 నం. 1015, 1016, 1281
57 3 నం. 1015
58 3 నం. 1015
59 3 నం. 1016
60 3 నం. 1054
61 3 నం. 1054
62 5 నం. 1106
63 & 64 5 నం. 904
65 5 నం. 200
66 8 నం. 1 రా. కూ.
67 & 68 5 నం. 904
69 5 నం. 904
70 5 నం. 1213
71 5 నం 119
72 10 నం. 3
73 3 నం. 1015, 1248, 1288; 6 నం. 388; 7 నం. 11
74 5 నం. 904
75 3 నం. 1015
76 3 నం. 1248
77 3 నం. 1288
78 7 నం. 11
79 6 నం. 388
80 3 నం. 1015
81 3 నం. 1288
82 4 నం. 66
83 3 నం. 1054
84 9
85 3 నం. 1281

డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం

# యూనివర్సిటీల్లో తెలుగు పరిశోధన

## 1

'Research' అనే ఆంగ్ల పదాని కనువాదంగా 'పరిశోధన' అనే ఆంధ్ర పదం ప్రచురంగా వాడబడుతున్నది· ప్రౌఢ్యం ఈ విధంగానే పేర్కొన్నది. విచారణ, విమర్శ వెతకటమని ఇతరార్థాలు కూడా ఇచ్చింది.

కాని సంస్కృతంలో 'శోదన' మంటే Research అనే అర్థం సూటిగా రావటం లేదు.

మామిడి వేంకటార్యుని నిఘంటువులో శోధన పదానికీ క్రింది అర్థాలు పేర్కొనబడ్డాయి.

(i) శుద్ధే - మలాపనయనే.

(ii) ఋణాది నిర్యాతనే—అప్పు తీర్చుట, పగ తీర్చుట.

(iii) విహితా విహిత మాసాది విచారణే.

(iv) విష్టాయామ్ (మలము)

(v) కాశీసే (అన్నభేది)

(vi) ధాతూనామ్ నిర్దోషీకరణే — తామ్రాది ధాతువుల్ని శుద్ధి చేయుట.

(vii) లిఖిత పత్రాదేః ప్రమాణీకరణే — వ్రాతలోని తప్పుల్ని సవరించటం, పరిష్కరించటం.

'Research' అనే అర్థం లాంటి అర్థం ఇందులో లేదు.

కాని మోనియర్ విలియమ్సు నిఘంటువులో Investigation అనే అర్థం విశేషంగా పేర్కొనబడింది. Investigation, Research లో ఒక భాగం. విచారణ చేసి క్రొత్త సిద్ధాంతాల్ని సమకూర్చటం పరిశోధన అవుతుంది. అయినా ఆంగ్లాంధ్ర ప్రౌఢ్య నిఘంటువు Investigation అంటే పరిశోధన మన్నది.

సంస్కృతంలో పై రీతిగా వున్నా, తెలుగులో 'శోధన' పదం అన్వేషణ, వెదకటం అనే అర్థంలో నన్నయ భారత రచనలోను ప్రయోగింపబడింది.

కం॥ నానా విహార శైలో
ద్యాన సభా తీర్థ దేవతాగృహ మృగయా
స్థానమున కరుగు నెడమును
మానుగ శోధింప వలయు మానవపతికిన్॥

(భార. ఆది. VI – 108)

ఈ విధంగానే

''వ॥...లక్కయిల్లు వెలువడునట్లుగా నొక్క బిలంబు నెవ్వరు నెఱుంగ కుండఁజేసి వారల కెఱింగించిన భీముండు దాని నిమ్ముగా శోధించి యెఱింగి యుండునంత''

(ఆది. VI – 158)

నన్నె చోడుడు కూడా ఈ రీతిగానే ఈ పదాన్ని ప్రయోగించాడు :

''గణాధీశ్వరులెల్ల కడలను శోధించి''

(II – 76)

శ్రీనాథుడు :

కం॥ బహువర్ష సహస్రంబులు
ద్రుహిణుండును హరియు నధ్యధో భువనంబుల్
బహుల క్రియ శోధించిరి
దహనస్తంభంబు తుదయుఁదన్మూలంబున్॥

(శివరా. I–101)

వరాహ పురాణ ప్రయోగాన్ని (V – 67) ఈ అర్థంలోనే సూ. ని. చూపింది.

ఈ ప్రయోగాలన్ని, ఇల్లు, ప్రదేశాలు మొదలైనవి గాలించటం (investigation) అనే అర్థంలోనే ఉన్నాయి. కాని విద్యా విషయికంగా అన్వయిస్తు ఈ అర్థంలో పోతన కావించిన భాగవత ప్రయోగాలు పరిశీలింపదగినవి.

అది ప్రహ్లాద చరిత్ర. హిరణ్యకశిపుడు తన పుత్రుడ్ని గ్రంథాలు చదివించమని గురువుల కప్పగిస్తాడు. కొన్నాళ్లకు పిలిపించి, ప్రహ్లాదుని 'విద్యా పరిశ్రాంతి'ని పరీక్షిస్తాడు. 'ఆ రూఢ సంవిత్సంపన్నుడవైతివే ?' 'చదివితే వేదంబులున్ శాస్త్రముల్ ?' అని 'వాత్సల్య సంపూర్ణుడై, ఉత్సంగాగ్రం'లో కూర్చో పెట్టుకొని ముద్దు ముద్దుగా ప్రశ్నిస్తాడు.

ఈ ప్రశ్నలకు ప్రహ్లాదుడు వేదాంత చర్చ చేస్తాడు. రాజ సేవకుడైన పురోహితునికి ఎంతో బాధనిపిస్తుంది. వయసుకు మించి 'భాషించెదు తర్కవాక్యములు; చెప్పిన శాస్త్రములోని అర్థ మొక్కించుకయైనఁ జెప్పవ'ని ప్రహ్లాదుడ్ని మందలించి, ఇక మీద గట్టిగా చదివిస్తామని; కోపించి, దండించి నిపుణతతో విద్య నేర్పు తామని తీసుకుపోతారు.

ఈ పర్యాయం గురువులే ప్రహ్లాదుడ్ని ప్రభువు ముందు నిలబెట్టి 'గట్టిగా శిక్షణ గరిపాము. పరీక్షించండ'ని అర్థిస్తారు.

1929లో మద్రాసు విశ్వవిద్యాలయానికి '11వ శతాబ్దపు తెలుగు భాషను' గూర్చి సిద్ధాంత వ్యాసం రచించి డాక్టరేటు బిరుదాన్ని చేబట్టారు.* ఈ వ్యాసం అప్పటి నియమాన్ని అనుసరించి ఆంగ్లంలో రచింపబడింది. దీన్నిబట్టి ఆధునిక పద్ధతుల్లో పరిశోధన తెలుగులో ప్రారంభమై యాభై సంవత్సరాలు పూర్తి అయిపోయనన్నమాట. 1979వ సంవత్సరం తెలుగు పరిశోధనకు స్వర్ణోత్సవంగా భావించవచ్చు.

డాక్టర్ నారాయణరావుగారి ఈ సిద్ధాంత వ్యాసం వారి 'తెలుగు భాషా చరిత్ర' కనుబంధంగా తెలుగులో ప్రచురింపబడింది. ఇది కొంతవరకు పరిమిత పరిశోధనమే అనవచ్చు. కాని యిందు లోను చిక్కుంది. 11వ శతాబ్దపు కావ్యభాషనే వీరు చేబట్టారు. 11వ శతాబ్దపు శాసనభాష దీనికి కొంత భిన్నంగా వుంటుంది. అది నాటి వ్యవహారానికి కొంత సన్నిహితంగా వుంటుంది.

1929 నుండి 1944 దాకా ఇటువంటి సిద్ధాంత వ్యాస సమర్పణం ఎవరు చేసినట్లు కనిపించదు. 1944లో మా సాహిత్య గురువులు కాకర వెంకట రామనరసింహంగారు, ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి పర్యవేక్షణలో సాహిత్యరంగంలో కృషిచేసి పిహెచ్. డి. పట్టాన్ని పొందారు. 1965లో ఆంధ్ర విశ్వవిద్యాలయం దాన్ని ముద్రించింది. అది "ఆంధ్రప్రబంధము–అవతరణ వికాసములు". తెలుగులో విరచితమైన మొట్టమొదటి సిద్ధాంత గ్రంథమది. అంతే కాదు. యావత్ కళారంగంలో ఆంధ్రవిశ్వవిద్యాలయంలో తొలి పరిశోధన వ్యాసమిదని సగర్వంగా చెప్పుకొనేవారు. అయితే యిది మ్యాక్రోస్కోపిక్ పరిశోధనే. ఒక్కొక్క ప్రబంధం మీదనే ఒక ప్రత్యేక పరిశోధన వ్యాసం వ్రాయవచ్చు. ఆవిధంగా తరువాత చాలా మంది సూక్ష్మపరిశోధనం కావించి పట్టాలు చేబట్టారు.

## 3

ఆచార్య గంటి జోగి సోమయాజులుగారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలోను, ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు ఉస్మానియా విశ్వవిద్యాలయంలోను, శాఖాధిపతులయిన తరువాత తెలుగులో పరిశోధన బాగా అభివృద్ధి పొందింది.

విస్తృతమైన విస్మృత జానపద సాహిత్యాన్ని ఆపోశన పట్టిన అగస్త్యులు ఆచార్య రామరాజుగారు. వారి పరిశోధన వ్యాసం 1958లోనే తొలి ముద్రణాన్ని పొంది తిరిగి ఇప్పుడు రెండో ముద్రణాన్ని పొందింది. ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారి "తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావము" అనే సిద్ధాంతవ్యాసం 1960 లోనే ముద్రితమైంది. ఇదంతా విస్తృతరంగంలో కొనసాగిన పరిశోధన. పరిశోధన ప్రారంభ దశలో విస్తృత ప్రాతిపదికపైనే జరుగుతుంది. క్రమంగా గాని ఏకదేశమైన సూక్ష్మ సూక్ష్మ పరిశోధనల కవకాశం వుండదు సాధారణంగా. అందుచేత ఈ దశాబ్దాన్ని (1970 దాకా) 'వికాసయుగం' అనవచ్చు. ఈ కాలంలో వెలువడ్డవే 'ఆంధ్రరూపక వికాసం', 'తెనుగు వ్యాకరణ వికాసం', 'ఆంధ్రవ్యాకరణ వికాసం' మొదలైనవి. ఇది ఖచ్చితంగా అనేమాట కాదు. ఎందుకంటే ఈమధ్యనే 'శతక వాఙ్మయ వికాసం' వచ్చింది. ఇదంతా విస్తృత పరిశోధనకు సంబంధించింది (**Intensive research**). ఇది రాశి ప్రధానంగా సాగిన పరిశోధన. (**Quantitative research**)

ఈ విధమైన పరిశోధనలవల్ల కొన్ని ప్రయోజనాలున్నాయి. ఒక విషయం ఎలా ప్రారంభమై వికసించింది, బాగా విహంగావలోకనం చేయవచ్చు. ఉత్తరోత్తర పరిశోధనల కివి రాచబాటలు తీరుస్తాయి. ఏయే అవాంతర విషయాలపై సూక్ష్మంగా పరిశోధన సాగించటానికి అవకాశాలున్నాయో వీటివల్ల విదితమౌతాయి.

అయితే లోపాలు-- నిపేరులోనే వున్నట్లు ఇదంతా స్థూల పరిశీలనం. సూక్ష్మమైన వివరాల్లో కొన్ని లోపాలు అక్కడక్కడ కల్గుతాయి. ఉదాహరణకు: నా సిద్ధాంత గ్రంథమేవుంది తెనుగు వ్యాకరణ వికాసం రెండు సంపుటాల్లో. 1969లో ప్రచురితం. ఇందులోని లోపా లిప్పుడిప్పుడు తెలుస్తున్నాయి–ఇతరులవల్ల కొన్ని, నా అంతట నేను కొన్ని తెలుసుకొంటున్నాను. ప్రౌఢ వ్యాకరణానికి ముందే కందుకూరి వారి సంగ్రహ వ్యాకరణం విరచితమైతే నేను వ్యతిరేకంగా రాసాను. ఉపయోగంలో ఆఖ్యాతకు 'తోడ'వర్ణకం నన్నయ ప్రయోగాలాధారంగా చిన్నయ తొలుత విధించాడని నేను పేర్కొన్నాను. కాని తీరా పరిశీలిస్తే—వైకృత చంద్రికలో వాసుదేవ కవి సూత్రించాడు. చిన్నయ ఆ సూచన నందుకొన్నట్లు విదితమైంది. నేను వైకృత చంద్రిక 1962లో వ్రాసుకొన్నాను. కాని అప్పుడెందుకో యిది కనిపించలేదు. పునర్ముద్రణ యోగ్యతవుంటే సవరించుకోవాలి. ఇంకెన్ని లోపాలున్నాయో ! గాలించాలి.

ఇంకో ఉదాహరణం —

"సందెలను దారిదప్పు మిళింద సుతుల
తేనె పాలిచ్చి చీకట్లం దిరుగనీక

---

* "1927లో చిలుకూరి నారాయణరావుగారు 'పదకొండవ శతాబ్దము నాటి తెలుగుభాష' అనే సిద్ధాంత వ్యాసం వ్రాసి మద్రాసు విశ్వవిద్యాలయంలో పిహెచ్. డి. 'పట్టం' పుచ్చుకొన్నట్లు డాక్టర్ కులశేఖరరావుగారు ఉస్మానియా విశ్వవిద్యాలయ డైమండ్ జూబ్లీ తెలుగు సంచికలో వ్రాసారు (పుట 101). కాని ఆచార్య జి. యన్. రెడ్డిగారు మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖలో 29–3–79న ఉపన్యాసంలో '1929' అన్నారు. ఆచార్య వాక్యం ప్రమాణంగా స్వీకరించాను.

ఉదయమగుదాక యొడిలోన నిదురబుచ్చు
చేరదీసిన మమతకు జిక్కినళిని॥''

అనే రాయప్రోలు వారి పద్యాన్ని పురస్కరించుకొని ''ఇది అపూర్వ విషయము. ఏ లాక్షణికులును, కవులును, ఈసంబంధ మూహింప లేద''ని డాక్టర్ నారాయణరెడ్డి గారు తమ సిద్ధాంత వ్యాసం — ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు, ప్రయోగములలో వ్రాసారు. (పుట 302 1967)

పద్మ భ్రమరములకు అనాదిగా నున్న ప్రేయసీ ప్రియ సంబంధమును త్రోసివేసి, మాతా పుత్ర సంబంధము కల్పించుట అపూర్వ విషయం గాదు. క్రీ.శ. 16వ శతాబ్దంలో నున్న తెనాలి రామకృష్ణుడు 'పాండురంగ మాహాత్మ్యము'లో పుష్పభ్రమరములకు మాతా పుత్ర సంబంధాన్ని ఊహించి నూతన కవి సమయాన్ని ఉపజ్ఞా బలంతో రమ్యంగా ప్రయోగించాడు :

''దామోదరుడు యశోదాస్తన్య మానెడు
నని మ్రొక్కు విరిగుత్తి నళిభ్రమింప''

(V – 299)

పూలగుత్తిలో భ్రమరము సంచరించుటను చూచిన కన్యాకుబ్జ రాజకుమారై వాత్సల్య స్ఫోరకంగా కృష్ణుడు యశోదా స్తన్యము గ్రోలుచున్నాడని తలంచుట నవ్యత! అనంతమైన ప్రకృతి యందలి సహజమైన సదమలమైన మాతృ శిశు బంధ మధుర ధర్మమును సంగ్రహించిన రామకృష్ణుని ప్రయోగం మౌలికము;నవ్యాతినవ్యము'' అని ఏడాదిక్రితం 'భారతి'[1] లో ఒక వ్యాసం చదివి ఆనందించాను. ఇటీవల పునర్ముద్రణం పొందిన డాక్టర్ రెడ్డిగారి పరిశోధన గ్రంథాన్ని చూచాను—సవరణ వుంటుందేమో అని. కనిపించలేదు.[2]

పరిశోధకులు కూడా మానవ మాత్రులేకదా!. 'ప్రమాదో ధీమతామపి' అని అన్నారు మన ఆర్యులు. కాళిదాస కవి ఇటువంటి వాటికి రక్షణమార్గం చూపించాడెప్పుడో–''ఏకోహి దోషోగుణ సన్ని పాతే, నిమజ్జతీందోః కిరణేష్వివారికః'' అని.

ఇంత ఎందుకు చెప్పవలసి వచ్చిదంటే — పరిమిత విషయం పరిశోధిస్తే యిలాంటి దొసగులు దొర్లకుండా చూచుకోవచ్చు. మహాకావ్యం (కొన్నివేల పద్యాలైనా) రాస్తేకాని మహాకవి కానట్లుగా, మహాగ్రంథం రాస్తేకాని గొప్ప పరిశోధకుడు కాడనే అభిప్రాయం వెనకటి తరంలో వున్నట్లు గోచరిస్తుంది. మా గురువుగారు సోమ యాజులు గారంటుండేవారు—**Qualitative and Quantitative work** కావాలని. ఇది భారతీయ సంప్రదాయమేమో! అందామంటే 'వాక్యం రసాత్మకం కావ్యమ'నేది భారతీయ సంప్రదాయమేకదా. ఉప జ్ఞాతా పూర్వకమైన రచన కొంచెమైనా గంగిగోవు పాలవంటిదవు తుందనటంలో సందేహంలేదు.

## 4

సూక్ష్మపరిశోధన : **(Microscopie or Intensive Research)**

ఏకదేశమైన అంశంపై లోలోతులుగా సాగించే పరిశోధన ఈ కోవకు చెందింది.

తెలుగులో ప్రాబ్భన్నయి కాలానికి చెందిన శాసనాలు సుమారు రెండువందలదాకా వుంటాయి. ఈ శాసన పాఠాల్ని నిర్ణయించి, శాసన భాషకు వర్ణనాత్మకంగా వ్యాకరణం రాయటం ఈ విధమైన పరిశోధనం.

ఆంధ్రభాషా చరిత్రలోను, ఆంధ్రభాషా వికాసంలోను ఈ శాసనాల ప్రసక్తి వస్తుంది. తత్కర్తలు ఈ శాసనాలపై కొంత కృషిచేసారు. కాని వారి గ్రథరచనలు చాలా విస్తృతం కావటంచేత, వీటిమీదనే వారి చూపు కేంద్రీకృతం కాలేదు. శ్రీ బూదరాజు రాధాకృష్ణగారు (ప్రస్తుతం తెలుగు అకాడమీ డిప్యూటీ డైరెక్టర్) ఈ విధమైన కృషిచేసారు. ఇదిభాషా విషయిక చారిత్రక పరిశోధనం కూడా కాని వారి సిద్ధాంత చారిత్రక వ్యాక రణం ముద్రితం కాలేదు· ప్రాచీనాంధ్ర శాసనాల్ని, లఘుటిప్పణతో సాహిత్య అకాడమీ ప్రచురించింది.

తెలుగు పదజాతంలో 'తద్భవాలు' ఏకదేశం. ఇవి సంస్కృత జన్యాలే కాకుండా వివిధ ప్రాకృత భాషలనుండి ఏర్పడ్డాయి. వివిధ ప్రాకృత భాషల్లో మంచి కృషిచేసి 'వైకృత పదస్వరూప నిరూపణం' కావించారు, ఆచార్య దొణప్పగారు. కాని వీరిసిద్ధాంత గ్రంథంకూడా అముద్రితంగానే వుండిపోయింది. 'అన్యదేశాల'మీదకూడా సిద్ధాంత వ్యాసాలు వచ్చాయి. కాని అవీ యింతదనుక ముద్రితాలు కాలేదు. ఆంధ్ర విశ్వకళాపరిషత్ లైబ్రరీలోనే వుండిపోయాయి. పరిశోధ నలు కొన్ని డిగ్రీ లిప్పించటమే ప్రయోజనంగా గిలవి. కొన్ని పఠన పాఠనాల్లోకి వచ్చి, విద్యార్థిలోకానికి ఉపకరించేవి. అదృష్టవశాత్తు చాలా పరిశోధనలు తెలుగులో అచ్చవుతున్నాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చాలామందికి ఐదువేల రూపాయలుదాకా గ్రాంటిచ్చి తోడ్పడుతున్నది. ఇంకా పలుకుబడిగల అదృష్టవంతులకు పదేసి వేలు కూడా ఇస్తున్నది. ఇందుకు ప్రభుత్వాన్ని అభినందించాలి.

పరిమిత పరిశోధనం సాహిత్య రంగంలో కూడా సాగింది. నాచన సోమనాథుని ఉత్తర హరివంశంమీదనే కృషిచేస్తే అది వరి

---

1 ''కవి సమయములు—క్రొత్త ప్రయోగములు'' శ్రీ కె. వి. రాఘవాచార్య—భారతి—ఏప్రిల్ 1978.

2 పునర్ముద్రణం 1977లోనే జరిగింది· అందుచేత ఈవ్యాసం చూచి వారి సవరించుకోటం సంభవించదు. వారంతటివారు పునరాలోచన చేయటం సాధ్యపడదు. (పుట 286.)

మిత పరిశోధనమే అవుతుంది. ఏ ఒక్క కావ్యాన్నో చేబట్టి సాహిత్య పరంగానే కాక, భాషాపరంగాను సమగ్రమైన పరిశోధనం చేయటం సామాన్య విషయంకాదు. చాలా మంది సాహిత్యపరులు భాషావిషయాన్ని విస్మరించటం విచార్యం. కొంతమంది కావ్యభాషను వర్ణించటం ప్రారంభించి అందులోని ఉత్వసంధులు, ఆగమ సంధులు మొదలైన ప్రసిద్ధ విషయాలన్నీ క్రోడీకరించటమే పరిశోధనం అనుకొంటున్నారు. అంతకన్నా ఆ కావ్యభాషలోని విశిష్టలక్షణాలు— అంటే నుగాగమం రాని రూపాలు; నాగాగమం రానివి; అలాగే కొలకు వంటి ఏకవచన రూపాలు (నిర్ధారకమైనవి) బుత్విక్కు, హనుమానుడు భగవానుడువంటి తత్సమాలు నిరూపిస్తే ఆసక్తి జనకంగాను ప్రయోజనకరంగాను వుంటాయి

పరిమిత పరిశోధనంలోను లోపాలు లేకపోలేదు. అవి ఎంత వరకు లోపమో, గుణమో నిజ్ఞులు నిర్ణయించాలి. ఏ నవలమీదనో డాక్టరేట్ బిరుదు తెచ్చుకొని, ఇంకో నవలను గురించి ప్రశ్నిస్తే నాకు తెలేదంటం విడ్డూరంగానే వుంటుంది. అలాగే సాహిత్యంలో ఒక కావ్యంపై పరిశోధన చేసిన వ్యక్తికి ఇతర కావ్యాలను గూర్చిన ప్రాథమిక పరిజ్ఞానం కూడా లేదని చెప్పకోటం వారి నిజాయితీకి నిదర్శన మౌతుందే కాని ఈమాత్రం నేపథ్య పరిజ్ఞానం లేనివ్యక్తి కింతటి ఉత్తమ బిరుదేమిటని లోకం అనుకుంటుంది.

ఇక్కడ భారత. భారతీయేతర దృక్పథాలున్నాయి. భారతీయ విద్వాంసులు చాలామంది, సర్వజ్ఞులుగా సంచరిస్తారు. తెలేదంటం వారికి నామర్దా, భారతీయేతరులకు తెలేదంటంలో దంభం కనిపిస్తుంది. ప్రతి రంగంలోను నేపథ్య పరిజ్ఞానం ఎంతో వుంటుంది. అది బాగా సంపాదించిన వారికే పరిశోధన కనుమతిస్తే బాగుంటుందేమో !!

## 5

మరో దృక్కోణంనుండి పరిశీలిస్తే పరిశోధన రెండు విధాలుగా సాగించవచ్చు.

(I) ప్రత్యక్ష పరిశోధన (Direct research)

(II) పరోక్ష పరిశోధన. (Indirect research)

భాషాపరమయిన పరిశోధన ప్రత్యక్షంగా సాగించటానికి బాగా అవకాశాలున్నాయి. ఒక వ్యక్తితో కాని, ఒక సంఘంలోని వ్యక్తులతోగాని ముఖాముఖి సంబంధం పెట్టుకొని వారి భాషణాల్ని ధ్వని విధేయంగా రాసుకొని, టేపు రికార్డు చేసికొని, వారి మాండలికానికి వ్యాకరణం రాయటం. అమెరికాలో ఈ విధమైన ప్రత్యక్ష కృషి చేసిన వారినే భాషాశాస్త్రజ్ఞులుగా గుర్తిస్తారు. అందుకు వారి కనుకూలంగా కొన్నివేల రెడ్ ఇండియన్ భాషలున్నాయి. వాటికి లిపిలేదు. వాటిలో ఏ భాషా మాండలికానికి చెందిన వ్యక్తితోనైనా ప్రత్యక్ష సంబంధం ఏర్పరుచుకోవచ్చు. తమ భాషాశాస్త్ర పాండిత్యాన్ని ఈవిధంగా వారు ప్రయోగశాలలో బెట్టి నిగ్గుతేలుస్తారు. ఇటు వంటి కృషి మనవాళ్లు ఎక్కువగా చేబట్టలేదు. ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు తాము అమెరికానుండి వచ్చిన క్రొత్తల్లో అరకు లోయలోని 'కొండ'భాష కిటువంటి వ్యాకరణం రచించారు.

అంతేకాకుండా సాహిత్య అకాడమీ పక్షాన గొప్ప ప్రణాళిక రచించి, ప్రత్యక్ష భాషాపరిశీలకుల్ని దేశం నలు ప్రాంతాలకు పంపి, వ్యవసాయ వృత్తి పదకోశాన్ని చేకూర్చారు. వారి కండదండగా ఆచార్య దొణప్పగారు ఉన్నారు. ఈవిధంగా బూదరాజువారు 'వాస్తు పదకోశం' రచించారు. వివిధ వృత్తులకు ఇలా కోశాలు రచింపచేసి, నశించిపోతున్న పదజాలాన్ని పరిరక్షించాలనే ఆచార్య భద్రిరాజువారి సంకల్పం ఉదాత్తమైంది. ఇది నెరవేరాలంటే సుశిక్షితులు, స్వార్థ రహితులైన భాషాభిమానులు కావాలి. అప్పుడే ఆ కృషి పూర్తిగా ఫలిస్తుంది.

భాషా పరమైన పరోక్ష పరిశోధన మంటే, లిఖిత భాషా సంబంధమైన పరిశోధనం. కన్యాశుల్కంలోని విశాఖ మాండలికం పైగాని, శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కథల్లోని తూర్పు గోదావరి మాండలికంపైగాని, లిఖిత సామగ్రి ఆధారంగా చేసే పరిశోధనం 'పరోక్ష పరిశోధనం'. ఇటువంటి కృషి కూడా మన దేశంలో ఎక్కువగా సాగటంలేదు. దీనికి భాషాశాస్త్రంలో సుశిక్షితులైన పర్యవేక్షకులు లేకపోవటం; విద్యార్థులకు భాషాశాస్త్రంపై ఆసక్తి అధికంగా లేకపోవటం; సాహిత్య సంబంధంగా అయితే సులువుగా రచన సాగించ వచ్చుననే దురభిప్రాయం వ్యాప్తిలో వుండటం కారణాలు కావచ్చు.

వ్యాకరణాలాధారంగా కావించే పరిశోధనం కూడా పరోక్షమైనదే. వ్యాకరణ వాఙ్మయ మంతా తీసుకొని చేసే కృషి 'స్థూల పరిశోధన' మైతే; అందులో ఏ ఒక్క లక్షణ గ్రంథమో, లేక ఏ సమాసాలో, కారకమో, కృత్తులో, తద్ధితాలో గ్రహించి వివిధ లక్షణ గ్రంథాలు, కావ్యభాష, వ్యవహార భాష ఆధారంగా చేసే పరిశోధనం ''సూక్ష్మ పరిశోధన'' మనిపించుకుంటుంది. ఇప్పుడీ విధమైన పరిశోధనమే అధికంగా సాగాలి.

సాహిత్య పరంగా ప్రత్యక్ష పరిశోధనం సజీవులయిన కవులైతేనే సాధ్య పడుతుంది. కవితో ప్రత్యక్ష సంబంధం కల్గి, అతని ఆశలు, ఆశయాలు పరిశోధకుడు గుర్తించాలి. కవి మనస్తత్వాన్ని బాగా ఒరపిడి బెట్టి అతనిపై ప్రత్యక్ష, పరోక్ష, అతి పరోక్ష, అంతర్గతాది (Substratum) ప్రభావాలే రీతిగా ప్రసరించాయో పసిగట్ట గల్గాలి. ఇటువంటి పరిశోధన ఇంతవరకు ఏ ఆధునిక కవి మీదనైనా జరిగిందా ? అని అనుమానం.

జానపద సాహిత్యంపై ప్రత్యక్ష పరిశోధనం చేయవచ్చు. ఆయా పాటలు పాడే ప్రజల మధ్య ఉండి, ఆ పాటలు, వాటి ఫణుతులు ప్రత్యక్షంగా గుర్తించి, పాటలు రాసుకొని వానిపై సిద్ధాం

తాలు చేయాలి. లిఖిత జానపద వాఙ్మయంపై కావించే కృషి పరోక్షమైందే. ఇలాంటి కృషి ఇంకా ఎంతో జరగాలి. ఇది తరగని పెన్నిధి.

## 6

పరిశోధనలు జరుగుతున్న తీరు ననుసరించి, త్రి విధాలుగా ఈ క్రింది రీతిని నిరూపించవచ్చు:

(1) వర్ణనాత్మక పరిశోధనలు: (Descriptive researches) భాషా పరంగా ఒకానొక మాండలికాన్ని గాని, ఒక కవి యొక్క కావ్య భాషనుగాని వర్ణించటం. ఇటువంటి కృషి నన్నయాది కవుల భాషలకు కొందరు కావించారు. ఇతర కవులను గూర్చి ఇంకా ఎంతో జరగాలి.

సాహిత్యపరంగా కావ్యాల్ని వివరించటం గూడ(interpretation) ఇటువంటిదే.

(2) చారిత్రక పరిశోధనలు: (Historical researches) ఈ పరిశోధన సాగటంలేదనే అనిపిస్తుంది. మనకు చారిత్రక నిఘంటువులు లేనేలేవు. సాహిత్య ప్రక్రియ ఎలా ప్రారంభమై అభివృద్ధి చెందిందో చెప్తే అది చారిత్రకమే అవుతుంది.

(3) తులనాత్మక పరిశోధనలు:(Comparative researches) సాహిత్య పరంగాను భాషా పరంగాను ఇటువంటి కృషి జరపవచ్చు

భాషా పరంగా తొలుత ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి గారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ప్రారంభించారు — తెలుగు ధాతువులపై. తెలుగు దేశ్య ధాతు స్వరూపం ఇతర ద్రావిడ భాషలలోని ధాతు స్వరూపాలతో పోల్చి, మూల ద్రావిడ ధాతువుల్ని నిర్ణయించారు. ఈ కృషిని వారు అమెరికాలోని పెన్సిల్వేనియా యూనివర్సిటీ ఆచార్య ఎమెనోగారి పర్యవేక్షణ క్రింద తుదిముట్టించి, డాక్టరేట్ బిరుదాన్ని అందుకోవటమే కాక భారతీయ భాషా శాస్త్రజ్ఞుల్లో అగ్ర తస్సరులుగా ఖ్యాతి నార్జించారు. వీరి కృషి తమ "ద్రావిడ భాషా నిరుక్తా"నికి(Dravidian Etymological Dictionary) ఎంతో ఉపకరించిందని తత్కర్తలు ఆచార్య బరో, ఆచార్య ఎమెనోలు కృతజ్ఞత ప్రకటించారు, ఆచార్య కృష్ణమూర్తికి.

ఇటువంటి కృషినే "మూల ద్రావిడ క్రియా స్వరూపా"న్ని నిర్ణయించటానికి ఆచార్య పి. యస్. సుబ్రహ్మణ్యంగారు (అన్నామల విశ్వవిద్యాలయ భాషాశాస్త్ర కేంద్రం) కావించి, కీర్తి నార్జించారు. ఈ విధమైన కృషి కృత్తద్ధితముల నిర్ణయంలోను, కారకాదుల్లోను, సాగించవలసి వుంది. దీనికి 23 ద్రావిడ భాషల్లో చొరవ కావాలి. భాషాశాస్త్ర నేపథ్యజ్ఞానం బాగా వుండాలి.

సాహిత్య పరంగా తులనాత్మక పరిశోధన అత్యంత సక్తికరంగా వుంటుంది. సమానేతి వృత్త రచన కావించిన కవులను తులనాత్మకంగా పరిశీలించి వారి వారి కవిత్వ పటుత్వాన్ని బేరీజు వేయవచ్చు. ఈ కవులు సమకాలీనులు, సమాన కవితాదర్శాలు కలవారైతే ఇంకా ఇది శోభిస్తుంది. పూర్వం కందుకూరి వీరేశలింగం, నడకుదిటి వీరరాజు వంటి సాహిత్యవేత్తలు ఉత్తర హరివంశ కర్త నాచన సోమనాథుడ్ని, హరి వంశ కర్త ఎఱ్ఱాప్రెగ్గడను పోల్చి, ఎఱ్ఱన కవిత కన్న సోమన కవిత మిన్న అని, వైభవోపేతమైనదని ప్రశంసించారు. కాని రసజ్ఞులు రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు పైవారి వాదాల్ని రమ్యంగా పూర్వ పక్షం చేసి, ఎఱ్ఱన కవిత సత్వోద్రిక్తమైనదని, ఇల్లాలి వంట వంటిదని, సహజ సౌందర్య విలసితమైనదని నిరూపించారు. ఈ విధమైన తారతమ్యం వారి లక్ష్యాల్లో గల భేదాల్ని అనుసరించి ఏర్పడింది. సోమన్నది ప్రౌఢ ప్రబంధ రచన, ఎఱ్ఱనది అల్పధీమంతులకు ఆనందాన్ని చేకూర్చే పురాణరచన. ఇటువంటి వాఙ్మయ రహస్యాలు గుర్తించ కుండా చేసే విమర్శ గురిలేని వేట లాగా వుంటుంది.

తులనాత్మక పరిశోధన ఏక భాషా కవులలోనే కాక అనేక భాషలకు చెందిన కవులను గూడ గైకొని నిర్వహించవచ్చు. హిందీ కవులను తెలుగు కవులతో పోల్చి తులనాత్మక పరిశోధన చాలా జరిగినట్లు వింటున్నాం.

వేమన వంటి తెలుగు ప్రజాకవిని, సర్వజ్ఞునివంటి కన్నడ ప్రజాకవిని తులనాత్మకంగా పరిశోధించి, డాక్టరేటు బిరుదం అందుకొనే అదృష్టం మద్రాసు విశ్వవిద్యాలయ ఆంధ్రా చార్యులు శ్రీ గంధం అప్పారావుగారికి దక్కింది. వారి సిద్ధాంత వ్యాసం ఈ మధ్యనే మద్రాసులో ఆవిష్కృతమైంది. ఎటువంటి పాండిత్యాడంబరాలకు పాలుపడకుండా, కేవలం విషయ ప్రధాన దృష్టితో కావించిన పరిశోధనమిది.

మైసూర్ను విశ్వ విద్యాలయ తెలుగు శాఖాధిపతులు, కన్నడాంధ్ర భాషా నిష్ణాతులు, కవులు, డాక్టర్ బాడాల రామయ్యగారు తెలుగు భారతాన్ని, కుమార వ్యాసుని కన్నడ భారతంతో పోల్చి నన్నయాది తెలుగు కవుల ప్రతిభా వ్యుత్పత్తుల్ని నిగ్గు తేల్చారు, అనేక వ్యాసాల్లో. వీరు స్వయంగా కవులు, పరిశోధకులునై, బసవేశ్వరుని కాలాన్ని అపూర్వంగా నిర్ణయించటమేకాక, ఆతని వచనాల్ని మధురాతి మధురంగా అనువదించి డి. లిట్. అందుకొన్నారు. కవితా ప్రాభవం, విమర్శన వివేకం రెండూ ఒక్కరిలో ఉండటం అపూర్వం.

ఇప్పుడనేక విశ్వ విద్యాలయ కేంద్రాల్లో, స్నాతకోత్తర కళాశాలల్లో ఆంధ్ర ఆంధ్రేతర ప్రాంతాల్లో తెలుగు పరిశోధన మూడు

పూలు, ఆరు కాయలుగా సాగుతుంది. పునరుక్త పరిశోధనలు**కూడా** సాగుతున్నాయి సాహిత్యపరంగా పునరుక్త కృషి అసహ్యమనిపించు కోదు–వ్యక్తి నిష్ఠమైన రచనా తారతమ్యం ఉంటుంది కాబట్టి. భాషాపరంగా చేసేది విశేషంగా వస్తు నిష్ఠంగ (Objective) వుంటుంది కాబట్టి నివారించటం మంచిది.

ఈ కృషినంతా సమన్వయించటానికి తెలుగు అకాడమీవారు ప్రయత్నిస్తున్నారు. వీరు ''తెలుగు పరిశోధన సంహిత'' నొకదాన్ని ప్రచురించారు. ఇందులో ఒక వందమంది దాకా కావించిన, కావిస్తున్న పరిశోధన వివరాలున్నాయి. ఇంకా విస్తృత ప్రాతిపదికమీద తెలుగులో జరుగుతున్న పరిశోధన కృషిని సమీకరించటానికి తెలుగు అకాడమీ యత్నిస్తున్నది. ఇంత మాత్రంతో తృప్తిపడరాదు. ఒక్కొక్క పరిశోధనలోని ఉపజ్ఞతను మంచి పండితులచేత సంక్షిప్తంగా సమీక్షింపచేస్తే బాగుంటుంది. ఆయాపరిశోధకులు తాము పెట్టుకొన్న లక్ష్యాలు తమ వ్యాసాలద్వారా సాధించి సఫలులైనారా లేదా అనే సమీక్ష జరగాలి. శ్రీ అరవిందులు విమర్శతత్త్వాన్ని యిలా పేర్కొన్నారు –

The true spirit of criticism is to seek in a literature, what we can find in it, great or beautiful; but not to demand from it, what it does not seek to give.

పరిశోధకులకు, పరిశోధనల్ని పరీక్షించేవారికి పైవి వేద వాక్యాలు.

## 7

కొన్ని సందేహాలు సామాన్యులకు జనిస్తాయి. సాహిత్య పరిశోధన గొప్పదా? భాషా విషయక పరిశోధన గొప్పదా? అని. దేని కదే గొప్ప. నిజానికి భాషా పరిశోధన, దాని మెలకువ తెలిస్తే యాంత్రికంగా చేయవచ్చు. కాని సిద్ధాంతాలు చేయాలంటే ఎందులోనైనా (కళలోగాని శాస్త్రంలోగాని) అంతఃకరణ ప్రేరణం (Intuition) కలగాలి. అది నిర్మలచిత్తు ఉన్నప్పుడే కల్గుతుంది.

ఒక్కొక్కప్పుడు సాహిత్య పరిశోధనే కష్టతరమైంది. ఇందులో విషయ ప్రతిపాదనలో రచయితకు ఆకర్షణీయమైన శైలి కావాలి. మహాకవుల ఆత్మీయతను నిర్ణయించటానికి జాతిసంస్కృతి, లోతులు తెలియాలి. మనస్తత్వశాస్త్ర పరిజ్ఞానం కావాలి. సామాన్య కవులను గూర్చిన పరిశోధన కింతటి పరిజ్ఞానంతో పని లేదు. నన్నెచోడుడు, పాల్కురికి సోమనాథుడు వంటి కవుల కవితా మహత్తులో దాగిన మతాచార సంపద, వివిధాగమ విజ్ఞత సామాన్య పరిశోధనలవల్ల విదితమౌతాయా? శ్రీకృష్ణదేవరాయల వైష్ణవ భక్తిప్రపత్తులు, పోతన వంటి భక్తకవి యోగి అభేద భక్తితత్త్వం సామాన్య సారస్వత విద్యార్థుల అవగాహన కందుతాయా? అందుకు వారు ప్రత్యేక గురువుల సేవచేసికాని ఆ విషయాలను తరించలేరు. అందుకే అంటారు – భగవాన్ భర్తృహరి :

''అనుపాసిత వృద్ధానామ్ విద్యానాతి ప్రసీదతి'' యక్ష ప్రశ్నల్లో భగవాన్ వ్యాసుడనిపిస్తాడు.

''అతిశయముగ బుద్ధిమంతుడగు బుధ సేవన్''. నేటి పరిశోధకుల కిది ఎంతో అవసరం అనిపిస్తుంది.

సారస్వత పరిశోధకులు భాష విషయికంగాను; భాషాపరిశోధకులు సారస్వత విషయికంగాను ఏవగింపును పెంచకూడదు. అసలు ఉండనే కూడదు. సారస్వతం లేనిది భాష ఉంటుంది కాని, భాష లేంది సారస్వతం లేదు. శబ్దాన్ని బాగా గుర్తించి ప్రయోగిస్తాడు మహాకవి. ఒక్కొక్క పదం, పదబంధం ఆతని అనుభూతికి ప్రతీక. ఆ అనుభూతి విశిష్టతను గ్రహించటానికి ఆ ప్రతీకలే ఆధారం. అందుకే మహాభాష్య కర్త అంటారు : ఏకశ్శబ్దః సమ్యక్ జ్ఞాతః సుష్టు ప్రయుక్తః స్వర్గేలోకే కామ ధుక్ భవతి''. కేవల శబ్ద జ్ఞానం వుంటే చాలదు. దాన్ని బాగా ప్రయోగించకలగాలి. అప్పుడు కామధేనువు దగ్గర పాలు తాగినంత ఆనందం కల్గుతుంది. అంతటి ఆనందం ఎంతమంది అనుభవిస్తున్నారు? ఆంగ్లంలోని ఈ క్రింది పంక్తులు అందరు గుర్తించాలి :

"Break the word and free the thought;
Break the thought and free the idea;
Break the idea and free the image;
Break the image and free the concept;
Break the concept and free the experience."

కవి అనుభవాన్ని గ్రహించాలంటే ఇంతటి మథనం జరగాలి. అందుచేత ఏ రంగంలో కృషి చేస్తున్నా లోలోతులకు మునిగిపోయి ఆణిముత్యాలు తీసుకురావాలి. ఒకమైలో, రెండు మైళ్లో పోయి పైపైని సార చేపలు పట్టుకురావటం ఘనత కాదు. అంతస్తు పెంచుకోవాలి; అహంకారం తగ్గించుకోని, వ్యక్తులకుగాక విజ్ఞానానికి 'దాసోఽహం' అనాలి. 'సోఽహం' అనే వారి పరిశోధనల తీరు చాలా విడ్డూరంగా వుంటున్నాయి.

సామూహిక పరిశోధన మలావుంచి, వ్యక్తిగతమైన పరిశోధన మొత్తంమీద రెండు విభాగాలుగా జరుగుతున్నది. (i) భాషా పరం (ii) సాహిత్యపరం.

భాషాపరమైన కృషిని నాలుగవాంతర భేదాలుగా వింగడించవచ్చు: (1) వ్యాకరణశాస్త్ర సంబంధం: ఇందులో సాంప్రదాయికమైన సమన్వయాలేకాకుండా, భాషాశాస్త్రపరమైన సమన్వయాలు,

సమున్మేషాలు ఉండవచ్చు. (2) భాషాశాస్త్ర సంబంధి: ఇందులో సామాన్య భాషా వ్యవస్థను గూర్చిన పరిశోధనం ఉంటుంది. ఈ పరిశోధన ఏ భాషాశాస్త్ర విభాగాలలోనైనా (Linguistics Departments and Advanced Centres) నిర్వహింపబడవచ్చు. (3) నైఘంటిక సంబంధి (Lexicographic research): ఇటువంటి కృషి దురదృష్టవశాత్తు విశేషంగా సాగటంలేదు. ఇది సామూహికంగా జరిగితేనే మంచిది. (4) ఆర్థికం (Semantics) : ఈ శాఖకు సంబంధించినంతవరకు పరిశోధించినవారు ఆచార్య జి. యన్. రెడ్డిగారొక్కరే. అర్థ విపరిణామం తత్సమాలలో, తద్భవాలలో, అన్య దేశ్యాల్లో ఏ రీతిగా సంభవిస్తున్నది విస్తృతంగా కృషిచేయాలి.

సాహిత్యపరమైన కృషి స్థూలంగా రెండు విధాలు : (1) నాగరక సాహిత్య పరం (2) జానపద సాహిత్యపరం.

నాగరక సాహిత్యంలో పరిశోధన (1) కావ్యం మీద గాని, (2) కవిమీద గాని, (3) ఒకానొక ప్రక్రియమీద గాని సూక్ష్మంగా సాగించవచ్చు. ఇటువంటి కృషి విస్తృతంగా సాగుతున్నదే కాని అది ఎంతవరకు లోలోతుగా సాగింది, అనేది ప్రశ్న. పరిశోధన కాల పరిమితిలో అగాధంగా సాగాలంటే పరిశోధకుడు మహాయోగి కావాలి. సత్యాన్వేషి కావాలి. విషయం తెలిసికోటం మంచిది. అందులో జీవించటం ఇంకా మంచిది. తదేవాహం పరిపూర్ణత అవుతుంది.

''సత్యే సర్వం ప్రతిష్ఠితమ్.''




Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.

శ్రీరస్తు — శ్రీ త్రిపురసుందరీ ...భ్యాం నమః

# శ్రీ రౌద్రి నామ సంవత్సర పూర్ణశాస్త్రీయ (ఆంధ్రపత్రికా) పంచాంగమ్

బ్రహ్మశ్రీ శ్రీమత్పిడపర్తి సుబ్రహ్మణ్యశాస్త్రిణః పుత్రాభ్యాం

శ్రీ కాంచీ కామకోటి పీఠ సంస్థానాఽఽస్థాన సిద్ధాన్తిభ్యాం

"దైవజ్ఞ చిన్తామణి" శ్రీ చినకృష్ణమూర్తి శాస్త్రి, "భాషాప్రవీణ" శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిభ్యాం ప్రణీతమ్

సహరచయితారశ్చిరంజీవినః శ్రీ పూర్ణకల్యాణవీరభద్రశర్మా - శ్రీ వీరేశ్వరశాస్త్రి ప్రభృతయశ్చ

విఘ్నేశ విధిమార్తాండ చంద్రేంద్రోపేన్ద్ర వందిత నమో గణపతే తుభ్యం బ్రహ్మణాం బ్రహ్మణస్పతే.

వేదమయీం నాదమయీం విందుమయీం పరపదోద్య దిందుమయీం

మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీం.

## సంవత్సర ఫలము

ఈ సంవత్సరమున రాజు,ధాన్యాధిపతి చంద్రుడు.మంత్రిరవి. సేనాధిపతి, అర్ఘాధిపతి, మేఘాధిపతి శని. సస్యాధిపతి, నీరసాధిపతి బుధుడు. రసాధిపతి శుక్రుడు. ఇట్లు నవనాయకులలోను 5 ఆధిపత్యములు శుభులకయినవి. 30 ఆధిపత్యములలో 16 శుభులకయినవి. సర్వసస్య సముదాయమగు 16 వీసములలో 7 వీసముల పంట ఫలించును. పశుపాలకుడు శ్రీకృష్ణుడు. దొడ్డిపెట్టువాడు యముడు. దొడ్డి విడిపించువాడు బలరాముడు. మూడు కుంచముల వర్షము. వత్సరాది ప్ర॥ ఆషాఢ శు ౧౫ ఆది ప॥వార్ధక్య వయోవిశిష్ట గణికా హస్తమందు. తత్ప్రభృతి. ఆశ్వయుజ శు ౧౧ సోమ ప॥బాల్యవయో విశిష్ట బ్రాహ్మణ హస్తమందు. తత్ప్రభృతి. ఆవత్సరం. యౌవన వయోవిశిష్ట బ్రాహ్మణహస్తమందు కుంచముండును. రెండు పంటలును సమానముగ పండును. భాద్రపద శు౫ ఆది॥ గోదావరీ అంత్య పుష్కరములు. భాద్రపద బ౨ శుక్ర॥ సార్ధత్రికోటితీర్థసహిత కృష్ణానదీ పుష్కర ప్రారంభము.



## మౌఢ్యాదికములు

అధికజ్యేష్ఠ బ౧౨మంగళ ప్ర॥నిజజ్యేష్ఠ శు౭ శుక్ర ప॥శుక్రమౌఢ్యము శ్రావణబ౧బుధ ప్ర॥ భాద్రపద బ౩శని ప॥ గురు మౌఢ్యము. మాఘ బ౫ మంగళ ప్ర॥ ఆవత్సరం పునశ్శుక్ర మౌఢ్యము. సింహ గురు దోషములు గూర్చి ముహూర్తములలో చైత్ర, వైశాఖ, నిజజ్యేష్ఠ, శ్రావణమాసములవద్ద విపులముగ విమర్శించబడినది. జ్యేష్ఠమాసమధికమాసము.

## శకములు

| | |
|---|---|
| కల్యాద్యబ్దాః ౫౦౮౧ | శాలివాహనశకః ౧౯౦౨ |
| ఫసలీసన్ ౧౩౮౯,౯౦ | హిజరీసన్ ౧౪౦౦,౧౪౦౧ |
| క్రీస్తుశకః 1980, 81 | భారతస్వాతంత్ర్య శకః33,34 |

## ఆంధ్రపత్రికా కార్యాలయము, గాంధీనగరం, విజయవాడ - 3

## పంచాంగ పద్ధతి వివరణము

ఇందు కాలమానము యథాప్రకారముగా విజయవాడ, గుంటూరు, ఏలూరు మొదలగు ఆంధ్రప్రదేశ్ మధ్యభాగమునకు చూపబడినది. తిధి, నక్షత్రములు ఘటికలలోను, గంటలలోను కూడ చూపబడినవి. శుభ ముహూర్తములు—దుర్ముహూర్తములు—వర్జ్యములు—మహాపాతలు గంటలలో మాత్రం చూపబడినవి. యోగకరణ, అమృత, గృహ ప్రవేశములు ఘటికలలో మాత్రం చూపబడినవి. భారత ప్రభుత్వముచే నియమింపబడిన కాలెండరు రిఫార్మ్ కమిటీవారి నిర్ణయము ననుసరించి ప్రకటింపబడిన ఇండియన్ ఎఫెమెరీసు అండ్ నాటికల్ అల్మనాక్కునకు సరిపడునట్లు చూపబడినవి. నూతన వేధశాలల యందు కనుగొనబడిన భూకేంద్రమునకు సరిపడు వాస్తవిక రవి చంద్రులచే సాధింపబడిన తిథ్యాధికము, గ్రహసంచారము చూపబడినవి. ఈ తిథ్యాధి గ్రహ సంచారములే పంచాంగమున వ్రాసినట్లు ఆకసమున సరిపడుచున్నవి. ఇందు తిథ్యాది, ఘటికలు, ఉదయాస్తమయములు, శుభ ముహూర్తములు, దుర్ముహూర్తములు, లగ్నాంతకాలములు, విజయవాడ, గుంటూరు, ఏలూరు ప్రాంతములకు చూపబడినవి. నిరయణ స్ఫుటగ్రహములు ఇండియన్ ష్టాండర్డుటయము ననుసరించి గం.5-29 ని. లకు చూపబడినది. దేశాంతర చక్రములును చూపబడినవి. ఇందు వేదాంగ జ్యోతిషమున సూచింపబడిన అశ్విన్యాదిని గ్రహించి ఈ పంచాంగ రచన చేసియున్నాము గావున వైదికము సనాతనము గూడ యగుచున్నది. 10 అక్షాంశ లగాయతు 30 అక్షాంశ వరకు లగ్న ప్రమాణములు యివ్వబడినవి. శాస్త్రమునకు ప్రత్యక్షమునకు సముచితమై యొప్పు ఈ పంచాంగమును గ్రహించి శ్రౌతస్మార్త కర్మల నాచరింప గోరుచున్నాము.

మార్గశిరము:—బంగారము చురుకు. వెండి నిలబాటు. ఉన్ని ధావళి చురుకు. పట్టువస్త్రములు, నూలు వస్త్రములు నిలబాటు. గోధుమలు చురుకు. ధాన్యము మందం. కాఫీగింజలు చురుకు. పత్తి, దూది మందం. శర్కర, బెల్లం మందం. కొబ్బరి చురుకు. నువ్వులనూనె, శనగనూనె నిలబాటు. నెయ్యి మందం. పప్పు దినుసులు చురుకు. మిర్చి, చింతపండు మందం. మెంతులు, ఆవాలు, శొంఠి నిలబాటు. ధనియాలు, మిరియాలు, అల్లం చురుకు. లవంగాలు ఏలక్కాయలు, జాజికాయలు, జాపత్రి, విలాస ద్రవ్యములు చురుకు. శ్రీ చందనం, రక్తచందనం నిలబాటు. పంచలోహములు చురుకు. రసవస్తువులు నిలబాటు. నవరత్నములు చురుకు. నిత్యావసర వస్తువులు సాఫరాయగును. కూరగాయలు అందుబాటులో నుండును. దారు[క్ర] వస్తువులు బాగా చురుకుగ నుండును. దుంప జాతి, అరటి మందం. పసుపు చురుకు.

పౌషము :—ధాన్యము నిలబాటు. గోధుమలు మందం. కాఫీగింజలు నిలబాటు. వెండి బంగారములు చురుకు. పట్టువస్త్రములు, నూలు వస్త్రములు నిలబాటు. పత్తి, దూది మందం. ఉన్ని ధావళీలు చురుకు. కొబ్బరి నిలబాటు. పొగాకు, శర్కర, బెల్లం చురుకు. నెయ్యి నిలబాటు. అపరాలు, పప్పుదినుసులు చురుకు. మిర్చి, చింతపండు, మెంతులు, ఆవాలు, ధనియాలు నిలబాటు. జొన్నలు, శొంఠి చురుకు. లవంగాలు, ఏలక్కాయలు మొ. సుగంధద్రవ్యములు చురుకు. అత్తరు, పన్నీరు మొ. విలాసవస్తువులు నిలబాటు. నువ్వులనూనె [నేల] వేరుశనగనూనె చురుకు. శ్రీ చందనం, రక్తచందనం, కర్పూరము మందం. రసవస్తువులు చురుకు. గోమేధికము, పుష్యరాగము, గారుత్మతము చురుకు. నిత్యావసర వస్తువులు సులభములగును. కూరగాయలందుబాటులో నుండును. దుంపజాతి చురుకు. అరటి నిలబాటు. బహుళంలో చురుకు. పసుపు నిలబాటు.

మాఘము :—ధాన్యము చురుకుగ రవాణా సాగును. గోధుమలు నిలబాటు. వెండి బంగారములు శుక్లములో చురుకు. పట్టు నూలువస్త్రములు చురుకు. ఉన్ని, ఊలు, శిల్క చురుకులో నిలబాటు. పత్తి, దూది నిలబాటు. అపరాలు పప్పు దినుసులు అందుబాటులో నుండును. మిర్చి, చింతపండు, పసుపు మందంలో చురుకు. శ్రీగంధం, పునుగు, జవాజి, పచ్చకర్పూరం, విలాస వస్తువులు నిలబాటు. తిలతైలము, శనగనూనె మొ తైలజాతులు, మెంతులు, ఆవాలు నిలబాటు. ధనియాలు, జొన్నలు, జీలకర్ర, వాము నిలబాటు. నవరత్నములు చురుకు. కృత్రిమ రత్నములు నిలబాటు. కృత్రిమ లోహములకు ధర మెండుగ నుండును. నేయి చురుకు. నిత్యావసర వస్తువులు చురుకు. దుంపజాతులు నిలబాటు. కూరగాయలు అందుబాటులో నుండును. అరటి చురుకు. లవంగాలు, ఏలక్కాయలు, పోకచెక్కలు, జాపత్రి, జాజికాయ మందం.

ఫాల్గునము :— వెండి బంగారములు చురుకు. ధాన్యము చురుకు. గోధుమలు చురుకు. నూలు వస్త్రములు పట్టు వస్త్రములు చురుకు. ఉన్ని ధావళీలు మందం. పంచ లోహములు చురుకు, దాలవా ధాన్యము నిలబాటు. జొన్నలు, ఆవాలు, ధనియాలు చురుకు. మెంతులు, జీలకర్ర నిలబాటు. కాఫీగింజలు నిలబాటు. పత్తి, దూది మందం. బెల్లం శర్కర చురుకు. కొబ్బరి చురుకు. నెయ్యి నిలబాటు. తిలతైలము మందం. పప్పుదినుసులు, అపరాలు నిలబాటు. శ్రీచందనం చురుకు. దూది నిలబాటు. నవరత్నములు చురుకు. మిర్చి, చింతపండు చురుకు. వేరుశనగనూనె చురుకు. జొన్నలు మందం. ఏలక్కాయలు, పోకచెక్కలు, లవంగాలు చురుకు. పొగాకు చురుకు. వాము, మిరియాలు, శొంఠి, అల్లం నిలబాటు. ఫ్యాన్సీ సామానులు, మెషియన్ చురుకు. ఎలక్ట్రీ చురుకు. దుంపజాతి చురుకు. మామిడి చురుకు. కూరగాయలు చురుకు. అరటి మందం.

**N.B.** గ్రహ యోగములను బట్టి చూడగ గత సంవత్సరం కంటే ప్రాయికంగా వస్తువులకు చురుకు కనిపించును. స్థిరోపాధులకు, గృహాదులకు కూడ ధర చురుకు. దేశారిష్టయోగ ప్రభవము కూడ, వర్షయోగముల యందు ధరల యందు కనుపడును.

# గోచారఫలములు

**N.B.:** ఇందలి ఫలములను స్థితి గోచారవశమున, వేధగోచారవశమున, లగ్న నక్షత్ర గోచారముల ననుసరించి వ్రాసినాము. ఇంకను అష్టకవర్గ గోచారమును గ్రహగోచారమును మేళవించి చూచుకొనిన ఋజువగును. సౌరచాంద్ర గోచారములను మేళవించి చూచుకొనవలెను.

## మేషము - సౌరగోచారము (మేషమాసములో పుట్టినవారికి)
## చాంద్రగోచారము (అశ్విని 4 పా. భరణి 4 పా. కృత్తిక 1 పా)

వత్సరాది ప్ర॥ భాద్రపద బ ౨ శుక్ర 26—9-1980 వరకు గురుడు 5 వ యింట తామ్రమూర్తి అర్ధశుభుడు. తదాద్యావత్సరం 6 యింట సువర్ణమూర్తి అర్ధశుభుడు. శని వత్సరాది ప్ర॥ ఆషాఢ శు ౧౫ ఆది 27—7-1980 వరకు 5వ యింట శని సువర్ణమూర్తి అర్ధశుభుడు. తాదాద్యావత్సరం 6 యింట తామ్రమూర్తి అర్ధశుభుడు. రాహుకేతువులు అధిక జ్యేష్ఠ బ ౮ శుక్ర 6-6—1980 వరకు 5-11 రాసులయందు తామ్రమూర్తులు సామాన్యము. తదాద్యావత్సరము 4-10 రాసుల యందు సువర్ణమూర్తులు అర్ధశుభులు—వేధగోచారముచే వత్సరమంతయు పాపి. శని, రాహుకేతువులు వత్సరమంతయు శుభులు. 28-6-80 లగా 19—8-80కు, 13-11-80 లగా 22-12-80కు 29-1-81 లగా. ఆవత్సరము కుజుడు శుభుడు. ఇట్లు పర్యవేక్షణ చేయగ, గత సంవత్సరములో నెరవేరని కట్టడములు, శుభకార్యములు ఈ పూర్వార్ధములో నెరవేరగలవు. పూర్వార్ధము మేలుగా నుండి ఉత్తరార్ధమున శుభాశుభమిశ్రమముగా నుండును. సంతానప్రాప్తి కలదు. స్థితిగోచారము సామాన్యముగ నున్నను వేధగోచార బలము వలన అప్పులుపాలు కాకుండగా సుమారు పలుకుబడిని సంపాదించగలరు. ఆరోగ్యము ఉత్తరార్ధమున సామాన్యముగ నుండును. వ్యవసాయదారులకు తొలకరి కంటే పైరులు తక్కువగ పండును. ఉద్యోగులకు పూర్వార్ధమున సుమారు కోరిన ప్రాంతములకు బదిలీలు కాగలవు. విద్యార్థుల మార్చి ఛాన్సు అనుకూలము. రాజకీయ నాయకులకు గౌరవము మధ్యరకముగ నుండును. ప్లీడరుల, డాక్టరులకు కొంచె మించుగ సంపాదించినను మొత్తము వత్సరాంతమునకు లాభశాతము కనుపడును. కంట్రాక్టరులకు పూర్వార్ధములో కలిగిన లాభమును చూచి ఉత్తరార్ధములో పెద్ద పెట్టుబడులు పెట్టక ముందుకు సాగుట శ్రేయము. వర్తకులకు ఉత్తరార్ధము కంటె పూర్వార్ధము మేలు. కోర్టు వ్యాపారములు పూర్వార్ధమున సానుకూలమగును. ఈ రాశి వారలకు 1, 13, 20, 25 తారీఖులు, ఆది, మంగళ, గురువారములు శుభములు. ఉత్తరార్ధమున గురు రాహువులకు జపము చేయగా మేలుకలుగును.

అశ్వినివారలకు 6—7—80 లగా 11—9—80వరకు గురుడు శుభుడు. 14—5—80 లగా 30—5—80 వరకు శని పాపి. వత్సరమంతయు రాహు, కేతువులు శుభులు.

భరణివారలకు ఉగాదినుండి 6—7—80వరకు గురుడు శుభుడు. వత్సరమంతయు శని, కేతువులు శుభులు. వత్సరాదినుండి 6—6—80వరకు రాహువు పాపి.

## వృషభము:- సౌరగోచారము (వృషభమాసములో పుట్టినవారికి)
## చాంద్రగోచారము (కృ 2-3-4. రోహిణి 4 పా మృగ 1-2 పా)

వత్సరాది ప్ర. భాద్రపద బ ౨ శుక్ర 26-9-1980 కు 4 వ యింట గురుడు సువర్ణమూర్తి అర్ధశుభుడు. తదాద్యా వత్సరము 5 వ యింట గురుడు లోహమూర్తి అర్ధశుభుడు. శని వత్సరాది ప్ర. ఆషాఢ శు ౧౫ ఆది [27-7-80] వరకు 4 వ యింట తామ్రమూర్తి పాపి శ్రమకారి. తదాద్యా వత్సరము 5వ యింట రజతమూర్తి సామాన్యుడు. రాహు కేతువులు వత్సరాది లగా అధికజ్యేష్ఠ బ౦ శుక్ర 6-6-80 వరకు 4-10

రాసుల యందు రజితమూర్తులు అర్ధాధికశుభులు. తదాద్యావత్సరము 3.9 రాసుల యందు తామ్రమూర్తులు సామాన్యులు. వేధగోచారముచే వత్సరమంతయు గురుడు పాపి. వత్సరమంతయు శని రాహు కేతువులు శుభులు. 19-8-80లగా 3-10-80కు, 22-12-80లగా 29-1-81కు, 8-3-81లగా ఆ వత్సరం కుజుడు శుభుడు. ఇట్లు పరిశీలన చేయగా వీరికి వత్సరాదినుండి జూన్‌వరక్కు అర్ధాష్టమ కుజ, గురు, శని, రాహువులయొక్కయు, అది లగా. జూలై ఆఖరు వరక్కు గురు, శనుల యొక్కయు, సెప్టెంబరు చివరివరక్కు అర్ధాష్టమ గురునియొక్క ప్రభావము మెండుగా నుండును. జూన్ నెలనుండి అంచలవారీగా పేచీలు ఇక్కట్లు తొలగిపోవును. ఉత్తరార్ధమున నిర్మల మనస్సుతోను ఆరోగ్యముతోనుండి పూర్వమును మరచి సుఖముగా కాలమును గడుపగలరు. కుటుంబ సౌఖ్యముత్తరార్ధమున మేలుగా నుండును. సంతాన ప్రాప్తిని బడయుదురు. గృహనిర్మాణాది మంగళ కార్యములను నిర్వర్తించగలరు. వ్యవసాయదారులకు పైరులు అభివృద్ధిగనుండును. వర్తకులకు ఉత్తరార్ధమున లాభము కనుపడును. ఉద్యోగులకు పూర్వార్ధము శ్రమను చేయును. ఉత్తరార్ధములో పలుకుబడి హెచ్చి వీరి ఆశయము నెరవేరగలదు. విద్యార్థులు అక్టోబరు ఛాన్సులో తరగతులను సంపాదించగలరు. రాజకీయ నాయకులు పూర్వార్ధము సామాన్యముగనున్నను ఉత్తరార్ధము మంచి కదలికగ నుండును. కంట్రాక్టరులు ఉత్తరార్ధములో పూర్వము చూడని లాభశాతమును చూడగలరు. కోర్టు వ్యాపారములు అక్టోబరు లగాయతు సుముఖముగ నుండును. డాక్టరులకు లాయరులకు ఉత్తరార్ధము అన్ని రంగముల యందు మేలుచేయును. ఈ రాశివార్కి 2, 14, 21, 26 తారీఖులు, సోమ, బుధ, శుక్రవారములు బాగుగ నుండును. వీరు పూర్వార్ధము సమక పారాయణము, విష్ణు సహస్రనామస్తోత్ర పారాయణ చేయుటచే శుభముగ పరిణమించును. కృత్తిక వారలకు వత్సరమంత గురుడు పాపి. వత్సరమంతయు శని రాహువులు శుభులు. 9-10-80లగా ఆ వత్సరము కేతువు పాపి.

రోహిణి వారలకు:— 26-9-80లగా ఆ వత్సరం గురుడు శుభుడు. 27-7-80లగా ఆ వత్సరం శని పాపి. వత్సరమంతయు రాహు కేతువులు శుభులు.

మృగశిరవారలకు :— ఉగాదినుండియు 26-9-80 వరక్కుగురుడు శుభుడు. ఉగాదినుండి 27—7—80వరకు శని పాపి. వత్సరమంతయు రాహువు పాపి. వత్సరమంతయు కేతువు శుభుడు.

## మిధునము:— సౌరగోచారము (మిధున మాసములో పుట్టినవారికి)

## చాంద్రగోచారము (మృగ 3-4 పా. ఆర్ద్ర 4 పా. పున 1-2-3 పా.)

వత్సరాది ప్రభృతి భాద్రపద బ॥ అయ శుక్ర 26—9—80 వార పర్యంతం తృతీయమున గురుడు రజితమూర్తి సామాన్యుడు. తదాది ఆ వత్సరము అర్ధాష్టమమున సువర్ణమూర్తి అర్ధశుభుడు. శని వత్సరాది ప్ర॥ ఆషాఢ శు ౧౫ ఆది [27—7—1980] వారమువరక్కు తృతీయమున రజిత మూర్తి త్రిపాద శుభుడు. తదాద్యా వత్సరము అర్ధాష్టమమున లోహమూర్తి పూర్తిపాపి శ్రమను చేయును. రాహు కేతువులు వత్సరాది ప్ర॥ అధిక జ్యేష్ఠ బ॥ శుక్రవార [6—6—80] వరక్కు 3—9 రాసులయందు సువర్ణమూర్తులు త్రిపాదాధిక శుభులు. తత్ప్రభృత్యావత్సరం 2—8 రాసుల యందు రజితమూర్తులు సామాన్యులు॥ కుజుడు వత్సరాది లగా 28—6—80వరక్కు 3—10—80 లగా 13—11—80 వరక్కు 29—1—81లగా 8—3—81 వరక్కు శుభుడు. వేధగోచారముచే 26—9—80లగా ఆ వత్సరం గురుడు శుభుడు. 27—7—80లగా ఆ వత్సరం శని పాపి. 12—2—81లగా ఆ వత్సరం రాహువు పాపి. వత్సరమంతయు కేతువు శుభుడు. ఇట్లు పర్యవేక్షణ చేయగా ఈ రాశివార్కి పూర్వార్ధమున సామాన్యముగనుండి ఉత్తరార్ధము చాల శ్రమచేయును. పూర్వార్ధమున కుటుంబ సౌఖ్యము బాగుగనుండును. ఉత్తరార్ధము ఔషధ సేవ తరచుగ నుండును. వివాహాది మంగళ కార్యములు పూర్వార్ధమున సానుకూలము కాగలవు. వ్యవసాయదారులకు తొలకరిపంట బాగుండును. వర్తకులకు పూర్వార్ధమున లాభముచేయును. ఉత్తరార్ధము తగిన లాభము కనుబడదు. ఉద్యోగులు ఉత్తరార్ధమున బదిలీలు కోరకుండుట మేలు. విద్యార్థులకు మార్చి ఛాన్సు అనుకూలము. రాజకీయ నాయకులకు ఉత్తరార్ధమున పదవీభ్రష్టత కలుగును. డాక్టరులకు లాయరులకు ఆదాయము పూర్వార్ధముకంటె ఉత్తరార్ధమున తక్కువగ నుండును. కంట్రాక్టరులు వనుకముందులు చూచుకొని వ్యవహరించుట మంచిది. కోర్టు వ్యాపారములుఉత్తరార్ధమున తేలకపోవునట్లు చేయుట శ్రేయస్సు. ఈ రాశివార్కి 3, 5, 27, తారీఖులు మంగళ, గురు, శనివారములు ప్రశస్తములు. సుందరకాండ పారాయణ, శివునకు లక్షబిల్వార్చన శుభమును చేయును.

ఆర్ద్రానక్షత్రము వారికి :— 5—11—80లగా॥ ఆ వత్సరం గురుడు శుభుడు. 20—10—80 లగా॥ ఆ వత్సరం శని పాపి. వత్సరమంతయు రాహువు శుభుడు. కేతువు కూడా శుభుడు.

పునర్వసు వారలకు :— 11—9—80 లగా 15—11—80వరక్కు గురుడు శుభుడు. వత్సరాదినుండి 14—5—80వరక్కు తిర్గి 30—5—80లగా 20—10—80వరక్కు శని పాపి. వత్సరమంతయు రాహు కేతువులు శుభులు.

## కర్కాటకము:—సౌరగోచారము (కర్కాటకమాసములో పుట్టినవారికి)

## చాంద్రగోచారము (పున 4వ పా. పుష్య 4 పా. ఆశ్రే 4 పా)

వత్సరాది ప్ర॥ భాద్రపద బ ౨ శుక్ర (26-9-80) పర్యంతం గురుడు 2వ యింట లోహమూర్తి అర్ధశుభుడు. తదాద్యావత్సరము తృతీయమున తామ్రమూర్తి పాపి. శని వత్సరాది లగా॥ ఆషాఢ శు ౧౫ ఆది 27-7-80 వరకు ద్వితీయమున లోహమూర్తి పూర్తి పాపి. చాలా శ్రమను చేయును. తదాద్యావత్సరము తృతీయమున తామ్రమూర్తి సామాన్యుడు. రాహు కేతువులు ఉగాది నుండి అధికజ్యేష్ఠ బ॥ శుక్ర 6-6-80 వారమువరక్కు 2-8 రాసులయందు లోహమూర్తులు పూర్తి శ్రమను చేతురు. తదాద్యావత్సరము 1-7 రాసులయందు లోహమూర్తులు పూర్తి పాపులు. కుజుడు 28-6-80 లగా 19-8-80 వరక్కు 13-11-80 లగా 22-12-80 వరక్కు 18-3-81 లగా॥ ఆవత్సరము శుభుడు. వేధగోచారముచే వత్సరాది ప్ర॥ 26-9-80 వరక్కు గురుడు శుభుడు. వత్సరాది ప్ర 27-7-80 వరక్కు శని పాపి. వత్సరాదినుండి 12-2-81 వరక్కు రాహువు పాపి. వత్సరాదినుండి 9-10-80 వరక్కు కేతువు పాపి. ఇట్లు సమాలోచన చేయగా ఈ రాశివారికి స్థితిగోచారము, వేధగోచారము కూడ సంతృప్తిగ కనుబడుటలేదు. ఈ వత్సరమంతా శ్రమచేయుననిపించుచున్నను జూలై నెలాఖరు లగా॥ ఏలినాటి శని బాధ తొలగుచుండుటచే అది లగాయతు గుడ్డిలో మెల్లమేలు అనునట్లుండుననిపించుచున్నది. ఋణ బాధ, కొత్త పేచీలు, దారపుత్రాదులతో చిలిపి తగవులు. ఔషధసేవ, శ్రమ యధికము, ఫలము అతి స్వల్పము కలిగియుండును. వ్యవసాయదారులకు పెట్టుబడి పెట్టిన ద్రవ్యము తేలదు. వర్తకులు, ఎందు జాయంటుదారులు ఉన్నవార్కి ఎక్కడక్కడకు హరించిపోవును. విడిగా చేసుకొను వారలకు సామాన్యముకంటే తక్కువగనుండును. ఉద్యోగులు అధికారుల ఆగ్రహమునకు గురికాక తప్పదు. విద్యార్థులు వినోదములయందు కాలక్షేపముచేసిన పునరావృత్తి చేయక తప్పదు. రాజకీయ నాయకులకు వ్యతిరేకత హెచ్చగును. డాక్టర్లకు, లాయర్లకు అజాగ్రతగనుండిన వృత్తి కొంచెము సన్నగిల్లును. కంట్రాక్టుదారులు జాయంటుగనున్న కలసివచ్చును. కోర్టు వ్యాపారములను వాయిదా కోరుట మంచిది. ఈ రాశివారికి ఈ సంవత్సరము కత్తిమీద సాముదలె నుండును. వీరికి 4, 16, 23, 28 తారీఖులు ఆది, బుధ, శుక్రవారములు ప్రశస్తములు. వీరనుదినము ఆదిత్య హృదయ పారాయణము, నవగ్రహస్తోత్ర పారాయణము చేసిన శుభమగును.

పుష్యవారలకు:— 6-7-80 లగా॥ 11-9-80 వరకు గురుడు శుభుడు. 14-5-80 లగా॥ 30-5-80 వరక్కు శని పాపి. వత్సరమంతయు రాహు కేతువులు శుభులు.

ఆశ్రేషవారలకు :— ఉగాదినుండి 6-7-80 వరకు గురుడు శుభుడు. వత్సరమంతయు శని శుభుడు. వత్సరమంతయు రాహు కేతువులు పాపులు.

**సింహము:- సౌరగోచారము (సింహమాసములో పుట్టినవారికి)**

**చాంద్రగోచారము (మఖ 4 పా పూ. ఫ. 4 పా. ఉ. ఫ 1 పా.)**

వత్సరాది లగా॥ భాద్రపద బ ౨ శుక్ర(26-9-80) వారం వర్కు జన్మమున గురుడు తామ్రమూర్తి సామాన్యుడు. తదారభ్యావత్సరము 2వ యింట రజతమూర్తి శుభుడు. శని వత్సరాది ప్ర॥ ఆషాఢ శు ౧౫ ఆది (27-7-80) వారం వర్కు జన్మమున తామ్రమూర్తి పాపి శ్రమను చేయును. తదాద్యావత్సరము 2వ యింట సువర్ణమూర్తి అర్ధశుభుడు. రాహు కేతువులు వత్సరాది లగా॥ అధికజ్యేష్ఠ బ ౮ శుక్ర (6-6-80) వారం వర్కు 1-7 రాసులయందు సువర్ణమూర్తులు అర్ధశుభులు. తదారభ్యావత్సరము 12-6 రాసులయందు తామ్రమూర్తులు సామాన్యులు. కుజుడు 19-8-80 లగా 3-10-80 వరకు, 22-12-80 లగా 29-1-81 వర్కు కుజుడు శుభుడు. వేధగోచారముచే వత్సరాది ప్ర॥ 6-7-80 వరకు గురుడు శుభుడు. వత్సరమంతయు శని శుభుడు. వత్సరమంతయు రాహువు పాపి. 6-6-80 లగా ఆ వత్సరం కేతువు పాపి. ఇట్లు పర్యవలోకన చేయగా ఉత్తరార్ధమునుండి కొంచెపాటి లాభము కనుపడును. పూర్వార్ధమున రోజులు శ్రమగ నడచును. ఋణభారము హెచ్చుగ నుండును. కుటుంబసౌఖ్యము తక్కువ. దారపుత్రాదులతో అభిప్రాయ భేదములు రాగల సూచనలు కలవు. అనారోగ్యముకూడ బాధించును. ఏమైనను ఉత్తరార్ధము గత 2 సంవత్సరములకంటె మెరుగనిపించును. వ్యవసాయ దారులకు తొలకరికంటె పైరులు బాగా ఫలించును. వర్తకులకు కొద్దిపాటి ఖర్చుకాలము కనుబడును. ఉద్యోగులకు పరీక్షదినములు. విద్యార్థులు ఎక్కువ పరిశ్రమ చేసినగాని సామాన్యముగనైనను ఉత్తీర్ణులు కాజాలరు. క్లాసులు బహు అరుదుగ నుండును. రాజకీయ నాయకులకు పూర్వార్ధమున నెరవేరనివి ఉత్తరార్ధమున దాదాపుగ నెరవేరును. డాక్టరులకు, లాయరులకు ఆశ్వయుజము లగా॥ ఆర్జన మెరుగుపడును. కోర్టు వ్యాపారములు మందకొడిగనుండి ఉత్సాహమును కలుగచేయవు. కంట్రాక్టుదారులు స్వల్పపెట్టుబడి మీద లాభము తీయగలరు. శుభకార్యాదులు ఉత్తరార్ధమున నెరవేర్చగలరు. గృహనిర్మాణాదికమ్ముకు మధ్య అవాంతరమువచ్చి నిల్చి ఉత్తరార్ధమున కొనసాగును. ఈ రాశివారికి 5, 17, 24, 29 తారీఖులు సోమ, గురు, శనివారములు మంచివి. వీరు నవగ్రహ స్తోత్ర పారాయణ, లలితా సహస్రనామ స్తోత్ర పారాయణ చేయవలెను.

మఖవారలకు :— ఉగాదినుండి 26-9-80 వరకు గురుడు శుభుడు. ఉగాదినుండి 27-7-80 వర్కు శని పాపి. ఉగాదినుండి 12-2-81 వర్కు రాహువు పాపి. 6-6-1980లగా ఆవత్సరము కేతువు పాపి.

పుబ్బవారలకు:-26-9-1980 లగా ఆవత్సరం గురుడు శుభుడు. 27-7-80లగా ఆవత్సరం శని పాపి. 12-2-81 లగా ఆవత్సరము రాహువు పాపి. వత్సరమంతయు కేతువు శుభుడు.

**కన్య:- సౌరగోచారము (కన్యామాసములో పుట్టినవారికి)**

**చాంద్రగోచారము (ఉ.ఫ 2-3-4 పా. హస్త 4 పా చిత్ర 1-2 పా)**

వత్సరాది ప్ర॥ భాద్రపద బ ౨ శుక్రవార ॥వ॥ [26—9—80 వరకు గురుడు వ్యయమందు రజితమూర్తి పాదాధిక శుభుడు. తదారభ్యా వత్సర లగ్నమందు లోహమూర్తి పూర్తి పాపి. శనివత్సరాదిలగా ఆషాఢ శు ౧౫ ఆది [27-7-1980] వర్కు వ్యయమందు సువర్ణ మూర్తి పాదశుభుడు. తదాద్యావత్సరం లగ్నమునందు రజితమూర్తి సామాన్యుడు. రాహుకేతువులు వత్సరాది లగా॥ అధికజ్యేష్ఠ బ ౮ శుక్ర [6-6-1980] వారం వర్కు 12-6 రాశుల యందు తామ్రమూర్తులు పాదాధిక శుభులు తదాద్యావత్సరం 11-5 రాసులయందు సువర్ణ మూర్తులు పూర్తిగ శుభులు. కుజుడు ఉగాది నుండి 28-6-80 వరకు 3-10-80 లగా 13-11-80 వరకు 29—1-81లగా 8—3-81 వరకు శుభుడు. వేధగోచారముచే 6-7—80 లగా 11-9 80 వరకు గురుడు శుభుడు. 14—5—80లగా30—5-80కు శని పాపి. వత్సరమంతయు రాహువు, కేతువు శుభులు. ఇట్లు విచారణచే వీరికి ఏలినాటి శని బాధ హెచ్చుగ నున్నది. గురుబలము కూడ తక్కువగ నున్నది. వీరికి శత్రుకోటి హెచ్చగును. కుటుంబము నందు జాయాపతులకు-తల్లిబిడ్డలకు అన్యోన్యము కలహములు, అనారోగ్య కారణంచే సౌఖ్యము తక్కువగ నుండును. గృహనిర్మాణ వివాహాది మంగళ కార్యముల కాటంకములు కలుగును. ప్రతి పనియందు, అన్ని రంగముల యందు వ్యతిరేకత పొడసూపుచున్నది. వ్యయ ప్రయాసలు అధికము. ఫలము స్వల్పము. వీరికి మౌనము ముఖ్యము. వేధగోచారము అనుకూలముగ నుండుటచే ప్రమాదములు ఏమియు రావు. మానసిక శ్రమ, శరీర అలసట తప్పదు. వ్యవసాయదారులకు ఉత్తరార్ధములో మిగులు కనుబడును. ఉద్యోగులకు ఈ వత్సరమంతయు చాల శ్రమగ నుండును. అధికారుల మన్నన సన్నమగును. బదిలీలు కోరుట వ్యయ ప్రయాసలకు దారితీయును. విద్యార్థులు బహు కృషి చేసిన గాని ఉత్తీర్ణులు కాజాలరు. రాజకీయ నాయకులు తప్పుడెత్తువేసిన ఆటకట్టు కలదు. తగు జాగ్రత్తయవసరం. డాక్టరులకు, లాయరులకు ఫలము స్వల్పము. కంట్రాక్టు దారులకు జాయంటు అనుకూలించును. పరిశీలన అవసరము. కోర్టు వ్యాపారములు ఈ వత్సరము అనుకూల పరిణామము కాగల సూచనలు లేవు. ఈ రాశి వారికి 6, 18, 25, 30 తారీఖులు, ఆది, మంగళ, శుక్రవారములు ప్రశస్తములు. నమకపారాయణ, బిల్వార్చన, సుందరకాండ పారాయణ శుభమును చేయును.

ఉత్తర వారలకు :— వత్సరమంతయు గురుడు పాపి. శని, రాహుకేతువులు శుభులు.

హస్త వారలకు :— వత్సర మంతయు గురుడు పాపి. శని, రాహుకేతువులు శుభులు.

చిత్ర వారలకు :— ఉగాది నుండి 26—9—80 వర్కు గురుడు శుభుడు. ఉగాది నుండి 27—7—80 వర్కు శని పాపి. వత్సరమంతయు రాహుకేతువులు శుభులు.

**తుల:- సౌరగోచారము (తులామాసములో పుట్టినవారికి)**

**చాంద్రగోచారము (చిత్రా 3-4 పా. స్వాతీ 4 పా. విశా 1-2-3 పా)**

వత్సరాది ప్ర॥ భాద్రపద బ ౨ శుక్ర [26- 9—1980] వారము వర్కు లాభ మున గురుడు సువర్ణమూర్తి పూర్తి శుభుడు. తదాద్యా వత్సరము గురుడు వ్యయమందు తామ్ర మూర్తి పాపి. శని వత్సరాది ప్రభృతి ఆషాఢ శు ౧౫ ఆది [27 - 7—1980]వారము వర్కు లాభమునందు రజితమూర్తి త్రిపాద శుభుడు. తదాద్యావత్సరము 12వ యింట లోహమూర్తి పూర్తి పాపి శ్రమను చేయును. రాహు కేతువులు వత్సరాది ప్రభృతి అధిక జ్యేష్ఠ బ ౮ శుక్ర [6 6—1980] వారము వరకు 11—5 రాసుల యందు రజిత మూర్తులు శుభులు. తదారభ్యా వత్సరము 10—4 రాసులయందు రజితమూర్తులు అర్ధశుభులు. కుజుడు ఉగాది నుండి 19—8-80 వరకు 13-11—80 లగా 22—12—80 వరకు 8—3—31 లగా ఆవత్సరం కుజుడు శుభుడు. వేధగోచారముచే 11-9-80 లగా 15-11-80వరకు గురుడు శుభుడు. వత్సరాది లగా 14-5-80 వర్కు తిర్గి 30-5-80 లగా 20-10-80 వర్కు శని పాపి. వత్సరమంతయు రాహుకేతువులు శుభులు. ఇట్లు సమీక్ష చేయగా పూర్వార్ధము గల 1-2 సంవత్సరముల కంటె బాగున్నది. తలవని తలంపుగ ఆర్థిక లాభము, ఆస్తి కలియుట జరుగును. వివాహాది మంగళ కార్యములు, గృహ నిర్మాణము, సత్సంతతి అభివృద్ధి, ఆకస్మికముగ ధనలాభము, వ్యాపారాభివృద్ధి, పంట సమృద్ధిగ పండుట, ప్రజాగౌరవము కలిగి సుఖసంతోషములతో పూర్వార్ధము చాల అనుకూలముగ నుండును. ఆగస్టు నుండి ఏలినాటి శని ప్రారంభము ప్రారంభమగును. అక్టోబరు నుండి గురుబలము తగ్గును. క్రమేపీయు చీకాకులు, పేచీలు, కుటుంబ కలతలు ప్రారంభమగును. వ్యవసాయ దారులకు పైరుకంటే తొలకరిపంట ఫలించును. ఉద్యోగులు పూర్వార్ధ మున కోరిన తావులకు బదిలీలు ప్రమోషనులు పొందగలరు. ఉత్తరార్ధమున అధికారుల మన్నన

సన్నగిల్లును. విద్యార్థులు కృషికి తగిన క్లాసులను అందుకొనగలరు. మార్చి ఛాన్సు అనుకూలము. రాజకీయ నాయకులు పూర్వార్ధమున పదవులను చేపట్టగలరు. ప్లీడరులకు, లాయరులకు పూర్వార్ధమున చాల లాభము కలుగును. వర్తకులకు ఇదివరకు చూడని లాభము కలుగును. కంట్రాక్టరులు ఉత్తరార్ధమున జాగ్రత్తగ వ్యవహరించిన అన్ని విధముల అనుకూలించును. పూర్వార్ధము లాభ శాతము ఎక్కువగ కనుపడును. కోర్టు వ్యాపారములు పూర్వార్ధమున సఫలీకృతమగును. ఈ రాశి వారికి 1,7,19,26 తారీఖులు, సోమ, బుధ, శనివారములు ప్రశస్తము. ఉత్తరార్ధమున విష్ణుసహస్రనామ స్తోత్రపారాయణ, సహస్ర లింగార్చన చేసిన వత్సరమంతయు పూర్వార్ధము వలె నుండును. సుందరకాండ పారాయణ శతృజయమును చేయును.

స్వాతివారలకు :- 26-9-80 లగా ఆవత్సరం గురుడు శుభుడు. 27-7-1980లగా ఆవత్సరం శని పాపి. వత్సరమంతయు రాహు కేతువులు శుభులు.

విశాఖవారలకు :— వత్సరమంతయు గురుడు పాపి. వత్సరమంతయు శని, రాహువులు శుభులు. వత్సరాది లగా 9-10-80 వరకు కేతువు పాపి.

## వృశ్చికము:- సౌరగోచారము (వృశ్చికమాసములో పుట్టినవారికి)
### చాంద్రగోచారము (విశా 4వ పా. అనూ 4పా. జ్యేష్ఠ 4 పా)

వత్సరాది ప్ర॥ భాద్రపద బ౹౹ శుక్ర 26—9—80 వారపర్యంతం రాజ్యమున గురుడు లోహమూర్తి పాపి. తదారభ్యలాభమున సువర్ణమూర్తి పూర్తి శుభుడు. వత్సరాది ప్ర॥ ఆషాఢ శు ౧౪ ఆది [27—7—1980] వారం వరకు శని రాజ్యమున లోహమూర్తి సామాన్యుడు. తదారభ్యావత్సరము లాభమున శని తామ్రమూర్తి అర్ధశుభుడు. రాహు కేతువులు వత్సరాది ప్ర॥ అధిక జ్యేష్ఠ బ౹౹ శుక్ర [6—6—1980] వారము వరకు 10—4 రాసులయందు లోహ మూర్తులు పూర్తి పాపులు. తదారభ్యా వత్సరము 9—3 రాసులయందు లోహమూర్తులు పాద శుభులు. కుజుడు 28—6—80లగా 3—10—1980వరకు, 13—11—1980లగా 22—12—1980వరకు శుభుడు. వేధగోచారముచే 11—9—1980లగా 15-11-1980 కు గురుడు శుభుడు. వత్సరాది లగా 14—5—1980 వరకు, తిర్గి 30—5—80లగా 20—10—80కు శని పాపి. వత్సరమంతయు రాహు కేతువుల శుభులు. ఇట్లు సమాలోచన చేయగా ఈ రాశివారికి గతములో నెరవేరని గృహనిర్మాణాది మంగళ కార్యములు ఉత్తరార్ధమున నెర వేరగలవు. గతములో కొనసాగుచున్న క్రయ విక్రయములు లాభసాటిగా ఉత్తరార్ధమున నెరవేరగలవు. ఆకస్మిక ధనలాభము, సంతతి ప్రాప్తి కలుగును. వత్సరాది నుండి జూన్‌వర్కు పేచీలు తలయెత్తు చున్నను పిమ్మట అవియే వాట్లంతట సమసిపోవును. వ్యవసాయదారులకు తొలకరికంటే పైరు పంటలలో లాభదాయకముగనుండును. ఉద్యోగులకు ఆగస్టునుండి కోరిన తావులకు బదిలీలు, ప్రమోషనులు, వేతనాభివృద్ధిగ జరుగును. విద్యార్థులు అక్టోబరు ఛాన్సులో క్లాసులను సంపాదించగలరు. రాజకీయ నాయకులకు పూర్వార్ధమున కృష్యనుకూలముగను, ఉత్తరార్ధమున అంతకు మించియు గౌరవమును, పదవులను పొందగలరు. ప్లీడరులకు, డాక్టరులకు ధనార్జనము మొదట సామాన్యముగ నున్నను జూన్ నుండి సోపానమార్గమువలె క్రమేపియు నభివృద్ధిగా నుండును. కంట్రాక్టరులు మొదట కొద్ది పాటి పెట్టుబడితో ప్రారంభించి ఉత్తరార్ధమున ఉత్తరోత్తరాభివృద్ధిగా చేయుదురు. వర్తకులకు ఉత్తరార్ధమున మంచి లాభము కలుగును. కోర్టు వ్యాపారములు ఉత్తరార్ధమున కైవశముగ నుండును. వీరికి 2, 8, 20, 27 తారీఖులు ఆది, మంగళ, గురువారములు ప్రశస్తములు. వీరు పూర్వార్ధమున అభిషేకములు, ఈశ్వరార్చన శుభమును చేకూర్చగలవు.

అనూరాధ వారలకు :— వత్సరమంతయు గురుడు పాపి. వత్సరమంతయు శని, కేతువు శుభుడు. 6-6-1980 నుండి 12-2-81 వరకు రాహువు పాపి.

జ్యేష్ఠవారలకు :— వత్సరమంతయు గురుడు పాపి. వత్సరమంతయు శని శుభుడు. 12-2-81 నుండి ఆ వత్సరం రాహువు పాపి. వత్సరమంతయు కేతువు శుభుడు.

## ధనుస్సు:- సౌరగోచారము (ధనుర్మాసములో పుట్టినవారికి)
### చాంద్రగోచారము (మూ 4పా. పూషా 4పా. ఉషా 1 పా)

వత్సరాది ప్ర॥ భాద్రపద బ౹౹ య శుక్ర 26-9-1980 వరకు భాగ్యమున గురుడు సువర్ణమూర్తి పూర్తి శుభుడు. తదారభ్యావత్సరము రాజ్యమున రజితమూర్తి అర్ధశుభుడు. శని వత్సరాది ప్ర॥ ఆషాఢ శు ౧౪ ఆది (27—7—80) వార పర్యంతము భాగ్యమున శని తామ్ర మూర్తి పాదశుభుడు. తదారభ్యావత్సరము రాజ్యమున శని రజితమూర్తి అర్ధశుభుడు. రాహు కేతువులు వత్సరాది ప్రభృతి అధికజ్యేష్ఠ బ౹౹ శుక్ర (6—6—1980) వార పర్యంతం 9—3 రాసులయందు తామ్రమూర్తులు పాపులు. తదారభ్యావత్సరాది 8—2 రాసులయందు రాహుకేతువులు తామ్రమూర్తులు పాపులు. కుజుడు వత్సరాది లగా 28—6—80 కు, 19—8—80 లగా 13—11—80 కు, 29—1—81 లగా 8—3—81 కు శుభుడు. వేధగోచారముచే 6—7—80 లగా 11—9—80 కు తిర్గి 26—9—80 లగా ఆవత్సరము గురుడు శుభుడు. 14—5—80 లగా 30—5—80 వర్కు తిరిగి 27—7—80 లగా॥ ఆవత్సరం శని పాపి. వత్సరమంత రాహువు శుభుడు. వత్సరమంత కేతువు శుభుడు. ఇట్లు పరిశీలించగా ఈ రాశివారికి అక్టోబరువరకు చాల మంచిదినములే అని చెప్పవలయును. పిమ్మట సామాన్యముగా నడచును. గృహ నిర్మాణము, వివాహాది మంగళ కార్యములు వైశాఖ శ్రావణములలో నెరవేరగలవు. గౌరవమునకు భంగముండదు కాని మధ్య మధ్య ఋణము చేయవలసి యుండును. అక్టోబరునుండి కుటుంబ సౌఖ్యము స్వల్పముగ నుండును. జూన్‌నుండి మధ్య మధ్య ఔషధసేవ అవసరమగును. వ్యవసాయ దారులకు తొలకరిపంట సమృద్ధిగ పండును. వర్తకులకు పూర్వార్ధము లాభదాయకముగ నుండును. ఉద్యోగులకు పూర్వార్ధమున ప్రమోషను లభించును. అధికారులు గౌరవించెదరు. ప్రజాగౌరవమును సంపాదించగలరు. విద్యార్థులు శ్రమపడి కృషిచేసిన మార్చిలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులుకాగలరు. రాజకీయ నాయకులు ఈ వత్సరారంభ కాలమున పదవులను పొందగలరు. జూన్‌నుండి తప్పించుకుని మౌనము వహించుట మేలు. కంట్రాక్టరులు అక్టోబరుదాకా కలసివచ్చిన ధనమును చూచి పిమ్మట పెద్ద పెద్ద పెట్టుబడులతో ముందుకు సాగకూడదు. కోర్టు వ్యాపారములు అక్టోబరులోగా కైవశ మగును. పిమ్మట రాజీపడుట శ్రేయము. వీరికి 3, 9, 21, 28 తారీఖులు, సోమ, బుధ, శుక్రవారములు ప్రశస్తము. విష్ణు సహస్ర స్తోత్రనామ పారాయణ, లలితా సహస్రనామ స్తోత్ర పారాయణము చేసిన మేలుగానుండును.

మూలవారలకు :— వత్సరమంతయు గురుడు పాపి. వత్సరమంతయు శని, రాహువులు శుభులు. 6—6—80 లగా ఆవత్సరం కేతువు పాపి.

పూ.షా వారలకు :— 15-11-80 లగా ఆవత్సరం గురుడు శుభుడు. 20-10-80 లగా ఆవత్సరం శని పాపి. వత్సరమంతయు రాహువు శుభుడు. వత్సరమంత కేతువు పాపి.

## మకరము:- సౌరగోచారము (మకరమాసములో పుట్టినవారికి)
### చాంద్రగోచారము (ఉషా 2-3-4 పా. శ్రవ 4 పా ధని 1-2 పా)

వత్సరాది ప్ర॥ భాద్రపద బ౹౹ శుక్ర [26—9—1980] వార పర్యంతం 8 వ ఇంట గురుడు తామ్రమూర్తి పూర్తి పాపి. శ్రమను చేయును. తదాద్యావత్సరము భాగ్యమున లోహమూర్తి అర్ధశుభుడు. శని వత్సరాదారభ్య ఆషాఢ శు ౧౪ ఆది [27—7—1980] వరకు 8వ ఇంట రజితమూర్తి సామాన్యుడు. తదారభ్య ఆవత్సరం భాగ్యమున సువర్ణమూర్తి అర్ధ శుభుడు. రాహుకేతువులు వత్సరాది ప్ర॥ అధికజ్యేష్ఠ బ౹౹ శుక్ర [6—6—1980] వార పర్యంతం 8—2 రాసుల యందు సువర్ణ మూర్తులు అర్ధశుభులు తదారభ్య ఆవత్సరం 7—1 రాసుల యందు రజితమూర్తులు పాదాధిక శుభులు కుజుడు 28—6—80 లగా 19—8—80 వర్కు 3—10—80 లగా 24—12—80 వర్కు 8—3—81 లగా ఆవత్సరం శుభుడు.

వేధగోచారముచే వత్సరాది ప్ర॥ 26-9-80 వరకు గురుడు శుభుడు. వత్సరాది ప్ర॥ 27-7-80 వర్కు శనిపాపి. వత్సరాది ప్ర॥ 6-6-80 వరకు రాహువు పాపి. 6-6-80 లగా 9-10-80 వర్కు కేతువు శుభుడు. ఇట్లు విచారణ చేయగ ఈ సంవత్సరములో గత సంవత్సరములోవలె ఇబ్బందులు విడువవని పించుచున్నవి. అష్టమమున శని, గురు, రాహువుల ప్రభావము హెచ్చుగా కనుపడుచున్నది. కార్య విలంబము తప్పదు. అనవసర పేచీలు వచ్చుచుండును. ప్రజాగౌరవము సన్నగిల్లును. ఋణభారమెక్కువగా నుండును. కుటుంబమున దాయాదులతోను, దారపుత్రాదులతోను విడనికలతలు రేగును. ఈరాశి వారికి జూలై నుండి అంచెలువారిగ అన్ని శ్రమలు తొలగి వత్సరాంతమునకు సామాన్య పరిస్థితి నందుకొనగలరు. వత్సరమంతయు ఔషధసేవ తప్పదు. గృహ నిర్మాణాదల పట్ల, వివాహాది శుభకార్యముల యందు విలంబము పొడసూపు చున్నది. వ్యవసాయ దారులకు పైరులు తొలకరికంటే ఫలించును. వర్తకులు పూర్వార్ధము చాల శ్రమగ నండునట్లు తోచుచున్నది. ఉద్యోగులకు బదిలీలు కోరుట మంచిదికాదు. అసిధారా వ్రతముగ నుండును. విద్యార్థులు శ్రమపడి కృషి చేయగ అక్టోబరు ఛాన్సు అనుకూలముగ నుండును. రాజకీయ నాయకులకు గౌరవ మర్యాదలు సామాన్యముగ నుండును. డాక్టరులకు, లాయరులకు శ్రమకు తగిన ఫలము కానరాదు. కంట్రాక్టు దారులు జాయంటుగ ఉన్నవారితో ఆదాయ వ్యయములు చూచుకొనుచు ముందుకుసాగుట మంచిది. కోర్టు వ్యాపారములు అపరిష్కృతములుగ నిలచిపోవును. ఈ రాశి వారికి 4, 10, 22, 29 తారీఖులు, మంగళ, గురు, శనివారములు శుభ ప్రదములు. వీరనుదినము నమకపారాయణ, ఇదియుగాక రుద్రపారాయణ, బిల్వార్చన, విష్ణు సహస్రనామ పారాయణ, సుందరకాండ పారాయణ చేయుటచే ఆపన్నివారణ అయి శుభనుగును.

ఉ. షా వారలకు :– 11–9–80 లగా 15–11–80 వరకు గురుడు శుభుడు. ఉగాది నుండి 14–5–80 వర్కు తిర్గి 30–5–80 లగా 20–12–80 వర్కు శని పాపి. వత్సరమంతయు రాహుకేతువులు శుభులు.

శ్రవణం వారలకు :– ఉగాది నుండియు 26–9–80 వరకు గురుడు శుభుడు. వత్సరాది నుండి 27–7–80 వర్కు శనిపాపి. ఉగాది నుండి 6–6–80 వర్కు రాహువు పాపి. వత్సరమంతయు కేతువుపాపి.

ధనిష్ఠ వారలకు :– వత్సరమంతయు గురుడు పాపి. వత్సరమంతయు శని శుభుడు. 6–6–80 లగా ఆవత్సరం రాహువు పాపి. 6–6–80 లగా 9–10–80 వర్కు కేతువు పాపి.

## కుంభము : సౌరగోచారము (కుంభమాసములో పుట్టినవారికి)

## చాంద్రగోచారము (ధని 3-4 పా. శత 4 పా. పూ భా 1-2-3 పా)

వత్సరాది ప్ర॥ భాద్రపద బ ౹౩ శుక్ర [26-9-1980] వారపర్యంతం సప్తమమున గురుడు రజతమూర్తి త్రిపాద శుభుడు. తదారభ్యా వత్సరము 8వ యింట గురుడు తామ్రమూర్తి పాపి శ్రమకారి. శనివత్సరాది ప్రభృతి ఆషాఢ శు ౧౫ ఆది [27-7-1980] వారం వరకు సప్తమముగ సువర్ణమూర్తి అర్ధశుభుడు. తదారభ్యా వత్సరం అష్టమమున లోహమూర్తి. పూర్తిగ శ్రమకారి. రాహుకేతువులు వత్సరాది ప్ర॥ అధికజ్యేష్ఠ బ ౮ శుక్ర [6-6-1980] వారం వర్కు 7-1 రాసుల యందు రజితమూర్తులు పాదాధిక శుభులు. తదాద్యావత్సరం 6-12 రాసుల యందు సువర్ణమూర్తులు పూర్తి శుభులు. కుజుడు 19-8-80 లగా 3-10-80కు 13-11-80 లగా 29-1-81 కు శుభుడు. వేధగోచారముచే వత్సరమంతయు గురుడు పాపి. వత్సరమంతయు శని శుభుడు. 6-6-80 లగా ఆవత్సరం రాహువు పాపి. వత్సరమంతయు కేతువు పాపి॥ ఇట్లు విచారణ చేయగా గతములో నెఱవేరని కట్టడములు, గృహ నిర్మాణములు, వివాహాది మంగళ కార్యములు బహు ప్రయత్నముచే అక్టోబరులోగా నెఱవేరును. ఈ కాలమున తగిన గౌరవము లభించును. ఉత్తరార్ధమున ప్రతి కార్యము నందు ప్రతిఘటన కలుగవచ్చును. శ్రమ,బడలిక అధికమగును. మధ్య మధ్య ఔషధసేవ తప్పదు. అపవాదములు వచ్చు సావకాశము గలదు. జూన్, జూలై నెలలలో గౌరవ మధికమగును. వ్యవసాయ దారులకు పైరుకంటే తొలకరి సమృద్ధిగ నండును. వర్తకులకు పూర్వార్ధము లాభదాయకము. ఉద్యోగులు పూర్వార్ధమున అధికారుల మన్ననలను పొంది ప్రమోషనుల నందుకొనగలరు. ఉత్తరార్ధమున జాగరూకత అవసరం. విద్యార్థులకు మార్చి ఛాన్సు అనుకూలము. కృషికొలది క్లాసులను తెచ్చుకొనగలరు. రాజకీయ నాయకులకు ఆగస్టులోగా పలుకుబడి హెచ్చి ప్రజలలోను, ప్రభుత్వములో ఆదరణ కలిగి తగిన పదవులను చేబట్టగలరు. కంట్రాక్టరులకు ఉత్తరార్ధము శ్రమగ నుండును. జాయంటు అవసరమగును. డాక్టరులకు, లాయరులకు పూర్వార్ధము లాభదాయకముగ నుండును. కోర్టు వ్యాపారములు ఆగస్టులోగా తేల్చుకొనిన విజయమును పొందగలరు. ఈరాశి వార్కి 5, 11, 23, 30 తారీఖులును; ఆది, బుధ, శుక్రవారములును ప్రశస్తము. వీరికి ఉత్తరార్ధమున సహస్ర లింగార్చన, సుందర కాండ పారాయణ, శనికి తైలాభిషేకం, మహా మృత్యుంజయ జపము శుభమును చేకూర్చును.

శతతార వారలకు :— వత్సరమంతయు గురుడు పాపి. వత్సరమంతయు శని, కేతువులు శుభులు. 12-2-81 లగా ఆవత్సరం రాహువు పాపి.

పూర్వాభాద్ర వారలకు :— వత్సరమంతయు గురుడు పాపి. వత్సరమంతయు శని, రాహు, కేతువులు శుభులు.

## మీనము :– సౌరగోచారము (మీన మాసములో పుట్టినవారికి)

## చాంద్రగోచారము (పూ. భా 4వ పా. ఉ. భా 4పా. రేవ 4 పా)

వత్సరాది ప్ర॥ భాద్రపద బ ౹౩ శుక్ర (26–9–80) వారము వరకు 6వ యింట గురుడు లోహమూర్తి పూర్తిపాపి చాల శ్రమను చేయును. తదారభ్యావత్సరం 7వ యింట రజితమూర్తి త్రిపాదాధిక శుభుడు. శని వత్సరాది లగా ఆషాఢ శు ౧౫ ఆది 27—7—1980వరకు 6వ యింట లోహమూర్తి అర్ధాల్పశుభుడు. తదారభ్యావత్సరము 7వ యింట సువర్ణమూర్తి అర్ధాల్ప శుభుడు వత్సరాది ప్ర॥ అధికజ్యేష్ఠ బ ౮ శుక్ర 6—6—1980 వరకు 6—12 రాసులయందు రాహు కేతువులు లోహమూర్తులు సామాన్యులు. తదాద్యావత్సరము 5—11 రాసుల యందు రాహు కేతువులు లోహమూర్తులు సామాన్యులు. కుజుడు ఉగాదినుండి 28—6—80 కు 23—10—80 లగా 13—11—80 కు, 22—12—80 లగా 8—3—81 వరకు శుభుడు. వేధగోచారముచే వత్సరమంతయు గురుడు పాపి. వత్సరమంతయు శని శుభుడు. 12—2—1981 లగా ఆవత్సరం రాహు పాపి. వత్సరమంతయు కేతువు శుభుడు. ఇట్లు సమీక్ష చేయగా అక్టోబరులోగ, గృహనిర్మాణాది కట్టడములకు, వివాహాది శుభకార్యములకు అవరోధములు కనుపడుచున్నవి. అక్టోబరు దాటిన తరువాత పాత వివాదములు సమసిపోవును. 1980 వర్కు మనస్థిమితము తక్కువగ నుండును. స్థితి వేధగోచారములు సమబలము కలవిగ నుండుటచే మంచిచెడ్డలు కలయికతో నుండును. ఆందోళన అధికమగును. వ్యవసాయదారులకు తొలకరి పైరు కూడ స్వల్పభేదముతో ఫలించును. వర్తకులకు ఆదాయ వ్యయములు ఈషద్వైషమ్యముతో నుండును. విద్యార్థులకు మార్చి ఛాన్సు అనుకూలము. ఉద్యోగులు బదిలీలు కోరక యథాస్థానమందుండుట మేలు. రాజకీయ నాయకులకు ఉన్నత పదవులు లభించుట అతికష్టము. డాక్టరులు లాయరులు శ్రమకు అనువగు ఫలమును పొందజాలరు. కంట్రాక్టరులకు శ్రమయే మిగులును. కోర్టు వ్యాపారములు వాయిదా కోరుట మంచిది. ఈ రాశివారికి 6, 12, 24, 31 తారీఖులు, సోమ, గురు, శనివారములు మంచివి. ఈ వత్సరమంతయు అనుదినము నవగ్రహస్తోత్ర పారాయణ, లలితా సహస్రనామ స్తోత్ర పారాయణ. దుర్గ పూజలు, అభిషేకము చేసిన శుభము కలుగును.

ఉత్తరాభాద్రవారలకు:- 15-11-80 లగా ఆ వత్సరము గురుడు శుభుడు. 30-10-80 లగా ఆ వత్సరం శని పాపి. వత్సరమంతయు రాహుకేతువుల శుభులు.

రేవతి వారలకు:- 11—9—80 లగా 15—11—80 కు గురుడు శుభుడు. ఉగాది నుండియు 14—5—80 వర్కు తిర్గి 30—5—80 నుండి 20—10—80 వరకు శని పాపి. ఈ వత్సరమంతయు రాహుకేతువులు శుభులు.

## జాతా శౌచాది విషయములు

స్త్రీలు బహిష్టు అయినప్పుడు, పురుడు వచ్చినపుడు, మరణము కలిగినను రాత్రి ప్రమాణమును 3చే భాగింపగా మొదటి 1—2 భాగములలోగా నగుచో పూర్వదినమనియు 3వ భాగములోనయిన పరదినమనియు లెక్కించనగును. గర్భము 6 మాసములు దాటినది లగాయతు అనగా 7వ మాసము వచ్చినది లగాయతు జ్ఞాతులకు అందరకును ప్రసవాశౌచము 10 రోజులు పట్టవలయును.

మరణాశౌచము :— శిశువు గర్భమునందే మరణించినచో తల్లిదండ్రులకు, జ్ఞాతులకు 10 రోజులు పురుడు. శిశువు జన్మించి నాభిచ్ఛేదము కాకుండగానే మరణించినచో తల్లికి 10 దినములు పురుడు. తండ్రికి జ్ఞాతులకు 3 రోజులు జాతాశౌచము. మృతాశౌచము స్నానమాత్రముచే శుద్ధి. శిశువు నాభిచ్ఛేదానంతరము 10 దినములలోపుగా మరణించినచో జ్ఞాతులందరకు జాతాశౌచము కలదు. మృతాశౌచము స్నానమాత్రము చే శుద్ధి.

పురుడు శుద్ధి అయినప్పటి నుండియు దంతోత్పత్తి కాలమగు 6 మాసములలోపుగా శిశువు మరణించినచో తలిదండ్రులకు 3రోజులా శౌచము. జ్ఞాతులకు స్నానము మాత్రము.

6 మాసములు దాటినది లగాయతు 3 సంవత్సరములు నిండులోపుగా మరణించిన తల్లిదండ్రులకు లకు 3 దినములు, మగశిశువగుచో జ్ఞాతులకు ఒకరోజు ఆశౌచము. ఆడపిల్లయగుచో స్నానమాత్రమే జ్ఞాతులకు చేయదగియున్నది.

3 సంవత్సరములు దాటినది మొదలు ఉపనయన పర్యంతము మగవాడు మరణించిన జ్ఞాతులకు తల్లిదండ్రులకు 3 రోజులా శౌచము. వివాహోపనయనముల కాలముదాటిన స్త్రీ పురుషులు మరణించిన జ్ఞాతులు తలిదండ్రులు 10 రోజులు పూర్ణాశౌచము పట్టవలెను. రజస్వల అయిన స్త్రీ వివాహము కాకపోయినను మరణించినచో 10 రోజులు పూర్ణాశౌచము తల్లిదండ్రులు జ్ఞాతులుపట్టవలెను.

## మృతివిషయమై చెడునక్షత్రములు మొదలగునవి

౧,౨,౬,౭,౧౦,౧౨,౧౩,౧౪ ఈ తిథులు ఆది:, మంగళ, శుక్ర, శనివారములు, కృత్తిక, రోహిణి, మృగశిర్ష, పునర్వసు, మఘ, ఉత్తర, చిత్ర, విశాఖ, ఉత్తరాషాఢా, ధనిష్ఠ, శతతార, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి ఈ నక్షత్రములు దోషములు. వీటియందు మృతిసంభవించినచో గృహమునకు దోషము. నక్షత్రము చెడుదైనచో అధికదోషము. నక్షత్రము మంచిదై మిగిలినవి చెడువైనచో స్వల్పదోషము.




ఈ చక్రము సూర్యుడు కృత్తిక నక్షత్రములో నుండగా చూపబడినది. సూర్యుడున్న నక్షత్రము మొదలు మృత నక్షత్రము వరకు నభిజిత్తుతో కూడా లెక్కించవలెను. సూర్యుడున్న నక్షత్రము ఈశాన్య దిక్కున వ్రాసి అచటనుండి లోపల నాలుగు నక్షత్రములు దిక్కులయందు వ్రాసి లోపలనుండి వెలుపలకు మూడు నక్షత్రములు దిక్కులయందు వ్రాయవలెను. అంతరంగము నందయితే మూడు పక్షములు మధ్యయందయితే రెండు పక్షములు దాని తరువాతదయిన నొకపక్షమును గృహమును విడువవలయును బాహ్యమందు శుభము. ఇంక పక్షిణీ విషయము.

సన్నిహితమున నున్న త్రిరాత్రమనియు అసన్న హితమయిన 90 ఘటికలనియు కొందరిమతము. మరికొందరు సన్నిహితమున నున్నను అసన్నిహితమునవున్నను మృతాహము నుండి 3 దినములు ఆశౌచము పట్టి నాల్గవ దినమున ఉదయమున శుద్ధియగును. వివాహితులయిన కుమార్తెలకు దౌహిత్ర దౌహిత్రులకు వివాహితయైన పౌత్రికకు దశాహములోగా ఎప్పుడు తెలిసినను త్రిరాత్రమృతా శౌచము పట్టవలెను. 9 లేక 10 రోజులలో మృత విషయమును విన్నను 11వ రోజు దయముననే శుద్ధియగును. మృతాహమునుండి 3వ దినముదాటినదిలగాయతు దశాహములోగా విన్నచో కొందరు 90 ఘటికలనియు, మూడు దినములు పక్షిణియనియు, మరికొందరు స్నానమాత్రముతోనే శుద్ధియనియు, మరికొందరు ఒకపగలు ఒకరాత్రి పట్టదగునదనియు నభిప్రాయము కలదు. ఇందు త్రిరాత్రానంతరము దశాహము లోపుగా తెలిసిన ఒక పగలు ఒకరాత్రి అను అభిప్రాయమే యుక్తమని దోచుచున్నది. దీనికి వారివారి సాంప్రదాయము ప్రధానము. దశాహానంతరము తెలిసిన స్నానమాత్రముచేతనే శుద్ధియగును.

ఏకజాతీయములగు అనేకాశౌచములు కలియుటలోనేది మొదట యుత్పన్నమయినదో దానితోనే అంతమగును. తరువాత ఉత్పన్నమయినది మొదట విన్నను మొదట ఉత్పన్న మయినది తరువాత విన్నను మొదట ఉత్పన్నమయిన దానితోనే శుద్ధియగును. మొదట ఉత్పన్నమయిన దశరాత్రమృతా శౌచములో పిమ్మట ఉత్పన్నమయిన త్రిరాత్రమృతాసౌచము శుద్ధియగును.గాని త్రిరాత్రమృతా శౌచములో దశరాత్రమృతా శౌచము శుద్ధికాదు. మొదట ఉత్పన్నమయిన దశరాత్రమృతా శౌచము పట్టుచుండ పిమ్మట ఉత్పన్నమయిన జాతాశౌచము విన్నను దశరాత్రమృతా సౌచముతోనే శుద్ధియగును. ప్రథమముగా నుత్పన్నమయిన జాతాశౌచమున పిమ్మట ఉత్పన్నమయిన త్రిరాత్రమృతా శౌచమును శుద్ధిచేసికొని శేషజాతాశౌచమును పట్టవలెను. ప్రథమమున నుత్పన్నమయిన త్రిరాత్రమృతా శౌచకాలమున తరువాత ఉత్పన్నమయిన జాతాశౌచము సంభవించిన మృతాశౌచమును శుద్ధిచేసికొని శేషజాతాశౌచమును పట్టవలెను.

పక్షిణీ పట్టదగినవారు : పినతల్లులు, పెదతల్లులు, మేనమామభార్యలు,వీరి స్త్రీ పురుష సంతానము, మాతాపితామహులు, పెదతండ్రి, పినతండ్రి, వీరి స్త్రీపురుషసంతానము, అన్నదమ్ములు, వారి స్త్రీ పురుషసంతానము, వివాహమయిన కుమార్తెలు, అల్లుండ్రు, కూతురు స్త్రీపురుషసంతానము, సవతితల్లిసోదరులకు సాపత్ని సోదరసోదరీలకును (కొందరిమతము) పురుషులకు అక్కచెల్లెండ్ర భర్తలు భార్యసోదరులు అత్తమామలు.

పక్షిణీ పట్టదగనివారలు :— వివాహమయిన స్త్రీలకు పెదతండ్రి, పినతండ్రిభార్యలు, భర్త సోదరుని కుమార్తెలు, అక్కచెల్లెండ్రభర్తలు.

బ్రాహ్మణులకు 10 దినములు క్షత్రియులకు 12 దినములు, వైశ్యులకు 15 దినములు, శూద్రులకు 30 దినములని అన్ని ధర్మశాస్త్రములయందు ఆశౌచమని చెప్పబడియున్నది.

| విషయము | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషములు |
|---|---|---|---|---|---|
| గృహారంభం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | సో—బు—గు—శు | అశ్వి రో మృ పున ఉత్తరాత్రయం హ చి స్వా అనూ శ్ర ధ శత రే | వృ. మి. కన్య. ధ. కుం. మీ.(సిం.వృశ్చిక) | అష్టమశుద్ధి. కర్తరివీనా మిథున ధనుర్మాసములు నింద్యములు |
| గృహప్రవేశం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫. | సో—బు—గు—శు | రో మృ ఉత్తరాత్రయం చి అనూ ధ శత రే (పుష్య) | వృ. మి. సిం. క. వృ. ధ. కుం. మీ. | అష్టమశుద్ధి కలశ చక్రశుద్ధి (చతుర్థశుద్ధి) వృషభచక్రశుద్ధి |
| నిషేకము | ౨-౩-౫-౧౦ | సో—బు—గు—శు (శ) | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయం హ చి స్వా అనూ మూ శ్ర ధ శత రె | శుభయుతదృష్టములు. | సంధ్యాపర్వ ప్రదోష వ్రత శ్రాద్ధ దినములు నింద్యములు |
| గర్భాధానము | ౨-౩-౫-౭-౧౦-౧౩ | ఆ—సో—బు—గు—శు | రో మృ పున పు ఉత్తరాత్రయ హ చి స్వా అనూ శ్ర ధ శ ఆర్ద్రా పూర్వాత్రయం విశా | ,, | సంధ్యాపర్వ వ్రత శ్రాద్ధదినములు నింద్యములు |
| పుంసవనం, సీమంతము | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | ఆ—మం—బు—గు—శు | మృ పున పు హ అనూ శ్ర ధ శత రే (అశ్వి రో చి స్వా ఉత్తరాత్రయం) | మే. వృష. మి. తు. ధ. కుం. మీ. | పుంసవనమునకు 3 మాసం. సీమంతం ౪, ౬.౮ మాసములు |
| జాతకర్మ, నామకరణము | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩ | ఆ—సో—బు—గు—శు | అశ్వి రో మృ పున పు హ చి స్వా అనూ ఉత్తరాత్రయం శ్ర ధ శత రే | శుభలగ్నములు | అష్టమశుద్ధి |
| డోలారోహణము | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | ఆ—సో—బు—గు—శు | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయం హ చి అనూ రే స్వా శ్ర | ,, | ,, |
| నిష్క్రమణం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩ | సో—బు—గు—శు | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయం హ చి స్వా అనూ శ్ర ధ రే | మే. వృష. కర్కా. తు. ధ. మీ | ౪వ మాసం శుభం 3వ మాసమున్ను శుభము |
| అన్నప్రాశనం | ౨-౩-౫-౭-౧౦-౧౩-౧౫ | ఆ—సో—బు—గు—శు | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయం హ చి స్వా అనూ శ్ర ధ శత రే | మీన. మే. వృశ్చి వినా | దశమశుద్ధి పూర్వాహ్ణం పురుషులకు సరి నెలలు, స్త్రీలకు బేసి నెలలు |
| కర్ణవేధ | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩ | ఆ—సో—బు—గు—శు | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయం హ చి శ్ర ధ అనూ రే (ఆర్ద్ర) | వృ.మి.క.క.తు.ధ. మీ. (మే. మ) | ౬-౭-౮ మాసములు అష్టమశుద్ధి |
| కేశఖండనం | ౨-౩-౫-౭-౧౦-౧౩-౧౫ | సో—బు—గు—శు | అశ్వి మృ పున పు హ చి స్వా శ్ర ధ శత రే (జ్యే) | శుభలగ్నములు | ఉత్తరాయణం పూర్వాహ్ణం విషమవర్షములు అష్టమశుద్ధి |
| అక్షరాభ్యాసము | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౨ | సో—బు—గు—శు | అశ్వి పున పు హ చి స్వా అనూ శ్ర రే (ఆర్ద్ర మృ ధ శ) | మి. కన్యా. ధ. మీ. | అష్టమశుద్ధి ఉత్తరాయణం ౫వ సంవత్సరము శుభము |
| విద్యారంభం | ౨-౩-౫-౧౦-౧౧-౧౨ | బు—గు—శు | అశ్వి మృ ఆర్ద్ర పున పు ఆశ్లే పూర్వాత్రయం హ చిస్వా మూ శ్ర (ధశత అనూ) | మే. మి. క. క. తు.ధ. మ. మీ. | దివాభాగము |
| ఉపనయనం | ౨-౩-౫-౧౦-౧౧-(౬-౧౨) | సో—బు—గు—శు | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయం హ చి స్వా అనూ శ్ర ధ శ రే | శుభలగ్నములు | అష్టమశుద్ధి మీన చైత్రముశుభం |
| వివాహం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౨-౧౩-౧౫ | బు—గు—శు | రో మృ మ ఉత్తరాత్రయం హ స్వా అనూ మూ రే (అశ్వి శ చి ధ) | శుభలగ్నములు. | జామిత్రశుద్ధి మీనచైత్రము నింద్యము |
| నవవధూప్రవేశము | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩ | సో—బు—గు—శు | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయం హ చి స్వా అనూ మూ శ్ర ధ శత రే | ,, | ద్వాదశశుద్ధి విషమవర్ష మాసములు |
| నవవస్త్రాభరణ ధారణం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | బు—గు—శు | అశ్వి హ చి స్వా అనూ ధ రే (వర సై వృష, రో పున పు ఉత్తరాత్రయం) | వృ.మి.క.క.తు.ధ. మీ. | తృతీయశుద్ధి |
| వాపీకూపాదికము | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | సో—బు—గు—శు | అశ్వి రో మృ పుష్య ఉత్తరాత్రయం హ అనూ మూ శ్ర ధ శ రే (జ్యే) | కర్కా.మ.కుం.మీ. | అగ్ని, దక్షిణ, నిర్ఋతి, వాయు దిక్కులు గృహమధ్యం కూడదు |
| బీజావాపం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | సో—బు—గు—శు | రో పుష్యమి ఉత్తరాత్రయం హ స్వా అనూ మూ శ్ర శ రే అశ్వి మృ పున ధని | వృ.కర్కా.సిం.మ. (తు. మి. కుం) | అష్టమశుద్ధి 3-౬ లలో శుభులు కూడదు |
| వృక్షలతాదిస్థాపనం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | సో—బు—గు—శు | అశ్వి రో మృ పుష్యమ ఉత్తరాత్రయం హ చి చి అనూ మూ శ్ర శత రే | శుభలగ్నములు. | చతుర్థమునకు శుభదృష్టి వలయును. |
| దేవతాప్రతిష్ఠ | ౨-౩-౫-౭-౮ ౧౦-౧౧-౧౨-౧౩ | ఆ—సో—బు—గు—శు | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయం హ చి స్వా అనూ శ్ర ధ శ రే (దేవనక్షత్ర) | వృష.వృ.సిం.మి. కన్యా. ధ. కుం. మీ. | సౌమ్యదేవతలకు ఉత్తరాయణం ఉగ్రదేవతలకు దక్షిణాయాణం |
| యాత్ర | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩ | బు—గు—శు | అశ్వి మృ పున పు హ అనూ ధ శ రే (రో ఉత్తరాత్రయం మూశ) | మే. వృష. కర్కా. తు. ధ. మ. మీ. | పంచమశుద్ధి, సుశకునం |
| హలకర్మ | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | ఆ—మం—బు—గు—శు | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయం హ చి స్వా వి అనూ మూ శ్ర ధ శ రే | వృ. మి. కన్యా. వృ.ధ మీ. | కర్తరి కూడదు. |

శుభ ముహూర్తములకు మహాదోషములను విడువవలయును. ఆయా శుభ కర్మలకై ఇందు చెప్పబడినవియు తత్కాల మునకున్నవియు నగు తిథి (పక్షాదిగ లెక్కింప వలెను) నక్షత్ర, వార, లగ్న సంఖ్యలనుగలిపి 9చే భాగింప నగు శేషము 1 మృత్యు, 2 అగ్ని, 4 రాజ, 6 చోర, 8 రోగములను చేయును. 1, 2 శేష మగుట మిక్కిలి దోషము. 3, 5, 7, 9 శేషమగుట శుభము. గత తిథి సంఖ్యను లగ్న సంఖ్యను గలిపి 9చే భాగించుట మతాంతరము. ధ్రువకమును చేర్చరాదు. తిథి మాసాదిగ లెక్కించుట శాస్త్రీయముగాదు. కొన్నిట పక్షాదిగను—కొన్నిట మాసాదిగను వ్యవస్థ లేక పోవుట మిక్కిలి శాస్త్ర నిషిద్ధము

## నామ నక్షత్ర పరిజ్ఞానము

| | | | | | |
|---|---|---|---|---|---|
| చూ, చే, చో, లా | – | అశ్విని | రూ, రె, రో, తా | – | స్వాతి |
| లీ, లూ, లే, లో | – | భరణి | తీ, తూ, తే, తో | – | విశాఖ |
| అ, ఈ, ఉ, ఏ | – | కృత్తిక | నా, నీ, నూ, నే | – | అనూరాధ |
| ఓ, వా, వీ, వు | – | రోహిణి | నో, యా, యీ, యు | – | జ్యేష్ఠ |
| వే, వో, కా, కి | – | మృగశిర | యే, యో, బా, బి | – | మూల |
| కూ, ఘం, ఙ, ఛ | – | ఆర్ద్ర | బూ, ధ, భ, ఢా | – | పూ.షాఢ |
| కే, కో, హా, హి | – | పునర్వసు | బే, బో, జా, జీ | – | ఉ.షాఢ |
| హూ, హే, హో, డా | – | పుష్యమి | జూ, జె, జో, ఖ | – | అభిజిత్ |
| డీ, డూ, డే, డో | – | ఆశ్లేష | ఖి ఖూ, ఖె, ఖో | – | శ్రవణ |
| మా, మీ, మూ, మే | – | మఘ | గా, గీ, గూ, గే | – | ధనిష్టం |
| మో, టా, టీ, టు | – | పుబ్బ | గో, సా, సీ, సు | – | శతభిషం |
| టే, టో, పా, పి | – | ఉత్తర | సే, సో, దా, ది | – | పూ.భాద్ర |
| పూ, ష, ణ్ణ, ఢ | – | హస్త | దూ, శం, ఝ, థ | – | ఉ.భాద్ర |
| పే, పో, రా, రీ | – | చిత్త | దే, దో, చా, చీ | – | రేవతి |

వారివారి పేర్ల ననుసరించి పేరుయొక్క మొదటి అక్షరము చెప్పబడిన 27 నక్షత్రములలో ఏ నక్షత్రమున, ఏ పాదమునకు చెందినదగుచున్నదో దానినిబట్టి యూహింపవలయును. ప్రతి నక్షత్రమునకున్ను చెప్పబడిన 4 అక్షరములను 4 పాదములుగా తెలియవలెను. అక్షరసంధి గల పేర్లకు, (కృష్ణ ప్రూష శ్రీధర ఇత్యాదులకు) నిర్ణీత నక్షత్రములున్నవి. జన్మనక్షత్రమును గుర్తెరుంగనివారలకున్ను నామ నక్షత్ర ప్రధానము కొన్ని కొన్ని విషయములకున్ను నామనక్షత్రమును బట్టియే ఫలితముల నాలోచించి చెప్పవలెను.

## గ్రహములకు మిత్రత్వ శత్రుత్వ సమత్వములు

సూర్యునకు — శుక్ర, శనులు శత్రువులు. బుధుడు సముడు. ఇతరులు మిత్రులు. చంద్రునకు — సూర్య, బుధులు మిత్రులు. ఇతరులు సములు. శత్రువు లేడు. కుజునకు— రవి, చంద్ర, గురులు మిత్రులు. బుధుడు శత్రువు. శుక్ర, శనులు సములు. బుధునకు— రవి, శుక్రులు మిత్రులు. చంద్రుడు శత్రువు. ఇతరులు సములు. గురునకు — బుధ, శుక్రులు శత్రువులు. శని సముడు. ఇతరులు మిత్రులు. శుక్రునకు — బుధ, శనులు మిత్రులు. కుజ, గురులు సములు. ఇతరులు శత్రువులు. శనికి— బుధ, శుక్రులు మిత్రులు. గురుడు సముడు. ఇతరులు. శత్రువులు. (మూల త్రికోణరాశి నుండి, "స్వస్వాంత్యధీదర్మ స్వోచ్చాయుస్సుఖపా:" అను సూత్రముచే చెప్పబడినది వివరింపబడెను.)

## తాత్కాలిక మిత్రత్వ శత్రుత్వ సమత్వములు

అన్యోన్యస్య ధనవ్యయాయ సహజ వ్యాపార బంధుస్థితా స్తత్కాలే సుహృదస్స్వ తుంగభవనే ప్యేకే రయ స్త్వన్యథా॥ ద్వ్యేకానుక్త భవాన్సుహృత్సమ రిపూన్సంచింత్య నైసర్గికాం స్తత్కాలేతు పునస్తు తానధి సుహృన్మిత్రాదిభి: కల్పయేత్.

తా॥ ఒకరికొకరు 2, 12, 11, 3, 10, 4 స్థానములందున్న తాత్కాలిక (జననాది సమయము లందు) మిత్రులగుదురు. తమ ఉచ్చరాశియందున్న గ్రహము తనకు మిత్రమని కొందరి మతము. చెప్పబడిన వాటికంటే నితర స్థానములందున్న గ్రహములు తాత్కాలిక శత్రువులు. తన మూల త్రికోణరాశి నుండి 2, 12, 5, 9, 4, 8 ఉచ్చ రాశ్యధిపతులు మిత్రులు. ఇతరులు శత్రువులు. రెండు లక్షణము లున్న గ్రహములు సములు అను విషయము "స్వస్వాంత్యధి ధర్మస్వో చ్చాయుస్సుఖపా:" సూత్రమున గలదు. దీనిచే నగు శత్రు మిత్రాది విచారము పై శ్లోకములలో వివరింప బడినది. దానిచే నగు శత్రుత్వాదులు , ఈ శ్లోకముచే నగు తాత్కాలిక శత్రుత్వాదులను గమనించి అధిమిత్ర, అధి శత్రుత్వాదికము నిర్ణయింపవలెను. ఎట్లనగా— చెప్పబడిన మిత్రస్థానములందు మిత్ర గ్రహమున్న అధిమిత్రము, సముడున్న మిత్రము, శత్రువున్న సముడును అగును. ఇతరములగు శత్రుస్థానములందు మిత్రుడున్న సముడు., సముడున్న శత్రువు, శత్రువున్న అధిశత్రువునగును.

## లగ్నాది ద్వాదశభావములకు ఆధిపత్యములు

జన్మలగ్నము మొదలుకొని క్రమముగా ద్వాదశ భావములకు తను, ధన, భ్రాతృ, మాతృ, పుత్ర, శత్రు, కళత్ర, ఆయు, భాగ్య, రాజ్య, లాభ వ్యయములనెడు సంజ్ఞలగును.

మేష లగ్నమునకు:— లగ్నాష్టమాధిపతి కుజుడు, తృతీయ షష్ఠాధిపతిబుధుడు, ధనసప్తమాధిపతి శుక్రుడు, వాహనాధిపతి చంద్రుడు, పంచమాధిపతి సూర్యుడు, భాగ్య వ్యయాధిపతి బృహస్పతి ,రాజ్య లాభాధిపతి శని.

వృషభలగ్నమునకు:— లగ్న షష్ఠాధిపతి శుక్రుడు. ధన పంచమాధిపతి బుధుడు., తృతీయాధిపతి చంద్రుడు, వాహనాధిపతి సూర్యుడు, సప్తమ వ్యయాధిపతి కుజుడు, అష్టమ లాభాధిపతి బృహస్పతి, భాగ్య రాజ్యాధిపతి శని.

మిధున లగ్న మునకు:— లగ్న వాహనాధిపతి బుధుడు, ధనాధిపతి చంద్రుడు.' తృతీయాధిపతి సూర్యుడు., పంచమవ్యయాధిపతి శుక్రుడు, షష్ఠ లాభాధిపతి కుజుడు, సప్తమ రాజ్యాధిపతి బృహస్పతి, అష్టమ భాగ్యాధిపతి శని.

కర్కాటక లగ్నమునకు:— లగ్నాధిపతి చంద్రుడు, ధనాధిపతి సూర్యుడు, తృతీయ వ్యయాధిపతి బుధుడు, వాహన లాభాధిపతి శుక్రుడు, పంచమ రాజ్యాధిపతి కుజుడు, షష్ఠ భాగ్యాధిపతి బృహస్పతి, సప్తమాష్టమాధిపతి శని.

సింహలగ్నమునకు:— లగ్నాధిపతి సూర్యుడు. ధన లాభాధిపతి బుధుడు. తృతీయ రాజ్యాధిపతి శుక్రుడు, వాహన భాగ్యాధిపతి కుజుడు, పంచమాష్టమాధిపతిబృహస్పతి, షష్ఠ సప్తమాధిపతి శని, వ్యయాధిపతి చంద్రుడు.

కన్యాలగ్నమునకు:— లగ్న రాజ్యాధిపతి బుధుడు, ధన భాగ్యాధిపతి శుక్రుడు, తృతీయాష్టమాధిపతి కుజుడు, వాహన సప్తమాధిపతి బృహస్పతి, పంచమ షష్ఠాధిపతి శని, లాభాధిపతి చంద్రుడు, వ్యయాధిపతి సూర్యుడు.

తులా లగ్నమునకు:— లగ్నాష్టమాధిపతి శుక్రుడు, ధన సప్తమాధిపతి కుజుడు. తృతీయ షష్ఠాధిపతి బృహస్పతి, వాహన పంచమాధిపతి శని, భాగ్యవ్యయాధిపతి బుధుడు, రాజ్యాధిపతి చంద్రుడు, లాభాధిపతి సూర్యుడు.

వృశ్చిక లగ్నమునకు:— లగ్న షష్ఠాధిపతి కుజుడు, ధన పంచమాధిపతి బృహస్పతి, తృతీయ వాహనాధిపతి శని, సప్తమ వ్యయాధిపతి శుక్రుడు, అష్టమ లాభాధిపతి బుధుడు, భాగ్యాధిపతి చంద్రుడు. రాజ్యాధిపతి సూర్యుడు.

ధనుర్లగ్నమునకు:— లగ్న వాహనాధిపతి బృహస్పతి, ద్వితీయ తృతీయాధిపతి శని, పంచమ వ్యయాధిపతి అంగారకుడు, షష్ఠలాభాధిపతి శుక్రుడు, సప్తమరాజ్యాధిపతిబుధుడు, అష్టమాధిపతి చంద్రుడు భాగ్యాధిపతి సూర్యుడు.

మకర లగ్నమునకు:— లగ్న ద్వితీయాధిపతి శని, తృతీయ వ్యయాధిపతి బృహస్పతి, వాహనలాభాధిపతి కుజుడు, పంచమ రాజ్యాధిపతి శుక్రుడు, షష్ఠ భాగ్యాధిపతిబుధుడు, సప్తమాధిపతి చంద్రుడు, అష్టమాధిపతి సూర్యుడు.

కుంభ లగ్నమునకు:— లగ్న వ్యయాధిపతి శని, ధన లాభాధిపతి బృహస్పతి, తృతీయ రాజ్యాధిపతి కుజుడు, వాహనభాగ్యాధిపతి శుక్రుడు, పంచమాష్టమాధిపతి బుధుడు,షష్ఠాధిపతి చంద్రుడు, సప్తమాధిపతి సూర్యుడు.

మీన లగ్నమునకు:— లగ్న రాజ్యాధిపతి బృహస్పతి, ధన భాగ్యాధిపతి కుజుడు, తృతీయాష్టమాధిపతి శుక్రుడు, వాహన సప్తమాధిపతి బుధుడు. పంచమాధిపతి చంద్రుడు, షష్ఠాధిపతి సూర్యుడు, లాభ వ్యయాధిపతి శని.

## కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ - సూర్యదశ సం॥ 6 భుక్తులు—అంతరములు

| భుక్తుల వివరము | నెల | దినం | సూర్యుడు | చంద్రుడు | కుజుడు | రాహు | గురు | శని | బుధుడు | కేతు | శుక్రుడు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ |
| సూర్యుడు | 3 | 18 | సూ 0– 5–24 | చం 0–15– 0 | కుజ 0– 7–21 | రా 1–18–36 | గురు 1– 8–24 | శని 1–24– 9 | బుధ 1–13–21 | కేతు 0– 7–21 | శు 2– 0– 0 |
| చంద్రుడు | 6 | 0 | చం 0– 9– 0 | కుజ 0–10–30 | రా 0–18–54 | గురు 1–13–12 | శని 1–15–36 | బుధ 1–18–27 | కేతు 0–17–51 | శు 0–21– 0 | సూ 0–18– 0 |
| కుజుడు | 4 | 6 | కుజ 0– 6–18 | రా 0–27– 0 | గురు 0–16–48 | శని 1–21–18 | బుధ 1–10–48 | కేతు 0–19–57 | శు 1–21– 0 | సూ 0– 6–18 | చం 1– 0– 0 |
| రాహువు | 10 | 24 | రా 0–16–12 | గురు 0–24– 0 | శని 0–19–57 | బుధ 1–15–54 | కేతు 0–16–48 | శు 1–27– 0 | సూ 0–15–18 | చం 0–10–30 | కుజ 0–21– 0 |
| గురుడు | 9 | 18 | గురు 0–14–24 | శని 0–28–30 | బుధ 0–17–51 | కేతు 0–18–54 | శు 1–18– 0 | సూ 0–17– 6 | చం 0–25–30 | కుజ 0– 7–21 | రా 1–24– 0 |
| శని | 11 | 12 | శని 0–17– 6 | బుధ 0–25–30 | కేతు 0– 7–21 | శు 1–24– 0 | సూ 0–14–24 | చం 0–28–30 | కుజ 0–17–51 | రా 0–18–54 | గురు 1–18– 0 |
| బుధుడు | 10 | 6 | బుధ 0–15–18 | కేతు 0–10–30 | శు 0–21– 0 | సూ 0–16–12 | చం 0–24– 0 | కుజ 0–19–57 | రా 1–15–54 | గురు 0–16–48 | శని 1–27– 0 |
| కేతువు | 4 | 6 | కేతు 0– 6–18 | శు 1– 0– 0 | సూ 0– 6–18 | చం 0–27– 0 | కుజ 0–16–48 | రా 1–21–18 | గురు 1–10–48 | శని 0–19–57 | బుధ 1–21– 0 |
| శుక్రుడు | 12 | 0 | శు 0–18– 0 | సూ 0– 9– 0 | చం 0–10–30 | కుజ 0–18–54 | రా 1–13–12 | గురు 1–15–36 | శని 1–18–27 | బుధ 0–17–51 | కేతు 0–21– 0 |
| మొ: సం: | 6 | 0 0 | 3–18– 0 | 6– 0– 0 | 4– 6– 0 | 10–24– 0 | 9–18– 0 | 11–12– 0 | 10– 6– 0 | 4– 6– 0 | 12– 0– 0 |

## రోహిణి, హస్త, శ్రవణం - చంద్రదశ సం॥ 10 భుక్తులు అంతరములు

| భుక్తుల వివరము | నెల | దినం | చంద్రుడు | కుజుడు | రాహు | గురు | శని | బుధుడు | కేతు | శుక్రుడు | సూర్యుడు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ |
| చంద్రుడు | 10 | 0 | చం 0–25– 0 | కుజ 0–12–15 | రా 2–21– 0 | గురు 2– 4– 0 | శని 3– 0–15 | బుధ 2–12–15 | కేతు 0–12–15 | శు 3–10– 0 | సూ 0– 9– 0 |
| కుజుడు | 7 | 0 | కుజ 0–17–30 | రా 1– 1–30 | గురు 2–12– 0 | శని 2–16– 0 | బుధ 2–20–45 | కేతు 0–29–45 | శు 1– 5– 0 | సూ 1– 0– 0 | చం 0–15– 0 |
| రాహువు | 18 | 0 | రా 1–15– 0 | గురు 0–28– 0 | శని 2–25–30 | బుధ 2– 8– 0 | కేతు 1– 3–15 | శు 2–25– 0 | సూ 0–10–30 | చం 1–20– 0 | కుజ 0–10–30 |
| గురువు | 16 | 0 | గురు 1–10– 0 | శని 1– 3–15 | బుధ 2–16–30 | కేతు 0–28– 0 | శు 3– 5– 0 | సూ 0–25–30 | చం 0–17–30 | కుజ 1– 5– 0 | రా 0–27– 0 |
| శని | 19 | 0 | శని 1–17–30 | బుధ 0–29–45 | కేతు 1– 1–30 | శు 2–20– 0 | సూ 0–28–30 | చం 1–12–30 | కుజ 0–12–15 | రా 3– 0– 0 | గురు 0–24– 0 |
| బుధుడు | 17 | 0 | బుధ 1–12–30 | కేతు 0–12–15 | శు 3– 0– 0 | సూ 0–24– 0 | చం 1–17–30 | కుజ 0–29–45 | రా 1– 1–30 | గురు 2–20– 0 | శని 0–28–30 |
| కేతు | 7 | 0 | కేతు 0–17–30 | శు 1– 5– 0 | సూ 0–27– 0 | చం 1–10– 0 | కుజ 1– 3–15 | రా 2–16–30 | గురు 0–28– 0 | శని 3– 5– 0 | బుధ 0–25–30 |
| శుక్రుడు | 20 | 0 | శు 1–20– 0 | సూ 0–10–30 | చం 1–15– 0 | కుజ 0–28– 0 | రా 2–25–30 | గురు 2– 8– 0 | శని 1– 3–15 | బుధ 2–25– 0 | కేతు 0–10–30 |
| సూర్యుడు | 6 | 0 | సూ 0–15– 0 | చం 0–17–30 | కుజ 1– 1–30 | రా 2–12– 0 | గురు 2–16– 0 | శని 2–20–45 | బుధ 0–29–45 | కేతు 1– 5– 0 | శు 1– 0– 0 |
| మొ॥ సం॥ | 10 | 0 0 | 10– 0– 0 | 7– 0– 0 | 18– 0– 0 | 16– 0– 0 | 19– 0– 0 | 17– 0– 0 | 7– 0– 0 | 20– 0– 0 | 6– 0– 0 |

## మృగశిర, చిత్త, ధనిష్ఠ - కుజదశ సం॥ 7 భుక్తులు - అంతరములు

| భుక్తుల వివరము | నెల | దినం | కుజుడు | రాహు | గురు | శని | బుధుడు | కేతు | శుక్రుడు | సూర్యుడు | చంద్రుడు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ది ఘ | నెల ఘ | నెల ది ఘ |
| కుజుడు | 4 | 27 | కుజ 0- 8-34½ | రా 1–26–42 | గురు 1–14–48 | శని 2- 3-10½ | బుధ 1-20-34½ | కేతు 0- 8-34½ | శుక్ర 2–10– 0 | సూ 0– 6–18 | చం 0–17–30 |
| రాహువు | 12 | 18 | రా 0-22- 3 | గురు 1–20–24 | శని 1–23–12 | బుధ 1-26-31½ | కేతు 0-20-49½ | శుక్ర 0-24-30 | సూ 0–21– 0 | చం –10–30 | కుజ 0–12–15 |
| గురుడు | 11 | 6 | గురు 0-19-36 | శని 1–29–51 | బుధ 1–17–36 | కేతు 0-23-16½ | శుక్ర 1-29-30 | సూ 0- 7-21 | చం 1– 5– 0 | కుజ 0– 7–21 | రా 1– 1–30 |
| శని | 13 | 9 | శని 0-23-16½ | బుధ 1–23–33 | కేతు 0–19–36 | శుక్ర 2- 6-30 | సూ 0-17-51 | చం 0-12-15 | కుజ 0–24–30 | రా 0–18–54 | గురు 0–28– 0 |
| బుధుడు | 11 | 27 | బుధ 0-20-49½ | కేతు 0–22– 3 | శుక్ర 1–26– 0 | సూ 0-19-57 | చం 0-29-45 | కుజ 0- 8-34½ | రా 2– 3– 0 | గురు 0–16–48 | శని 1– 3–15 |
| కేతువు | 4 | 27 | కేతు 0- 8-34½ | శుక్ర 2– 3– 0 | సూ 0–16–48 | చం 1- 3-15 | కుజ 0-20-49½ | రా 0-22- 0 | గురు 1–26– 0 | శని 0–19–57 | బుధ 0–29–45 |
| శుక్రుడు | 14 | 0 | శుక్ర 0-24-30 | సూ 0–18–54 | చం 0–28– 0 | కుజ 0-23-16½ | రా 1-23-33 | గురు 0-19-36 | శని 2– 6–30 | బుధ 0–17–51 | కేతు 0–12–15 |
| సూర్యుడు | 4 | 6 | సూ 0- 7-21 | చం 1– 1–30 | కుజ 0–19–36 | రా 1-29-51 | గురు 1-17-36 | శని 0-23-16½ | బుధ 1–29–30 | కేతు 0– 7–21 | శుక్ర 1– 5– 0 |
| చంద్రుడు | 7 | 0 | చం 0-12-15 | కుజ 0–22– 3 | రా 1–20–24 | గురు 1-23-12 | శని 1-26-31½ | బుధ 0-20-49½ | కేతు 1–24–30 | శుక్ర 0–21– 0 | సూ 0–10–30 |
| మొ॥ సం॥ | 7 | 0 0 | 4-27- 0 | 12–18–0 | 11 6– 0 | 13- 9- 0 | 11-27- 0 | 4-27 0 | 14– 0– 0 | 4– 6– 0 | 7– 0– 0 |

